

వర్ధమాన నటి రాజశ్రీ. (ఫొటో: ప్రభాకర్)


Studio Roopkala
రవీంద్ర ఆర్ట్ ప్రొడక్షన్స్
లక్షాధికారి
ఆంధ్ర, నైజాం..వాణీ
సీడెడ్....భాస్కర్
REVATHI
దర్శకత్వం... వి.మధుసూదనరావు
నిర్మాతలు... డి.వి.రెడ్డి.. తమ్మారెడ్డి కృష్ణమూర్తి

## రచయితలకు విజ్ఞప్తి

తమ రచనలతో కాక విడిగా స్టాంపులు పంపే వారి రచనలు తిప్పి పంపడం సాధ్యం కాదు. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే అవకాశం కూడా లేదని గుర్తించ ప్రార్థన.

# ఉత్తరాలు

## కథలు

"ఒకనాటి చిలిపి పని" చాలా బావుంది.

రాజారాణి, రాజో భాష్యకార (విశాఖపట్నం)

* * *

అరిగే రామారావుగారి 'ఒకనాటి చిలిపి పని' కథ చాలా బాగుంది. ఈ రచయిత 'ఆంధ్ర సచిత్ర వార పత్రిక' పాఠకులకు సుపరిచితులు. ఈ కథ వారి కథలన్నిటిలోకి మేల్బంతి అని చెప్పవచ్చు. వారి కలంనుంచి మరికొన్ని కథల్ని మీ పత్రికలో చదవాలని ఆశగా ఉంది!

పి. వెంకటేశ్వరరావు (వర్పయ్య అగ్రహారం)

* * *

"ఒకనాటి చిలిపిపని" కథ ఎంతో బాగున్నది. పేరు చూడగానే తమాషాగా ఉంటుంది అనుకున్న నా ఆశ తల్లక్రిందు లయినది. చదువుతూంటే పూర్తి అయినా తెలియకుండా కథలో "రామం" తోపాటు నేను కూడ స్తంభించిపోయినాను. రాము చేసిన ఒక చిన్న తప్పు ముగ్గురి జీవితాలు నాశనము చేసినది. రాజశేఖరం పాత్ర మెచ్చుకో తగ్గది.

అబ్బూరు ప్రభావతి (తెనాలి)

## హిందీ : సమాధానం

హిందీ పాఠాలు కూడా ప్రారంభించమన్న దానికి మీ రిచ్చిన సమాధానం చాలా శ్లాఘనీయంగా ఉంది.

హిందీని అమాయకంగా నేర్చుకొనడంవల్ల దాక్షిణాత్యులకు కలుగునున్న కీడు పుచ్చుకుడు గ్రహించి నట్లు లేదు. హిందీ నేర్చుకోడం మంచిదే. కాని హిందీని బలవంతంగా రుద్దమంటూనే హిందీ పరీక్ష ప్యాసు కానివారికి ఇంక్రిమెంట్లు ఆపుజెయ్యడం మొ. చూస్తే ప్రభుత్వంవారి మాటలలో నిజం బోధపడుతుంది. ఇందులో నిజా నిజాలు తెక్కిన పాఠకులు కూడా గ్రస్తారని తలుస్తాను.

ఒకసారి కీ. శే. రాజేంద్రప్రసాద్ మద్రాసులో మాట్లాడుతూ హిందీ పరీక్ష ప్యాసు అయిన వారిని చేతు లెత్తమన్నారు. ఆ చేతులు చూసి, "మాశారా హిందీ ఎంతమందికి వచ్చునో! కాబట్టి మద్రాసు వారు హిందీని వ్యతిరేకించడం తగదు" అన్నారు. దానికి మీ పత్రికలో ఒక పాఠకుడు ఇచ్చిన సమాధానం చాలా చక్కగా ఉంది.

సంజీవరెడ్డిగారు ఒకసారి అన్నాడు హిందీని మళ్లీ తరం వారికేగాని, ఈ తరంవారికి నిర్బంధం చెయ్యకూడదని. ఇది చాలా బాగుంది. ఇప్పుడు 4 వ తరగతినుంచి హిందీని నేర్చుకుని పరీక్షలు ప్యాసయిన వాళ్ళే తరువాత ఆఫీసుల్లో తడుము కోకుండా హిందీ వ్రాయగలరు.

ఇంగ్లీషు (పారద్రోలడం) నిజంగా భారతీయత కోసమే అయితే మనం తక్కిన విషయాల్లో కూడా (వేషం విషయంలోను, టీ పార్టీలు, డిన్నర్ పార్టీలు, కాక్ టెయిలు పార్టీలు మొ. ధనం వివరీతంగా వ్యయమయ్యే విషయాల్లో) కూడా ఆ విధానం ఎందుకు అవలంభించరాదు?

శాస్త్రి (హైదరాబాదు) ★












ఆంధ్రసచిత్రవార
# పత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం : 1—11—63
శోభకృన్నామ సం॥ (అధిక) కార్తిక పౌర్ణమి
సంపుటము : 56 సంచిక : 9
స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం చందా
వివరాలు

ఇండియా : రూ. 13.00 ఇతర దేశాలు . ఓడమీద (Sea Mail) రు. 20.00. (విమానం ద్వార (Air Mail): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా : 135.00.)

*

విడిప్రతి : 25 న.పై.
సంవత్సర చందా : 13-0-0.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1



వర్ధమాన నటి శారద

# మనలోమాట

ఈ సంచిక చేస్తున్న సమయంలో 'ఆంధ్రపత్రిక' సంస్థ వ్యవస్థాపకులు కీర్తిశేషులు, దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి ధర్మపత్ని శ్రీమతి రామాయమ్మగారు పరమపదించారు.

*　　*　　*

ఆంధ్రసచిత్రవారపత్రిక నిర్వహించిన నవలల పోటీలో వెయ్యిరూపాయిలు బహుమతిపొందిన నవలను గత వారమే ప్రారంభించాము. ఈ పోటీలో ద్వితీయ



బహుమతి రు 600 లు 'ఎండమావులు' అనే నవల చూరగొన్నది. దీని రచయిత శ్రీ హరికిషన్ విజయవాడ వాస్తవ్యులు. అసలుపేరు బి. యస్. ఆర్. కృష్ణారావు. పబ్లిక్ వర్క్సు శాఖలో పని చేసున్న వీరు యిదివరకు కథలు, నాటకాలు, "గగన కుసుమాలు" "పన్నీటి జల్లు" మున్నగు నవలలు రాశారు.

*　　*　　*

తృతీయబహుమతి రు 400 లు శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మగారు రచించిన "కూలిన గోడలు" నవల పొందినది. రచయిత్రి వ్రాసిన "నాడైరీలో ఒకపేజీ"యిటీవలే పాఠకులు చదివారు. వీరు విశాఖపట్నంలో వుంటున్నారు. రచయిత్రి ఫోటో వేద్దామనుకున్నాముగాని ... వారింకా పంపలేదు.

శ్రీ 'హరికిషన్'గారికి, శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మగారికి, యీ పోటీలో పాల్గొన్న యితర రచయితలకు యీ సందర్భంలో మా హృదయపూర్వక అభినందనలు అందజేస్తున్నాము.

*　　*　　*

వచ్చేవారంనుంచీ ప్రారంభించనున్న మరొక కొత్త శీర్షికకు సంబంధించిన ప్రకటన 50వ పేజీలో వేశాము.

*　　*　　*

# లోకంపోకడ



పదైనిమిదో రాజ్యాంగ సవరణ అనేది వస్తే అది ఇలా ఉండొచ్చు నయ్యా : "ప్రధాన మంత్రి పదవి తండ్రులనించి కూతుళ్లకు రావాలి" అని.

# విషయానుక్రమణిక

**కథలు :**

| | |
|---|---|
| తిరిగివచ్చిన కథ | — 12 |
| వేడి [ఆసియాకథ-3] | — 20 |
| వక్రగతులు | — 26 |

**సీరియల్ కథలు :**

| | |
|---|---|
| కొలంబో | — 18 |
| మనిషి · మిథ్య | — 22 |
| రామచరిత మానస్ | — 36 |
| ప్రేమకు పగ్గాలు | — 42 |

**శీర్షికలు, సినీమా :**

ఉత్తరాలు — 3, ఊమెన్ కార్ట్యూన్ — 6, హైదరాబాద్‌సినీమా — 8, ఢిల్లీలేఖ — 9. రాజధాని కబుర్లు — 10, మనమూ — మన దేహస్థితి — 11, వనితాలోకం — 16, వారఫలాలు — 34, మద్రాసుసినిమా — 51.



భారత
కమ్యూనిస్టు పార్టీ




"తీరప్రాంతప్రజలు మధ్యప్రాంతంలోవున్న
హిందీవాదుల్ని అణచివేస్తున్నారు"
లోహియా ఉద్ఘాటన— బహుశా ఆయన
లోకాన్ని తలక్రిందుగా చూస్తున్నారేమో!




పెకింగ్ పక్షులు




మీరే మా ప్రధానమంత్రి ఔదామనుకుని విదేశాంగమంత్రి అయ్యారు నేను ప్రధాన మంత్రి నౌదామని అసలే మీకొ కుండా పోయాను.
నాకన్నామీరే నయంకదా మరి!




పాపం! ఆవిడ అలా ఎంతసేపని ఆ జీను మీద కూర్చొ గలదు?
ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గం
OOMMEN



ఆంధ్రపత్రిక స్థాపకులు కీర్తిశేషులు దేశోద్ధారక విశ్వదాత కళాప్రపూర్ణ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారి ధర్మపత్ని శ్రీమతి రామాయమ్మగారు 16 వ తేదీ బుధవారం రాత్రి 10-10 గంటలకు మద్రాసులో శివసాయుజ్యము పొందారు. వారి వయస్సు 85 సంవత్సరములు.

దేశోద్ధారకుని ధర్మపత్నిగా, ఆదర్శ గృహిణిగా, దానశీలగా ప్రసిద్ధిపొందిన రామాయమ్మగారి మృతికి సంతాపసూచకంగా దేశవ్యాప్తంగా ప్రముఖుల సందేశాలు వస్తున్నవి.

# హైదరాబాద్ సినిమా

ప్రఖ్యాత నటులు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు ఆంధ్రుల రాజధానీ నగరానికి ఏ శుభ ముహూర్తాన వచ్చారో — క్రమేణా ఇక్కడ తెలుగు చిత్రపరిశ్రమ అభివృద్ధి చెందుతున్నది. శ్రీ అక్కినేని రాక అందుకు నాందీ వాక్యమే పలికింది.

సారథి స్టూడియోస్‌లో ఆరు చిత్రాలు నిర్మాణంలో ఉన్నాయి. ఇటీవలనే రెండవ 'ఫ్లోర్' నిర్మించటంతో నిర్మాతల ఇబ్బందులు కొంతవరకు తొలగాయి. ఒకేసారి రెండేసి చిత్రాల నిర్మాణం కొనసాగుతున్నది.

ప్రధానంగా అన్నపూర్ణా పిక్చర్సువారు మొదట్లో హైదరాబాదులోనే షూటింగ్ జరప నిశ్చయించటమే రాజధానికి కొత్తదనాన్ని కల్పించింది. నాగేశ్వరరావు స్థిర నివాసం ఇక్కడే ఏర్పాటు చేసికోవటంతో నిర్మాతలు హైదరాబాదుకే వస్తున్నారు.

ఈమధ్య మన మంత్రులు వాగ్దానాలమీద వాగ్దానాలు చేస్తున్నారు ఏదో కొత్త 'ఫిలిం కంపెనీ' ఉద్భవించటం, దానికి ఒక మంత్రిగారు ప్రారంభోత్సవం చేయటం, సమయానికి తగ్గట్లు సినిమాలను గురించి తెలిసిందీ, తెలియందీ మాట్లాడటం పరిపాటి అయిపోయింది. మన మంత్రులకు.

మంత్రుల వాగ్దానాలు కొందరు నిర్మాతలలో కొత్త ఉత్సాహాన్ని రేకెత్తిస్తున్నాయి. వేరొకవైపు మంత్రుల వాగ్దానాలలోని సత్యా సత్యాలను గ్రహించినవారు కూడా లేకపోలేదు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం హైదరాబాద్ సినిమా పరిశ్రమకు విశేషంగా చేయూతనిచ్చి, ప్రోత్సహించగలదని చాలా మంది ఆత్రుతతో ఎదురు చూస్తున్నారు.

ప్రభుత్వం ఈ బాధ్యతను సక్రమంగా నిర్వహించగలిగితే రాజధాని సినీ పరిశ్రమకు భిక్ష పెట్టినట్లే.

అందుకు ముఖ్యంగా రాజధానిలో కనీసం మరో స్టూడియో స్థాపనకు ప్రభుత్వం చేయూతనివ్వాలి. అవకాశం ఉన్నచోట, కొత్త స్టూడియో నిర్మాణానికి ఖాళీ స్థలాన్ని మంజూరు చేయటం, నిర్మాణావకాశాలు విరివిగా కల్పించటం జరగాలి.

ప్రభుత్వంమీద మరో బాధ్యత కూడా ఉంది. మద్రాసునుంచి 'షూటింగ్' నిమిత్తం వస్తున్న నటీ నటులకు, సాంకేతిక నిపుణులకు బొత్తిగా నివాస సౌకర్యాలులేవు. వచ్చిన వాళ్లంతా, ఏ తాజమహల్ హోటల్‌లోనో, ఏ బృందావన్‌లోనో ఉండటం జరుగుతున్నది. ముఖ్యంగా నటీ నటులు చాలా ఇబ్బంది పడుతున్నారు. వాళ్ళు బస చేస్తున్న హోటళ్ళచుట్టూ ప్రజలు తండోప తండాలుగా రావటం జరుగుతున్నది. ఇందువల్ల అందరికీ ఇబ్బందిగానే ఉన్నది.

మొన్న ఒక రోజున ఒక నటిని చూడటానికి ఒక హోటల్లో జనం విపరీతంగా చేరారు. వాళ్ళందరినీ బయటికి పంపించి వేయలేక ఆ హోటలు యజమాని సతమత మయ్యాడు.

సాంకేతిక నిపుణులకు కూడా తగు సౌకర్యాలు లేవనీ ఈ మధ్య ఒక డైరెక్టర్ నాతో అన్నారు. నగరంలోవున్న ముఖ్యమైన హోటళ్లకు సారథి స్టూడియోస్‌కు చాలా దూరం ఉండటంవల్ల కూడా చాలా సమయం రాక పోకలకు వృధా అవుతున్నదట.

ప్రభుత్వమే కొన్ని సౌకర్యాలు కల్పించవలసిన ఆవశ్యకతను సాంకేతిక నిపుణులు సూచిస్తున్నారు. ఆ సౌకర్యాలేవిటో ఎలా ఉండాలో ఒక వాక్యంలోనో, ఒక పేజీలోనో చెప్పేటంత చిన్నవికావు.

ఏమైనా ప్రభుత్వం, మన మంత్రులు చేస్తున్న వాగ్దానాలు వృధా పోకూడదు. మాటలు చేతల రూపంలోకి వచ్చిన రోజునే వాటికి విలువ ఉంటుందని భావిస్తున్నారు.

* * *

ప్రఖ్యాత దర్శకులు శ్రీ ఆదుర్తి సుబ్బారావు గారి దర్శకత్వంక్రింద రాజధానిలోని సారథి స్టూడియోస్‌లో బాబూ మూవీస్ వారి 'మూగ మనసులు' చిత్రం షూటింగ్ పూర్తి అయింది.

గత రెండు మూడు నెలలుగా ఈ చిత్రం షూటింగ్ శరవేగంతో కొనసాగింది. ఈ చిత్రం కోసం మద్రాసునుంచి తెలుగు తారాగణం అంతా తరలి వచ్చినట్లుంది.

ఈ చిత్రంలో నటిస్తున్న వారిలో ఒక్క హైదరాబాదులో నివసిస్తున్న శ్రీ అక్కినేని మినహా ఇస్తే అందరూ మద్రాసువారే. సావిత్రి, జమున, సూర్యకాంతం, గుమ్మడి, పద్మనాభం, నాగభూషణం మొదలగువారు ఇందులో నటిస్తున్నారు.

ఎడిటింగ్ మొదలైన పనులన్నీ ప్రారంభమయ్యాయి. ఇటీవలనే కొన్ని సాంకేతిక అవసరాల దృష్ట్యా, రాజమహేంద్రవరం వెళ్లి అక్కడ కొన్ని రోజులపాటు ఉండి వచ్చారు.

నవంబరు నెల మొదటి వారానికల్లా అంతా సిద్ధం చేయాలని నిర్మాతలు భావిస్తున్నారు. వెనువెంటనే సెన్సారు అనంతరం కనీసం 'దీపావళి' నాటికల్లా విడుదల చేయించాలని ప్రయత్నాలు జరుగుతున్నాయి.

**వాశిరాజు ప్రకాశం.** ★



**వర్ధమాన నటి సరస్వతి**

శ్రీకృష్ణ

# లంచాలమయమైన పరిపాలనం కాంగ్రెస్ సోషలిస్టు సామ్యవాదపు సారాతీరు!

కామరాజ్ పథకం అమలు దేశంలో రాజకీయ అస్థిరత్వాన్ని, పరిపాలనలో మాంద్యాన్ని కల్గించింది. కాంగ్రెస్ అధిష్ఠానవర్గం ఆలోచనలలోనే రెండు అతి ముఖ్యమైన తప్పులున్నాయి. ప్రధానమంత్రి దృష్టిలో 'కాంగ్రెస్‌వాళ్ళ'అనగానే కాంగ్రెస్‌కీ దేశానికీ భేదం లేదనిపిస్తుంది.' అలాగే కాంగ్రెస్ అధిష్ఠానవర్గానికి 'కాంగ్రెసేదేశం, దేశమే కాంగ్రెస్' అనే భావన కలుగుతున్నది. అసలీ ఊహే పెద్ద పొరబాటనే విషయాన్ని చాలాకాలం క్రిందటే స్వర్గీయ డా. అంబేద్కర్ రెండవ రౌండ్ టేబిల్ సమావేశంలో కుండబద్దలు కొట్టినట్లు చెప్పారు. ఆ రోజుల్లో ఈ అభేద సిద్ధాంతాన్ని ప్రతిపాదించింది ఎవరోకాదు సాక్షాత్తు మహాత్మాగాంధియే! ఈ వూహ తప్పుడు అంచనా అని అప్పుడే స్వర్గీయ యం. ఎ. జిన్నా నిరూపించారు కూడా. అయినా ఆ కాంగ్రెస్ ఇంకా ఆ భ్రాంతిలోనే కొట్టుకుంటున్నది.

ఇంక రెండో తప్పుడు అంచనా ఏమిటయ్యా అంటే దేశంకన్నా పార్టీయే గొప్పదనే భావన. కామరాజ్ పథకం అశాంతికి సూచకంగా ఉంది. అసలు కాంగ్రెస్ పార్టీని పటిష్టం చేయటమే ఆ పథకం ఉద్దేశ్యం. ఉత్తర, దక్షిణ భారత దేశాల్లో జరిగిన ఉప ఎన్నికలలో చిత్తైపోవటంతో ఈ ప్రతిపాదన అవసరమైంది. ఆ క్షణం ఏదో ఒకటి చెయ్యకపోతే వచ్చే ఎన్నికలలో తన బలం దిగజారటం ఖాయమన్న భయం పట్టుకుంది కాంగ్రెస్‌కు. దాని ఫలితమే కామరాజు పథకం. అంటే దేశం ఎలా బాగుపడుతుందా అని కాక, కాంగ్రెస్ పదవీకాలం ఎన్నేళ్ళు పొడిగించవచ్చా అని ఆలోచిస్తున్నారన్న మాట!

ఎన్నికలలో విజయాన్ని సంపాదించేది సత్పరిపాలనంగాని కాంగ్రెస్‌కాదు. కేవలం పార్టీని మరామతు చేసేనంతమాత్రాన దేశంలో పరిపాలన బాగుపడదు. పైగా కామరాజు పథకంవల్ల బాగు సంగతి ఎలా ఉన్నా—పరిపాలనలో మందకొడితనం ఎక్కువైంది. ఉదాహరణకు : కొన్ని వారాలుగా ఉత్తర ప్రదేశ్‌లో ప్రభుత్వం పోలిస్తోందంటారా! జమ్ము కాశ్మీర్‌లో అనిశ్చిత పరిస్థితులు కన్పిస్తున్నాయి. ఆఖరికి కేంద్రంలోనూ అంతే.

ఈ పథకాల సంగతి ఎలా ఉన్నా ముఖ్యంగా గత రెండేళ్ళగా పరిపాలనలో సర్వసామాన్య ప్రమాణాలు బాగా పడిపోయాయి. భారత రాజధానీ నగరంలో పైసా పడందే పని జరగదు. ఇలా అన్నందుకు చాలామంది కోపం వస్తుందేమో కూడా సరి! అన్ని రంగాలలోనూ అన్ని స్థాయాలలోనూ లంచగొండితనం విపరీతంగా పాకిపోయింది. ఎటొచ్చీ ఈ జాడ్యం పట్టంది ఐ. సి. యస్. వాళ్ళను మాత్రమే. ఈ ల. గో. తనం ఎంత విపరీతంగా ఉందన్న విషయాన్ని గూర్చి అధికార పక్షంలోని

54 వ పేజీ చూడండి



బ్రిటిష్ ప్రధానిగా నియుక్తులైన లార్డ్ హోం (ఎడమవైపువారు) ఆర్థికమంత్రి శ్రీ రెజినాల్డ్ మాల్డింగ్‌తో ముచ్చటలాడుతూ వుండగా తీసిన చిత్రం. ప్రస్తుత విదేశాంగ మంత్రిగావున్న లార్డ్ హోం ఆసుపత్రిలో చికిత్సపొందుతున్న ప్రధాని శ్రీ మాక్మిలన్‌ను చూచి బయటికి వస్తున్నారు. —యు. పి. ఐ.

# నగరంలో బస్సులకు కొత్త నెంబర్లు!

భిక్షుక నివారణ చట్టం, జంట నగరాల్లో అమలుచెయ్యటానికి ఏమి ప్రయత్నాలు జరిగినాయో అర్ధంకావటంలేదు. లాలాపేటలో వారి బసకోసం ఏర్పాటుచేసిన 'మకాములు' సరిపోవన్న మాట నిజమే! ఇంకా కొన్నిచోట్ల కూడా ఇలాంటి సదుపాయాలకోసం కృషి జరుగుతోంది. అన్నీ పూర్తి అయినా కూడా ఈ బిచ్చగాళ్లందరికీ చోటు దొరుకుతుందన్నమాట సంశయాస్పదమే. ఏది ఏమైనప్పటికీ ఈ చట్టం అమలులోకి వస్తే అంటువ్యాధుల బిచ్చగాళ్ల రద్దీ తగ్గుతుందేమోనని ప్రజలు ఆశించటంలో పొరపాటేమీ లేదు. అదే కనిపించలేదు. వాళ్లు ధారాళంగా బజార్లలోనూ, చిన్న చిన్న సందుల్లోనూ తిరగటం, వాళ్ల వికృతమైన అరుపులకు, ఇంకా ఇతర భయంకరమైన దృశ్యాలకు బడిపిల్లలు వింతగా వాళ్ల చుట్టూ చేరటం జరుగుతోంది. దీన్ని అరికట్టేవారెవ్వరూ కనిపించటంలేదు. ఇక ఈ చట్టంయొక్క ప్రయోజన మేమిటో అర్ధంకాదు. పెద్దపెద్ద బజార్లలో, కార్లలో తిరుగుతూ హెచ్చరికలు మాత్రం చేస్తున్నారు. ఉర్దూ తెలుగుభాషల్లో ఈ హెచ్చరిక బిచ్చగాళ్ల నుద్దేశించి 'ఈ చట్టం అతిక్రమిస్తే శిక్షార్హులగుదురు'. 'ఈ చట్టం ప్రకారం బిచ్చమెత్తటం నేరంగా పరిగణింపబడుతుంది.'. 'ఇది మానుకుని లాలాపేటలో ఉన్న భిక్షుక గృహానికి తరలి వెళ్లండి', ఈ హెచ్చరికలు బిచ్చగాళ్లు ఎంతవరకు వింటారో, విని ఆ సలహాలను పాటిస్తారో తెలీదు. ఇవిగాక బిచ్చగాళ్ల కోరికలంటూ కొన్ని ఉన్నాయి. అవిటివాళ్లు, ఇతరత్రా పని చెయ్యలేని వికలాంగులు, బిచ్చమెత్తటమే ప్రధాన వృత్తిగా పెట్టుకొన్నారు. దీన్ని నేరంగా పరిగణించటంవలన వాళ్ల వృత్తికి భంగం వచ్చింది. దీనికి నష్టపరిహారంగా వాళ్ల పిల్లలకు చదువులు చెప్పించాలని, ఇంకా కొంత ధనరూపంగా సహాయం చెయ్యాలనీ కోరికలు. ఇవన్నీ ఎంతవరకు సాధ్యమో ప్రభుత్వంవారు యోచించవలసి ఉంటుంది.

మన ప్రభుత్వాల తీరు తెన్నులు, దృక్పథాలు, వాళ్లు విధిస్తున్న పన్నులు చూస్తుంటే బీదవాళ్లను రాను రాను మరీ బీదవాళ్లుగా చేసెయ్యటం, ధనికుల్ని అత్యంత ధనవంతులుగాను చెయ్యటమే అనే విమర్శ ఉండనే ఉంది. ఏమైనప్పటికి తలకు మించిన పన్నుల భారం వలన అధిక ధరల వలన తక్కువ జీతాలతో కాలం వెళ్లబుచ్చుతున్న ఉద్యోగస్థుల స్థితి చాలా అధ్వాన్నంగా తయారవుతోంది. కేవలం వీధులవెంట తిరిగి బిచ్చమెత్తడమే కాదు, అవసరాలకు నిత్యం అటూ యిటూ సతమతమవుతూ ఉండటం కూడా ఓవిధంగా ఇలాంటి స్థితికి సంబంధించిందే అవుతుంది. ఇలాంటి దారుణ పరిస్థితి ఎంతకాలం కొనసాగుతుందో ఎవ్వరికీ అర్థంకావటంలేదు. దీనికి విరుగుడు ఏమన్నా ప్రభుత్వంవారే యోచించి తక్షణ చర్యలు తీసుకొనకపోతే మరింత ప్రమాదానికి దారితీయక తప్పదు.

## ఒట్టినంబర్లలోనే మార్పు?

ఆర్. టి. డి. బస్సు అధికారుల యాజమాన్యం గురించి అనేక విమర్శలు బయలుదేరినాయి. వాటికి సమాధానాలు ఏరి కూర్చుకున్నారు. ప్రతి దానికీ ఓ విమర్శ, దానికి సమర్ధింపు మామూలుగా ఉంటూనే ఉంటాయి. అవన్నీ అట్లా ఉండగా బస్సుల నెంబర్లన్నీ అక్టోబరు 15 వ తేదీ నుంచి మార్చేశారు. అన్ని బస్సులకు కొత్త నెంబర్లు యిచ్చేశారు. ఇన్నాళ్లబట్టీ ఒక నెంబరుకు అలవాటుపడ్డ జనం ఈ నెంబర్ల మార్పులకు తికమక పడటం సహజం. అయినా ఏ మార్పు వచ్చినా అది అభివృద్ధి సూచించేది లాగా ఉంటే, అందరూ



కేంద్రమంత్రి శ్రీ కె. రఘురామయ్య ఈ నెల 15 వ తేదీన విశాఖపట్నం నౌకా నిర్మాణ కేంద్రంలో "స్టేట్ ఆఫ్ మధ్యప్రదేశ్" అనే కొత్త నౌకకు జలప్రవేశోత్సవం చేశారు.

ఆహ్వానించాల్సిందే! అందరూ హర్షించాల్సిందే! మొదట్లో కొన్ని తాత్కాలికంగా యిబ్బందులు కలిగినా, వాటిని సర్దుబాటు చేసుకునే సహనం, ఓర్పు కూడా అవసరమే! ఈ మార్పులు శుద్ధ అనవసర మయితే, దాన్ని గురించి విమర్శలు రావటం సహజమే!

ఈ బస్సు నెంబర్ల మార్పుల్లో ఈ రెండు రకాలు మిళితమై ఉన్నాయి. ఈ బస్సుల్లో కొన్నింటికి 50, 49 నెంబర్లు కూడా ఉన్నాయి. అసలు నెంబరుకు ఎ, బి, సి లు కూడా తగిలించడం అలవాటే. మొత్తం హైద్రాబాదు సికింద్రాబాదు జంటనగరాల్లో 60 రూట్లకు పైగా బస్సులు నడుస్తూ ఉంటాయి. ఒకటితో ప్రారంభిస్తే అందాకా రావాల్సిందేగా! అయితే మధ్యలో ఎ, బి, సి లు రావటంవలన యింత నెంబరు వరకు రానక్కర్లేదు. ఇప్పుడు తెచ్చిన మార్పుల్లో ప్రధానంగా ఒకటవ నెంబరుతో ప్రారంభించటమనేది. ఇది బాగానే ఉంది. ఇంతకుముందు ఒకటవ నెంబరుతో ప్రారంభమయిన బస్సులేనేలేదు. హైదరాబాదు, సికింద్రాబాదు నగరాల మధ్య నడుస్తున్న బస్సులు రెండంతస్తులవీ ఉన్నాయి. చిన్న బస్సులూ ఉన్నాయి. వీటికి నెంబర్లు పెద్దవాటికి 78 ఉన్నాయి, నెంబర్ల మార్పుల తర్వాత కూడా యీ నెంబర్లే వీటికి ఉంచారు. ఇదీ సబబే. అయితే చిన్న నెంబర్ల బస్సులు మాత్రం మార్చేశారు. అదివరకు 7 సి బస్సు (సికింద్రాబాదు స్టేషన్ నుంచి, ముషీరాబాద్ మీదుగా అఫ్జల్‌గంజ్ వెళ్లేది) నెంబరు యీ మార్పు వలన కేవలం ఒకటవ నెంబరుగా తయారయింది. సరే యీ మార్పువలన ఆట్టే యిబ్బంది లేకపోవచ్చు కాని, సికింద్రాబాదు స్టేషన్ నుంచి బయలుదేరే ఇంకో బస్సుకు 7 సి ఈ కొత్త మార్పులు యిచ్చారు. అందువలన అలవాటు చొప్పున 7 సి బస్సులో సికింద్రాబాదు స్టేషను దగ్గర కూర్చుంటే సరాసరి నెహ్రూనగర్ వెళ్లిపోవచ్చు. ఇదేవిధంగా అదివరకు రాణిగంజి నుంచి బయలుదేరే చిన్న బస్సు నెంబరు 7 బి. అది ముషీరాబాదు నుంచి రెసిడెన్సీదాకా వెళ్లుతుంది. యిప్పుడు యీ నెంబర్ల మార్పుతో అది రెండయి

49 వ పేజీ చూడండి

**డా॥ గాలి బాలసుందరరావు**

# మనమూ-మనదేహస్థితీ

## ఆంత్ర కార్యక్రమము

ఆంత్రము అంటే ప్రేగు. ప్రేగుల్లో జరిగే కార్యక్రమములో అయిదు భాగములు ఉన్నవి (1) యాంత్రికము, (2) స్పందనము, (3) ఈ రెంటి ఫలితంగా జరిగే జీర్ణకార్యము, (4) జీర్ణమైన భోజన పదార్థములో 'సార' భాగపు ఆహరణము (Absorption) (5) కిట్ట భాగపు విసర్జనము.

(1) ఈసాఫెగస్ లోనూ, జఠరాశయంలోనూ ఉండే తరంగ చలనమే (Peristolysis) చిన్న ప్రేగులోనూ జరుగుతుంది. కాని ఆ తరంగ చలనానికీ ఈ తరంగ చలనానికీ, కొంత భేదం ఉన్నది. సాధారణంగా చిన్న ప్రేగులో తరంగ, చలనము డువోడినం చివర ఆరంభించి, కొన్ని సెంటి మీటర్లు మాత్రమే సాగుతుంది. కాని సకృతుగా రెక్టం వరకు ఏక ధాటిగా ఈ తరంగ చలనము సాగవచ్చును. ఈ తరంగ చలనం వేగమూ వివిధ ప్రదేశములలో వివిధ సమయములలో మారవచ్చును. తరంగ చలనం, ఏ ప్రదేశంలో నైనా ఆరంభించి అధోముఖంగా క్రిందికి పోతుంది. కాని కొన్ని పరిస్థితులలో, అధోముఖంగా గానూ ఊర్ధ్వముఖంగానూ కూడా తరంగ చలనం ఆరంభిస్తుంది. అప్పుడు కడుపులో పొర్లు ఏర్పడుతుంది. చురుకు చురుకుగా పోటు పుడుతుంది. ఈ తరంగ చలనం అతివేగాగా చివర వరకు జరిగినప్పుడు శబ్దంతో అపాన వాయువు వెళ్తుంది. గోడ ద్వారము మూసుకుని ఉంటే, గాలి బలవంతంగా బయటికి పోయి శబ్దం మరీ అధికంగా ఉంటుంది. జీర్ణకోశం కండర నిర్మితమై సంకోచ వ్యాకోచ శక్తిగల దీర్ఘమైన నాళముగదా! దాని గోడలో కండరముల మధ్య, సింపతెటిక్ నరము కూడలు (Plexuses) చాలా ఉన్నవి. ఇందులో ఏ కూడలి ఉద్రిక్తమైతే అక్కడ నుంచి తరంగ చలనం ఆరంభ మవుతుంది. ఎంతగా ఉద్రిక్తమైతే అంతవేగంతో తరంగ చలనం సాగిపోతుంది. ఉద్రేక సమయాల్లోనూ, ప్రేగు ఇన్‌ఫ్లేం అయినప్పుడూ, అతి వేగంగా ప్రేగుల్లో తరంగ చలనం సాగిపోతుంది.

కండరం ఎప్పుడూ వదులుగా ఉండదు. వీణ తీగలాగా అది కొద్దిగా బిగుతుగా ఉంటుంది. ఈ బిగుతును 'టోన్' (Tone అంటారు. టోన్ అభివృద్ధి చేసేది "టోనిక్". 'టానిక్' అన్న మాట బలం పట్టే ప్రతి మందుకూ పర్యాయ నామమైపోయింది. ప్రేగులలో కండరముల టోన్ వల్ల, రబ్బరు గొట్టం గోడ లాగా ప్రేగు గోడ ప్రత్యేకంగా ఒకచోట సాగిపోదు. ప్రేగు గోడలో కండరములు, వాత గ్రస్తములై స్తబ్ధములై నప్పుడు, ఎప్పుడూ బిగుతుగానే ఉంటవి. కొన్ని రోగ పరిస్థితులలో ఈ కండరములు వాత గ్రస్తములై వాయువుతో బెలూన్లలాగా ఉబ్బిపోతవి. ఈ టోన్ లేకపోతే జీర్ణకోశంలో ప్రవేశించిన భోజన పదార్థములు ముందుకు సాగి పోవడం జరగదు. తరంగ చలనం ఈ 'టోన్' మీదనే ఆధారపడి ఉంటుంది. టోన్ ఎంత అధికంగా ఉంటే జీర్ణ నాళంలో ఉన్న పదార్థం మీద వత్తిడి అంత అధికంగా ఉండి అది ముందుకు నెట్ట బడుతుంది

చిన్న ప్రేగుల్లో, నిడుపు వసతిలోనూ చుట్టు వసతిలోనూ కూడా కండరములున్నవి గదా? ఈ గుండ్రని కండరములు సంకోచించినప్పుడూ, వాటి తరువాత ఉన్న కండరములు వ్యాకోచించి ముందుకు సాగే పదార్థానికి ఎడము కల్పిస్తవి. ఒక్కొక్కప్పుడు ఈ సంకోచము అత్యధికమై, ఆంత్రనాళద్వారము చిన్నదై పోవచ్చు, అసలు మూసుకునే పోవచ్చును. ఈ స్థితిని దుస్సంకోచము అంటారు. ఈ స్థితి చిన్న ప్రేగు రెండవ భాగమైన ఇలియం లోనూ పెద్ద ప్రేగులోనూ ఎక్కువగా తటస్థించవచ్చును. ఈ దుస్సంకోచము తరుచు తటస్థిస్తూ ఉంటే ఆ ప్రదేశంలో ఉండే మ్యూకస్‌పొర భాగమునలిగి చిట్లి అక్కడ అల్సర్లు ఏర్పడవచ్చును. ఈ రోగస్థితిని రీజయనల్ ఇలియైటిస్ (Regionl ilietis) అంటారు. "ఇలియంలో ఒక ప్రదేశంలో ఏర్పడే ఇన్‌ఫ్లమేషను" అని ఈ మాటకర్థము. దీనిని మొదటి సారిగా క్రోన్ (Crohn) అనే శాస్త్రజ్ఞుడు నిరూపించేడు. ఆ సంగతి తరవాత వివరిస్తాను. పెద్ద పేగు చివర భాగంలోనూ రెక్టంలోనూ ఈ టోన్ తగ్గిపోతే మలబద్ధకం యేర్పడుతుంది.

తరంగచలనం, శక్తిని ఉత్పత్తి చేస్తుంది. శక్తిని ఉత్పత్తి చేసేపని యంత్రములది. శరీరంలో శక్తిని ఉత్పత్తిచేసేవి, ప్రయోగించేవి అయిన క్రియా కలాపములను యాంత్రిక క్రియలు (Mechanical Processes) అంటారు.

జీర్ణకోశపు కండరములు, అనిచ్ఛాధీన కండరములు. వాటి సంకోచ వ్యాకోచములు మన స్వాధీనంలో ఉండవు. ఈ కండరము లన్నింటిలోనూ స్వచ్ఛంద నరాశయపు శాఖలు వల లాగా ఉన్నవి' ఈ నరముల వలను "మయెంటెరిక్ ప్లెక్సస్" అంటారు "మయోస్" (Myos) అంటేకండరము. (మసిల్ అన్న ఇంగ్లీషు మాటకు సమానమైన ఆయుర్వేద నామము. 'పేశి' కండరము, అంటే కెండను) కాని అనిచ్ఛాధీన కండరములకు కెండను ఉండవు. అందుకని కండరములనే వాడుతున్నాను.) "ఎంటిరా" అంటే ప్రేగు. ప్రేగులో ఉండే కండరములలో ఉండే నరముల వల గనక దీనికా పేరు వచ్చింది. ఈ రకములలో కొన్ని ఊర్ధ్వగామి నరములు (Atterent nerves) ఇవి ముఖ్యంగా ప్రేగులయొక్క మ్యూకస్ పొర నుండి, ప్రేగుల గోడనుండి అనుభూతులను (Sensations) మెదడుకు చేరుస్తవి. ఈ అనుభూతుల ననుసరించి మెదడు, ప్రేగులలో కండరములు సంకోచించాలో వ్యాకోచించాలో నిర్ణయించి ఆ ఆదేశములను అధోగామి నరముల (Ettrent) ద్వారా ఆయా కండరములకు అందిస్తుంది. ఇదే విధంగా గ్రంథులు అధికంగాస్పందించాలో, అల్పంగా స్పంధించాలో, అసలు స్పంధించనేరాదో నిర్ణయించి అధోగామి నరముల ద్వారా మెదడు ఆ ఆదేశాన్ని పంపుతుంది. అంటే జీర్ణకోశపు కండరములలో ఉన్న ఈ నరములవల (Plexus) మెదడు ఆదేశములనుసరించి ప్రవర్తిస్తుందన్న మాట! ఈ నరజాలము, కేవలం మెదడుకు లొంగి ఉండేదే కాదు. రాష్ట్ర పాలకులయిన గవర్నర్లకు కొంత స్వయం నిర్ణయ శక్తి ఉన్నట్లే వీటికీ కొంత స్వతంత్రము ఉన్నది. చక్రవర్తి దుర్బలుడైనప్పుడు సామంతరాజులు విజృంభించి స్వతంత్రంగా ప్రవర్తించినట్లు మెదడు, దానిననుసరించిన మనస్సు, దుర్భరమయిన ఉద్రేకాహుతికి గురి అయినప్పుడు, ఈ ఆంత్ర నరజాలమునకూ మెదడుకూ సమన్వయము లేకుండా పోవచ్చును. ఆంత్ర నరజాలము. ఆంత్ర కండరములను అతిగా ప్రేరేపించవచ్చును. అసలు ప్రేరేపించకనే పోవచ్చును. ఈ నరజాలమే ఆహారపు గతికీ ఆహార పదార్థములు కలవడానికీ జీర్ణరస స్పందనానికీ కారణం. ఆంత్ర నరజాలములో న్యూరాన్సులూ, ఉంటవి. సింపతెటిక్ నరములూ ఉంటవి. పేరా సింపతెటిక్ నరములూ ఉంటవి. (పూర్వ వ్యాసములు చూడండి). ఇందులో పేరా సింపతెటిక్ నరములు, ఆంత్ర కండరముల 'టోను'ను చలనమును అధికం చేస్తవి. అయితే ఈ నరములే ఆంత్రములలో ఉండే "స్పింక్టర్లను" (ఉంగరవంటి కండర నిర్మితి) వ్యాకోపింప జేస్తవి. ప్రేగు సంకోచించినప్పుడు, వాటిలో ఉన్న పదార్థములో వాయువు ముందుకు పోయి పోయి, మలాశయపు బహిర్ద్వారముగుండా బయటికి పోవాలి. ప్రేగులో కండరములతో బాటు ఆస్పింక్టర్లూ, సంకోచిస్తే, పేగు ఉబ్బి పగిలిపోవచ్చు. ఈ పేరా సింపతెటిక్ ప్రభావమువల్లనే ఈసాఫెగస్ సంకోచించినప్పుడు, కార్డియల్ స్పింక్టరు, తెరుచుకుని ఆహారం జఠరాశయంలోకి ప్రవేశిస్తుంది. జఠరాశయపు కండరములు సంకోచించినప్పుడు పైలొరస్ స్పింక్టరు తెరుచుకుంటుంది. ఆంత్రము సంకోచించినప్పుడు చిన్న ప్రేగు పెద్ద ప్రేగుతో చేరే చోట ఉండే ఇలియో సీకల్ వేల్వు, (దీనిని తరవాత వివరిస్తాను) తెరుచుకుంటున్నది. ఒకే నరముల ప్రభావంతో పరస్పర విరుద్ధములయిన ఈ కార్యములను సాధింపజేసే సృష్టి శక్తి ప్రభావం అద్భుతమైనది.

సింపతెటిక్ నరములు, స్పింక్టర్లను సాధార

48 వ పేజీ చూడండి

# తిరిగి వచ్చిన కథ




శంభు

కథ తిరిగి వచ్చేస్తే అధైర్యపడకూడదు. "ధైర్యే సాహసే! వెంకటలక్ష్మి" అన్నాడు మా ప్రభాకర్. అందుకని మీరు కూడ నాలాగే ధైర్యవంతు లవ్వాలంటే ఈ కథ చదవండి.

(నిజం చెప్పాలంటే ఇది నా మొదటి కథ!)

## * పవిత్ర ప్రేమ

అనగా అనగా ఒక వూరియందు రాముడను ఒక బాలుడు ఉండుచుండెను. అతడు గుణవంతుడు మరియు రూపవంతుడు. అతడు క్రమక్రమముగా యుక్తవయస్కుడయ్యెను. ఒక దినమున రాముడు వీధిలో వెళ్లుచుండగా ఒక అపురూప సౌందర్యవతిని చూసెను. చూచిన తడవుగా మోహించెను. అంతట అతడు ఆమెను వెంబడించి వారి గృహము తెలుసుకొనెను. ఆమె పేరు సీతాదేవి అనియు, ధనవంతుల కుమార్తె అనియు సమాచారమును సేకరించెను.

రాముడు ఇంటికిపోయి, నిద్రాహారములు మాని ఆమెగురించి ఆలోచించసాగెను. అతని మోహమంతయును వెల్లడిచేయునటుల ప్రేమలేఖ వ్రాసి, మరునాడు అదేవేళకు వీధిలో ఎదురయి, ఎవరును తనను గమనించకుండునటుల చూసి, 'ఆకమ్మను ఆకోమ్మకు' అందజేసెను. ఆమె మొదట అచ్చెరువందిననూ, అతనిని చూసి సిగ్గుపడి ముంచిపోయి లేఖను గ్రహించుకొని వేగముగా వెడలిపోయెను. వా రిరువురి మధ్య ప్రేమ దినదిన ప్రవర్థమానమై చివరికి ఒకరిని వీడి మరియొకరు బ్రతుకలేనంత వరకు వచ్చినది.

క్రమముగా వారి విషయము ఆమె తల్లిదండ్రులకు తెలిసి—వారు కలుసుకొనుటకు వీలులేకుండా కట్టుదిట్టములు చేసిరి. రాముడు ప్రాణములకు తెగించి, రహస్యముగా వారి గృహము ప్రవేశించి ఆమెను కలుసుకొనెను. అతడే ఆమె జీవిత సర్వస్వముగా భావించినది, కావున సీతాదేవి అతనితో వచ్చివేసినది. ఇరువురు సుముహూర్తము చూసుకొని గుడిలో సర్వేశ్వరుని సమక్షమున దంపతులైనారు. *

ఇంత రసవత్తరమైన ప్రణయగాథ నిర్దాక్షిణ్యముగా పత్రిక నుంచి నేను పంపిన మర్నాడే తిరిగి వచ్చేసింది. అయినా నేను నిరుత్సాహ పడలేదు. కాని ఆ కథని ఏంచెయ్యాలో తోచలేదు.

ఇంతలో—మా ఎదురింటాయన కథలు రాస్తూ ఉన్న సంగతి గుర్తుకొచ్చింది. ఆయన అసలు పేరు నాకు గుర్తులేదు. కాని అందరూ ఆయన్ని 'హత్యశ్రీ' అని పిలుస్తారు. అదే ఆయన కలం పేరు కూడాను. ఆయన్ని చూడగానే చిన్నపిల్లలంతా ఎందుకో జడుసుకుంటారు. కాని నేను మాత్రం ఏమీ భయపడలేదు. పలకరింపుగా చిరునవ్వు నవ్వాను.

ఆయన నన్ను లోపలికి రమ్మని తీసుకువెళ్లారు. ఆ గదిలో బీరువాలకి బీర్వాలు డిటెక్టివ్ నవలలు పడి ఉన్నాయి. అన్నీ ఆయన రాసినవే! అటా లైబ్రరీలో ఎక్కడ చూసినా ఆయన పుస్తకాలే! ప్రజలు ఆయనంటే పడి చస్తారుట! వాళ్లు ఎందుకు వచ్చారో అది హత్యో, ఆత్మహత్యో తెలుసుకోడానికి ఆయన బయల్దేరి, అందంతా మరొక పుస్తకంగా రాసిపడేస్తాడు. అదీ సంగతి.

''ఏమిటిలా వచ్చావ్?'' అనడిగారు ఆయన నా కళ్లల్లోకి తీక్ష్ణంగా చూస్తూ.

నేను ముందు కొంచెం సిగ్గుపడి, తర్వాత చెప్పాను ''నే ఓ కథ రాసా'' నని.

''వెరీ గుడ్!'' అని ఆయన సిగరెట్ కేసి తీసి శుభ్రంగా జేబు రుమాలుతో తుడిచి నాకు ఆఫర్ చేసారు. నేను వద్దంటూనే తీసుకుని, సిగరెట్ వెలిగించి కేస్ తిరిగి ఇచ్చేస్తాను. ఆయన దాన్ని ముట్టుకోకుండా, జాగ్రత్తగా జేబు రుమాలుతో పట్టుకుని, నా వేలి ముద్రలు సంపాదించ గలిగినందుకు సంబరపడిపోయారు.

అదే మంచి సమయం మనుకుని నేను రాసిన (తిరిగి వచ్చిన) కథ చదివి విన్పించాను. అంతావిని—ఆయన ''అందుకే తిరిగి వచ్చేసింది'' అన్నారు. నేను చెప్పకుండానే అది తిరిగి వచ్చిందని ఆయనకి ఎలా తెలిసింది అని నేను ఆశ్చర్యపోయాను.

దానికి సమాధానంగా ''నువ్వా చెప్పొలిటోయ్! చూడూ! ఆ కవరుమీద పోస్టుముద్ర లున్నాయి. తర్కశాస్త్ర దృష్ట్యా పరిస్థితిని పరిశీలిస్తే అది తిరిగివచ్చినదే ఐవుండాలి'' అన్నారు ''హత్యశ్రీ'' గారు.

ఆయన అఖండ మేధాశక్తికి నేను మళ్లీ ఆశ్చర్యపోయాను. వారిచ్చిన సిగరెట్టు చివరి దమ్ము లాగేసి పడేసాను. ఆ సిగరెట్ పీకని ఆయన భద్రంగా కాగితంలో పొట్లంకట్టి జేబులో పెట్టుకున్నారు.

''ఇంతకీ నన్నేం చెయ్యమంటారు?'' అనడిగాను కథని చేతిలో పెట్టుకుని.

''నువ్వేం చేసినా కనుక్కోగలను'' అన్నారాయన గంభీరంగా.

''అందుకనే—అసలు మీరు చెప్పినట్టు—హత్య చేసి పట్టుబడకుండా వుండినట్టు—తిరిగిరాని, తిరుగులేని కథని రాసి నేనూ మీలాగే (మీ అంత కాదనుకోండి) గొప్పవాణ్ణయిపోదామని ఉంది'' అని నసిగాను.

''అదీ! అలా దార్లోకి రా! చూడు .... కథలో ముఖ్యంగా ఏదైనా హత్యో, దోపిడియో, దొంగతనమో, మరేదోతనమో జరగాలి. ఆ నేరం హీరో మీదకి రావాలి. కథ కొత్తగా ఉండాలంటే అతనే డిటెక్టివ్ అయితే బాగుంటుంది. హీరోయిన్ నాచురల్‌గా అతని సెక్రటరీ! .... చివరికి దొంగ దొరుకుతాడు.'' అని నాకు మంత్రోపదేశం చేసారు. 'హత్యశ్రీ' గారు. ఆయనకి అమాంతం సాష్టాంగ నమస్కారం చేసాను. కానీ ఆయన కాలివేళ్ల ముద్రలు తీసుకుంటున్నానేమోనని అనుమానం వచ్చి ''వెళ్లిరా'' అన్నారు.

వచ్చి, కథ మార్చి రాశాను.

## * హత్యాప్రేమ

ఆది అమావాస్య రాత్రి. చిమ్మ చీకటి. అప్పుడే వాన వచ్చి వెలిసింది. అయినా ఆకాశం ఇంకా గర్జిస్తోంది. దానికి శ్రుతి పట్టినట్టు కీచురాళ్లు అరుస్తున్నాయి. దూరంగా ఎక్కడో కుక్క వికృతంగా విలపించింది. హోరుమని వీచే గాలికి రోడ్డుకి అటూ యిటూ ఉన్న పెద్ద చెట్లు పెనుభూతాల్లా ఉగ్రరూత లూగుతున్నాయి.

దూరంగా వస్తూన్న కారు లైట్ల కాంతిలో—అప్పుడే తడిసిన తారు రోడ్డు నల్ల త్రాచులా మెరిసిపోతోంది. కారు ఒకచోట ఆగింది. అందులోంచి—పొడుగుపాటి ఓవర్‌కోట్, నల్ల టోపీ ధరించిన ఒక వ్యక్తి చేతిలో టార్చిలైట్ సహాయంతో రోడ్డంతా కలియచూసాడు. రోడ్డు మీద ఎవ్వరూ లేరని నిర్ధారణ చేసుకుని — కారులోంచి ఏదో బరువైనది దింపి రోడ్డు పక్కన పడేసి, కారు స్టార్టు చేసుకుని వెళ్లిపోయాడు.

తెల్లవారేసరికి పోలీసులు 'హత్యానేరం క్రింద 'రావ్' అనబడే ఒక ప్రయివేట్ డిక్టివ్‌ని అరెస్టు చేశారు. కానీ అతను జీప్‌లోంచి దూకి పారిపోయాడు.

ఆ మర్నాడు రాత్రి, అదే సమయానికి, అదే రోడ్డుమీద, అదే ప్రదేశంలో—మరో కారాగింది. అందులోంచి ఎవరో నల్ల ముసుగు ధరించిన ఒక వ్యక్తి దిగి, టార్చిలైట్‌తో ఆ ప్రదేశాన్ని పరిశోధించడం మొదలుపెట్టాడు. అతనికి ఆ ప్రాంతాల్లో ఏదో దొరికింది. దాన్ని అతడు శుభ్రంగా కాగితంలో పొట్లం కట్టుకుని కారెక్కాడు. కారు తారు రోడ్డుమీద పాదరసంలా ప్రవహించి రెండు నిముషాల్లో కనుమరుగై పోయింది..

రావ్—తన అపరాధ పరిశోధనాలయంలో కాగితపు పొట్లాన్ని విప్పి చూసాడు. అది, ఎవరిదో తెల్ల వెంట్రుక. సుమారు నాలుగు అంగుళాలు ఉంది. సగం నెరిసింది. మిగిలిన సగం ఎర్రగా ఉంది. అదోరకం వాసన కూడా వేస్తోంది. దాన్నిబట్టి ఎవరో నెరిసిన జుట్టుగల వ్యక్తి ఈ హత్య చేసాడని, ఆ హంతకుడు జుట్టు నల్లబడటానికి ఏదో తైలం రాస్తున్నాడని తెలుసుకోడానికి రావ్‌కి అట్టేసేపు పట్టలేదు.

ఉత్సాహంగా ''జానీ'' అని పిల్చాడు తన అందమైన సెక్రటరీని. కాని, జానకి రాలేదు. ఇంతలో ఎక్కడినుండో ఒక కాగితపు ఉండ వచ్చిపడింది. విప్పి చూసాడు రావ్.

'ఈ నేరం నుంచి తప్పించుకోలేవు. పోలీసులు నువ్వే హత్యచేసా వనుకుంటున్నారు. ఇంకా ఇందులో జోక్యం కలుగజేసుకుంటే నీ ప్రాణానికే కాక, నీ ప్రాణ సమానమైన నీ సెక్రటరీ జానకి ప్రాణానికి కూడ మోసం వస్తుంది. జాగ్రత్త!'

రావ్ ఈ బెదరింపుకి చిర్నవ్వు నవ్వుకున్నాడు అతను జీవితంలో అటువంటివి చాలా చూసాడు. అందుకే మళ్లీ తన పనిలో నిమగ్నుడై, ఆలోచించడం మొదలుపెట్టాడు—''సగం నెరిసిన జుట్టు ఎవరికి ఉందా?'' అని. బీచ్‌లో బటానీలు అమ్మేవాడికి జుట్టు సగం నెరిసింది. కాని వాడీహత్య చేసి ఉండడు. చెయ్యడానికి బలమైన కారణం, చేసే అవకాశం కూడా లేవు. ఇక పోతే—'రాణా' అని తునిలో దొంగ వ్యాపారంచేసే ఒక హోటల్ యజమానికి జుట్టు సగం నెరిసింది. అవును. 'రాణా' సంగతి 'రావ్' కి బాగా తెలుసు. అసలు తనకి జానకితో పరిచయం తునిలోనే జరిగింది. అప్పటి కామె ఒక హోటల్లో 'రిసెప్షనిస్ట్' గా పనిచేస్తూండేది. ఆ హోటల్ యజమానే రాణా. జానకిని ఆ నరకకూపం నుంచి తప్పించి, తనదానిగా చేసుకోడానికి రావ్ చాలా, ధైర్యసాహసాలు ప్రదర్శించవలసి వచ్చింది. అందుకే ఆ ముఠావాళ్లు రావ్ మీద పగ బూనారు. ఈవిధంగా అప్రయత్నంగా అపూర్వమైన పూర్వగాథ గుర్తుకొచ్చిం దతనికి.

బహుశా ఆ ముఠావాళ్లే కక్ష సాధించడానికి ఏదో హత్యచేసి ఆ నేరం 'రావ్' మీదకి వచ్చేటట్లు తగిన సాక్ష్యాలు కల్పించి ఉంటారు. అంతే! రావ్ వెంటనే తన ఆలోచనలకి స్వస్తిచెప్పి మారువేషంలో జీప్ వేసుకొని తుని బయల్దేరాడు.

రావ్ ఆ హోటల్ చేరుకునేసరికి సరిగ్గా అర్ధరాత్రయింది. హోటల్లో భూమిక్రింద కట్టబడిన గోడౌన్సులోకి ప్రవేశించాడు. అక్కడ ఆ ముఠా నాయకుడు అనుచరులతో తానా హత్య ఎంత సులువుగా, అనాయాసంగా చేసినదీ చెప్తున్నాడు. ఎదురుగా స్థంభానికి జానకి కట్టబడి ఉంది. రావ్ జేబులో ఉన్న చిన్న టేప్ రికార్డర్ తీసి ఆ సంభాషణ అంతా వాళ్లకి తెలియకుండా రికార్డు చేశాడు.

ఇంతలో రావ్‌ని పట్టుకోడానికి వచ్చిన పోలీసులు అంతా విని అసలు నేరస్థులని పట్టుకుపోయారు.. రావ్, జానకి హాయిగా పెళ్లి చేసుకుని హనీమూన్‌కి కాశ్మీరు వెళ్లిపోయారు. *

కానీ ఈ కథ కూడా నేను పోస్ట్‌చేసి ఇంటికి వచ్చేసరికి పత్రిక నుంచి తిరిగివచ్చి ఇంట్లో ఉంది నాకు మతి పోయింది. ''ఏం చెయ్యాలా?'' అని ఆలోచించి మా ఇంటి వెనక ఇంట్లో ఉన్న కలధు రాసే ఆసామీ 'పిరశ్రీ' గారి దగ్గరికి వెళ్లాను.

"మీకు ఇష్టం లేకపోతే ఇంకో హోటలుకుపోయి తినండి అంతే" హోటలు యజమాని కసురుకున్నాడు.

"అడపా తడపా అంతే చేస్తున్నాలెండి" అవతల వ్యక్తి తడుముకోకుండా సమాధానం చెప్పాడు.

— జ్ఞానందం (ఛత్రపూర్)










# తిరిగివచ్చిన కథ

నేను వెళ్లేసరికి ఆయన వారి పెరట్లో వల్లె చెడ్డీ కట్టుకుని అవనపాదు దగ్గర కత్తిసాము సాధకం చేస్తున్నారు. నాకేసి తిరిగి నమస్కారం అందుకొని మళ్లీ సాధకంలో నిమగ్నులైపోయారు. పొట్టిగా, లావుగా, అమాన్దస్తాలా ఉంటా రాయను దానికి తోడు ఖుర్రమీసాల వెనకనించి దొంగ బూచాడులా తొంగిచూస్తూంటుంది వారి ముఖం. కంఠంమీద సింధూరం బొట్టు, మెళ్లో అంజనేయులు బిళ్ల. అవేకాక దండలకి అవేవో తాయెత్తులు— మొత్తం అన్నీ కలిసి బలే గమ్మత్తుగా కన్పించారు. నేను ఆయన్ని చూస్తూ అలాగే ఉండిపోయానో అరగంటసేపు.

తరవాత ఆయన చమటలు కక్కుకుంటూ వచ్చి గబగబా బాదం పాలు తాగేసారు. కాస్సేపు స్థిమితపడ్డాక "ఏమిటి సంగతి ?" అని అడిగారు. "నేను కూడా కథ రాసా" అన్నాను ముక్తసరిగా.

"ఏమిటీ, నాకు పోటీ బయల్దేరావా ? ఐతే సరే ! కాసుకో ! బస్తీమే లేక కుస్తీమే సవాల్ !!" అంటూ ఆయన తొడలు బాదుకుంటూ ఒంటి కాలిమీద లేచిపోయారు ఛాలెంజ్ చేస్తూ. నాకు ముందు కొంచెం భయం వేసినా, సర్దుకుని "అది కాదు గురువుగారూ ! ఈ కథని మీకు చూపించి మీ సలహాతో మార్పులు చెయ్యాలి" అని అసలు విషయం చెప్పాను.

వెంటనే ఆయన శాంతించారు. "సరే, నేను బస్కీలు తీస్తూంటాను, నువ్వు చదివి వినిపించు" అన్నారు. అని ఆయన బస్కీలు తియ్యడం మొదలు పెట్టారు. నేను రాసిన (తిరిగి వచ్చిన) కథ చదివి వినిపించడం పూర్తయ్యేసరికి ఆయన బోలెడు బస్కీలు తీసారు. తీసి, — కథ చాలా చప్పగా ఉందన్నారు. "వీరరసం లేదు, దొంగలు, హత్యలు, తుపాకీలు వీరరసంలోకి జమరావు" అన్నారు. "అసలు వీరరసం రావాలంటే కథ రాసేముందు కనీసం రెండొందలు గుంజీలైనా తియ్యాలి" అని కూడా అన్నారు 'వీరశ్రీ' గారు.

"ఆహా !" అన్నాను ఆశ్చర్యంతో.

"ఆహా అంటే లాభంలేదు, తియ్యి" అన్నారు.

హాస్యం ఆడుతున్నారేమో అనుకుని "పోండి మీరు భలేవారే !" అన్నాను అదోలా.

"అదేం లాభంలేదు. తీస్తావా .... లేకపోతే" అని దగ్గరికి రాబోయారు. వరుసగా పాతిక గుంజీలు కాబోలు తీసేసి చతిగిల పడిపోయాను. "ఇలా ఐతే లాభంలేదు. మంచి కథలు రాయాలంటే తగిన బలం కావాలి. బాదంపాలు తాగు" అని సుమారు ఒక శేరు పాలు ఇచ్చారు. చచ్చినట్లు తాగాను. కొంచెం వికారంగా అన్పించింది. అయినా అది పైకి కన్పించనీయకుండా దాచేసి—వల్లమాలిన ఆనందం పొందినట్లు అభినయించాను.

దాన్తో 'వీరశ్రీ' గారు ప్రసన్నులై కథలో అడుగడుగున వీరరసం పోషించి, దాని పక్కనే శృంగారాన్ని ఎలా పోషించాలో, పెంపొందించాలో తెలియ చేశారు తమ మీసాలు మెలివేస్తూ. దాని ప్రకారం కథని మళ్లీ మార్చి రాసాను.

## *వీర ప్రేమ

వీటిగట్టున వెన్నెల పుచ్చపువ్వులా విల్లివిరిసింది. అదే వెన్నెల వీటిలోని వీటిమీద పడి వెండి పెంకుల్లాగ తళుకు తళుకుమని ప్రకాశిస్తోంది. అదే అదే వెన్నెల చింతతోపుకాడ ఉన్న పెద్ద చింత లోంచి దూరడానికి ప్రయత్నించి, చెట్టుకింద వంతా నీడచేసి వదిలింది. ఆ చీకట్లోకి వచ్చి చూసింది. సీతాలు రాములు కోసం.

సీతాలుకి రాములు మావ అంటే పేణం. అడు లేనిదే తను బతుకనేదు. అందుకే అంత రేతిరిలో కూడ ఆడికోసం లగెత్తుకుంటూ అంత దూరం వచ్చింది. తీరా చూస్తే మావ పెద్ద చింతకాడ లేడు. సీతాలు గుండెలు ఝల్లుమంది. వెనక్కి తిరిగి ఎళ్లిపోవడానికి కూడ ధైర్యం చాలలేదు ఎలాగో గొంతు విప్పి "మావా" అనరిచింది.

చెట్లుమీద ఏదో కదలింది. సీతాలు పై ప్రాణాలు పైనే పోయాయి. పైనుంచి ఏదో దభీమని పడినట్లయింది. "మావోయ్" అని ఒక్క పిచ్చికేక వేసింది సీతాలు. చెట్లుమీంచి దూకిన రాములు "ఏటే అంత భయం. నానేలే" అని భయపడిన సీతాల్ని దగ్గరికి తీసుకున్నాడు. సీతాలు ఇంకా భయంతో వణుకుతూనే ఉంది. ఇంక వణకడానికి వీల్లేకుండా ఇంకా దగ్గరికి తీసుకున్నా కున్నాడు రాములు.

"నువ్వు రాపోతే నాను భయవేసి సచ్చిపోదును మావా" అంది సీతాలు. "ఎల్లెల్లేస్ నాను బతికుండగా నిన్ను సావనిత్తానా" అన్నాడు రాములు ఆమె కళ్లల్లోకి ఆశగా చూస్తూ.

ఆ చూపులు తట్టుకోలేక పోయింది. సీతాలు. అయినా ఇంకా అలాగే చూస్తున్నాడు రాములు.

"ఏటి మావా! అలా చూస్తావ్ .... అలా చూసేబదులు నన్ను వంపేకూడదూ" అంది సిగ్గుతో సీతాలు అందమైన పెదాలను అష్ట వంకరలు తిప్పుతూ. రాములు దృషి దొండపళ్ల ల్లాంటి సీతాలు పెదాలు మీదికి పోయింది. గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు.

ఇంతలో సీతాలు కాలి పనక్కనుంచి ఏదో చరచరా పాకి వెళ్లిపోయినట్లయింది. "అమ్మో" అనరిచింది సీతాలు ఎగిరి గంతేసి. రాములు వెంటనే వెళ్లి పారిపోతున్న కోడె త్రాచుని ఒడుపుగా తోక పట్టుకుని గిరగిర త్రిప్పి విసిరేశాడు. అది మొండి ధైర్యానికి సీతాలు ఆశ్చర్యపోయి నోరు తెరుచుకుని ఉండిపోయింది. సీతాలు తన పక్కనుంటే ఇంతకంటే సాహసాలు చెయ్యగలడు రాములు అందుకే "నువ్వు నా చెంతనుంటే ఇదో లెక్కాటే!" అన్నాడు రాములు సీతాలు నడుంచుట్టూ చెయ్యి వేసి దగ్గిరనా లాక్కుంటూ.

ఎక్కడో అడుగుల చప్పుడు వినిపించింది. కాస్సేపటికి ఇంకా దగ్గరగా—అడుగుల తాలూకు ఎండిన ఆకులు విరిగిన చప్పుడు విన్పించింది. సీతాలుకి ఏదో అనుమానం వచ్చింది. తను పాలెంలో బయద్దేరి వచ్చేటప్పుడు ఎవరో చూసి వెంబడిచ్చినట్టు అన్పించింది. బహుశా నాయుడు మనుషులే అయివుంటారు. నాయుడు అంటే పాలెంలో అందరికీ హడలు. నాయుడు సీతాలు మీద కన్నేశాడు. కానీ సీతాలు రాములు మావాకే మనసిచ్చింది. ఐతే నాయుడికి మాత్రం సీతాలు మీద మోజు తీరలేదు.

ఇంతలో ఎవరో ఇద్దరు బలమైన మడుసులు రాములుమీద ఇరుసుకు పడ్డారు. నాయుడు వచ్చి సీతాలు చెయ్యి పట్టుకుని ఈడ్చుకుపోతున్నాడు. సీతాలు నిస్సహాయంగా "మావా" అనరిచింది. అంతే! రాములు చెయ్యి ఏనుగుల బలంతో ఒకణ్ణి ఒక గుద్దు గుద్దాడు. వాడు నేలకి కూలి పోయాడు. వాడి చేతిలో ఉన్న బాణాకర్ర తీసుకుని విజృంభించాడు రాములు. ఒక్క అంగలో సీతాల్ని లాక్కుపోతున్న నాయుడి బుర్రమీద బలంగా బాణాకర్రతో ఒక్క దెబ్బ వేశాడు. నాయుడు బుర్ర పగిలి స్పృహతప్పి పడిపోయాడు. నాయుడి మనుషులు బెదిరిపోయి చెదిరిపోయారు.

గాలివాన వెలిసినట్లయింది. సీతాలు లతలాగ రాముల్ని చుట్టుకుపోయింది. "మావా" అని వెక్కి వెక్కి ఏడిచింది. రాములు గుండెల్లో తల దాచుకుంటూ. "ఊరుకోయే నానుండగా నీకేటి భయం" అన్నాడు రాములు సీతాలు తల నిమురుతూ.

"మావా మనం ఇక్క డుండొద్దు. పట్నం పారిపోదాం" అంది సీతాలు భయంతో.

"ఎల్లెల్లేస్. నువ్వు నాకాడుంటే ఇలాటి నాయుళ్లు వందమంది వచ్చినా ఇంతే" అని నేలని కరుచుకుని పడిపోయివున్న నాయుడికేసి చూస్తూ——సీతాలు భుజంమీద చెయ్యి వేసుకుని పాలెంకేసి వెళ్లిపోయాడు. *

ఇంత భయానక, వీర, శృంగార రసాలతో కూడిన కథ—తిరిగి పంపడానికి స్టాంపులు జత పర్చకపోయినా తిరిగి వచ్చేసింది. ఆ కథని పట్టుకుని మా పక్కింట్లో ఉన్న 'రక్తశ్రీ' గారి దగ్గరికి వెళ్లాను. ఆయన అతి వాస్తవిక విప్లవ కవి. పెద్ద ఇల్లు ఉన్నా కూడా పెరట్లో ఒక పాక వేయించుకుని అందులో ఉంటున్నారు. రోజూ కాయకష్టం చెయ్యడం ఆయనకి హాబీ. అందకోసం గోతులు తవ్వి మళ్లీ పూడ్చేస్తూ ఉంటారు. లేకపోతే ఒక పార పట్టుకుని రోడ్డుకి అటూ యిటూ సైడు కాలువలు తవ్వుతారు. కానీ ఆమధ్య ఎవరో పిలిచి పండగ మామూలు ఇచ్చారుట. అందుకని — అప్పట్నుంచీ ఆపని మానేసి గోతులే తవ్వుతున్నారు. నే వెళ్లగానే నన్ను పాకలోకి తీసుకువెళ్లారు.

సంఘంలో పేరుకుపోయిన కుళ్లులా పాకలో నేలమీద దుమ్ము పేరుకుపోయి ఉంది. సంఘంలో పాత దురాచారాలకి మల్లే బోల్డంత బూజు పట్టి ఉంది. ఒక గోడకి ఎర్రరంగు, ఇంకో గోడకి మరో రంగు వేసిఉన్నాయి. సంఘంలో బీద—గొప్ప, విద్య—అవిద్య, యజమాని—నౌకరు, నాయకుడు— ప్రజలు లాంటి తారతమ్యాలు జ్ఞాపకం వచ్చాయి అవి చూడగానే. వాటిమధ్య ఆశాజ్యోతుల్లా గోడకి ఒక సుత్తి మరొక కొడవలి వేళ్లాడుతున్నాయి.

ఆయన కావాలని, చిరిగిపోయిన చొక్కా వేసుకుని, చార్మినార్ సిగరెట్ కాల్చుకుంటూ వచ్చి "ఏమిటిలా వచ్చావ్ ఏమి ఖబురు తెచ్చావ్" అన్నారు అన్నారు.

"ఇదీ ఖధ" అని చెప్పి, చదివి విన్పించాను. ఆయన దీర్ఘంగా ఆలోచించి సిగరెట్ ఒక్క దమ్ములో కాల్చి పారేశారు. "సంఘంలో ఉన్న దుర్మార్గాన్ని కూడా ఇలాగే కాల్చిపారెయ్యాలి" అన్నారు గద్యంలో "అవన" ని ఒప్పుకున్నాను నేను గద్యంలోనే.

"తిండికోసమే చైనావాడికి ఈ తిప్పలు
కావల్సినదల్లా వాడి పూరగాయకు కప్పలు"అన్నారు పద్యంలో.

"అవును మంచివాడు వాడు
వాడూ మనవాడే చైనావాడు" అన్నాన్నేనూ పద్యంలోనే.

"మరయితే ఖద యిలా రాసేవేం? నీలో సల సల కాగే, బుళక్ బుళక్‌మని పొంగే వేడి రక్తాన్ని శృంగారంతో కలపకు విప్లవంతో మేళవించి లోక కళ్యాణం చెయ్. చెయ్" అని నాకు ఉపదేశించారు.

ఫలితంగా కథ మార్చి మళ్లీ రాసాను.

## *విప్లవ ప్రేమ

ప్రపంచంలో జరిగే అన్యాయాలకి సాక్ష్యం

40 వ పేజీ చూడండి


ఒకవేళ వెంట్రుకలు వచ్చినా నన్ననడానికి వీల్లేదండీ

వనితాలోకం

# ఉత్తర భారత్‌లోని ముఖ్యమైన పండుగలు!

ఎం. సుగుణ

పండుగ వస్తోందంటే చాలు ఆబాలగోపాలానికీ సంతోషమే. రోజులు లెక్కిస్తుంటారు. పండుగ ఎప్పుడొస్తుందా అని, అన్నిభాషలవారూ ఎదురుచూస్తారు కదా! కాని, ఆ జరిపే తీరే వేరుగా ఉంటాయి. వారి ఆచారాన్ని అనుసరించి. మనకి ముఖ్య పండుగ సంక్రాంతి తరువాత దీపావళి, దసరా, ఉగాది మొదలగునవి. ఉత్తర దేశంలో ముఖ్యమైన పండుగలు నాలుగు. దసరా, దీపావళి, హోళీ, రక్షాబంధన్. ఈ రక్షాబంధన్ అన్నది మన శ్రావణ పౌర్ణమి. పండుగలు ఎలా జరుపుతారో రాస్తాను. ముందుగా దసరా పండుగ.

దసరా పండుగ మనలాగా బొమ్మలకొలువు పేరంటం ఉండదు. అసలు ఇళ్ళలో అట్టి హసమే ఉండదు. పైన కొంతమంది ఏ ప్రాంతాని కా ప్రాంతంవారు (కోలనీ) చందాలు వేసుకొనో ఎలాగేనా సరే "రామ్‌లీల" ఏర్పాటు చేస్తారు. రామ్‌లీలా అంటే రామాయణ గాథనే వేదికమీద ప్రదర్శిస్తా రన్నమాట. ఢిల్లీలో ఈ రామ్‌లీలా కోసమని రామ్‌లీలా మైదాన్ అనే పెద్ద మైదానం ఉంది. అక్కడ 'రామ్‌లీల' ని సుమారు లక్ష మంది ప్రజ చూస్తారేమో! ఈ రామ్‌లీలాకి చాలా ధనం వ్యయం చేస్తారు. మొదటిరోజు విఘ్నేశ్వరపూజ మొదలుకొని రామలక్ష్మణులు విద్య నభ్యసించటం సీతా పరిణయం అన్నీ రోజూ రామాయణకథ నంతట్నీ టూకీగా దసరా పది రోజులూ వేస్తారు. ఇవి పెద్దపెద్దవి ఉంటాయి. చిన్నచిన్నవైతే మనుష్యులే వేషం వేసుకుని ఆడతారు. కొన్ని మన తోలుబొమ్మల్లాగాడిస్తారు. ఆఖరిరోజున రావణాసురుణ్ని చంపుతారు. ఆరోజు రావణాసురుని బొమ్మలాగ పెద్దది పది తలలు అవీ పెట్టి చేసి లోపలంతా మందుగుండు సామాను పెడ్తారు. ఆఖరికి రావణాసురుడి దహనము అన్నమాట. రావణాసురుణ్ని కాల్చగానే పెద్ద శబ్దాలతోనూ పంచరంగులతో వింత కాంతులు వెదజల్లుతూ పేలుతుంది. ఇది చూసేందుకు ప్రజ విరగపడ్తారు. ఇది ముఖ్యం.

ఇంక దీపావళి, దీనికి దివాళీ అంటారు. మనలాగే బాణాసంచా కాలుస్తారు. ఆరోజు బజారులోకెళ్తే బాగుంటుంది. ఢిల్లీలో కరోల్‌బాగ్‌లో అజమల్‌ఖాన్ రోడ్డు అని ఉంది. ఆ రోడ్డంతా బజారే.... ఆరోజుకి, రకరకాల బొమ్మలు అమ్ముతారు. మిఠాయికొట్లు ఆరోజు చూసితీరాలి. మనం బొమ్మలకొలువుకి అంతస్థులు పేర్చి బొమ్మలెలా పెడ్తామో అలాగే అంతస్థులు వేసి రకరకాల మిఠాయి వివిధ రంగులలో పేర్చి అమ్ముతారు. ఇంక వాళ్ళ పనితనం మనకి ఆరోజు అర్థమవుతుంది. బర్ఫీ మొదలగు స్వీట్లతో పెద్ద మేడలు, గడియారపు స్తంభాలు (క్లాక్ టవర్స్) అవీ రకరకాలు చేసి పై అంతస్థులో పెట్టి లోపల బల్బు వెలిగిస్తారు. రసగుల్లా తయారు చేస్తారే ఆ పాల విరుగుని "చేనా" అంటారు. ఆ చేనాతో అన్ని రకాల ఫలాలు, కాయగూరలు బర్ఫీతో కూడా చేస్తారు. ఒక సంవత్సరం అయితే, ఆ చేనాతో పచ్చని జీడిపండు క్రింద జీడి పిక్క ఒక ఒక బొప్పాసి పండు కూడా చేసి మధ్యకి తరిగి ఉంచేరు. పైన తొక్కలాగ ఆకుపచ్చ రంగు లోపల పచ్చరంగులో పండు, నల్లని రంగులో గింజలు, ఎంతో అందంగా తయారు చేసేరు.

అది చూస్తున్నంతసేపూ మిఠాయి అనే మాట మరచిపోయాము. అలాగే యాపిలు పళ్ళు, ఆలూబుకారా పళ్ళు ఎన్నో రకాలు రంగులువేసి చూడ ముచ్చటగా, అందర్నీ ఆకర్షించి కొనేటట్లు చేస్తాయి మిఠాయి దుకాణాలు. ఇవి కాగా పంచదార పాకంపట్టి, చిన్న పింగులు, గడియారపు స్థంభాలు, చిన్న చిలుకలు, జంతువులూ తయారుచేసి తోపుడు బళ్ళమీద కుప్పలుపోసి అమ్ముతారు. నువ్వులపప్పుతో రేవడీ, (మన ప్రక్క బెల్లమెహో, పంచదారో వేసి పాకం పట్టిన జీళ్ళు అంటామే అవి) కుప్పలు కుప్పలుగా పోసి, నువ్వుల పప్పు దంచి పంచదార కలిపి పల్చగా రేకుల్లా చేస్తారు. అవి నోట్లో వేసుకుంటే కరిగిపోతాయి.

ఇవన్నీ ఆరోజు ప్రత్యేకంగా అమ్ముతారు. అందరూ ఇవన్నీ తలో కాస్త కొనుక్కుని స్నేహితులకీ, బంధువులకీ అన్ని రకాలూ పళ్ళేంనిండా పేర్చి అందరికీ పంచుతారు. వీటితోపాటు జొన్నల పేలాలు కూడా కొంతమంది పంచుతారు. మిఠాయిలన్నీ రకాని కొక్కటి చొప్పున వేసి శేర్ల లెక్కను అమ్ముతారు.... ప్రమిదలు రకరకాలు, చిన్న గుడి గోపురంలాగు కుండతో చేసి రంగువేసి దాన్నిండా దీపాలు పెట్టుకునేందుకు ప్రమిదలు అమరుస్తారు. ఆరోజు ఇత్తడిపాత్ర సామాను కూడా చాలా అమ్ముతారు. కొంతమంది ఏదేనా ఇత్తడిపాత్ర కొంటారు. సాయంత్రం లక్ష్మీపూజ చేసుకుంటారు. వెండి రూపాయి నాణేలను సంచిలో పోసి దాచుకుని ప్రతీ ఏటా ఆ నాణేలను కూడా పూజిస్తారు కొందరు. ఇంకా బాణాసంచా (మందుగుండు సామాను) అమ్మే దుకాణాలు ఆరోజు ప్రత్యేకాలంకరణలు. అందరూ బజార్లో తిరిగి ఇంట్లో దీపాలు పెట్టుకుని పటాకీలు కాల్చుకుంటారు. ఢిల్లీలో బజార్లన్నీ బాగా దీపాలతో అలంకరిస్తారు. ఈ మిఠాయి దుకాణాలయితే చాలా




"ఏదీ... బావగారూ! ఆఖరిసారిగా ఒక్కసారినవ్వండి చూద్దాం!!"

ఉంటాయి. మిఠాయిల పేర్లు మనకి ఎన్నో తెలియనివి, గమ్మత్తయినవి ఉంటాయి. కొన్ని తమాషా పేర్లు రాస్తానూ, "చమ్ చమ్", "రస్ మలాయి", "దిల్‌బహార్", బాద్‌షా, "అమృతి" (ఇది మనం చేసుకునే జహంగీరు) "సోహన్ హల్వా" ఇలా ఎన్నో ఉన్నాయి. పండగ ఇంట్లోనే కాక బయట కూడా జరుపుతారన్నమాట.

మార్చి నెలలో వస్తుంది హోళీ.... 'హోళికా పూర్ణిమ'. ఈ పండుగ వస్తుందనగా పది పదిహేను రోజుల ముందర్నించి, ఇటుక, ఇసుక మొదలగు వాడుగకిచ్చే లారీలలోని కూలీలు డప్పులు పట్టుకుని వాయిస్తూ గెంతుతుంటారు. డప్పులు లేకపోతే ఓ పళ్లెంకే వాయిస్తూ లారీలలో వెళ్తుంటారు. ఆ వాయిద్యాలు వింటుంటే 'ఆఁ హోళీ వస్తోంది' అనుకుంటాము. ఈ పండుగ రెండు రోజులు జరుపుకుంటారు. ఒకరోజు రాత్రి మనం భోగిమంట వేసినట్టు వేసి (దానికి లోడీ అంటారు.) కర్రలన్నీ పేర్చి నీళ్ళుజల్లి కొంతమంది వనితలు పూజచేస్తారు. ఆ తరువాత మంట పెడ్తారు. మొదటిరోజున రంగు, గుండలు ఎరుపు, ఆకుపచ్చ, వీటిలో అబ్రకం (మైకా) కొంచెం కలుపుతారు. ఈ గుండల్ని గులాల్ అంటారు. అందరూ చేతిలో ఈ రంగు, గులాల్ పట్టుకుని స్నేహితుల ఇళ్ళకీ, బంధువుల ఇళ్ళకీ వెళ్లి ప్రతీవారూ ఒకరికొకరు ఈ రంగు ముఖానికీ తలకీ పూసుకుని బట్టలకి కూడా పూసి ఒకరి కొకరు కౌగలించుకుని ఈ భుజంమీదా, ఆ భుజంమీదా తల ఒకసారి ఆనిస్తారు. మగవారు, స్త్రీలు, వేరువేరుగా గుంపులు గుంపులుగా బయలుదేరి అందరిళ్లకీ వెళ్లి రంగులు పూసుకుంటారు. అందరిళ్ళూ అయాక అంతా కలిసి డోలు వాయిస్తూ అందరూ పాడుతుంటే ఒక్కొక్కరే కాళ్లకి గజ్జకట్టి నృత్యం చేస్తారు. మనకి నృత్యం రాకపోయినా సరే ఎలాగో నాలుగు కుప్పిగంతులేనా వేసెయ్యాలి, ఈ పాటలూ, నృత్యాలూ కూడా స్త్రీలు, పురుషులూ వేరు వేరు బృందాలుగా ఆడుతారు. ఆరోజు పై ఆఫీసరని గాని కార్మికుడు అని గాని భేదం ఉండదు. అందరూ తమ తమ అంతస్థులు మరచి హాయిగా కులాసాగా ఆడుకుంటారు. ఈ రంగులు పూసుకోటం మధ్యాహ్నం ఒంటిగంట రెండు గంటల వరకే ఆడుతారు. ఆ తరువాత స్నానాలు చేసేస్తారు. స్నానం చేసేక ఎవరూ ఆడరు.

రెండవరోజు రంగునీళ్ళు పిచికార్లతోనూ, చెంబులోనూ చేతికందిన దాంతో నెత్తిమీంచి ఒకరికొకరు దిమ్మరించుకోటమే. ఇందులో ఎంత హాస్యం అవి ఆడుకుంటారంటే చెప్పుతో మాలచేసి ఆఫీసర్ల మెడలో వేయటం బిందెలో చిక్కని రంగు నీళ్ళు నెత్తిమీంచి దిమ్మరించటం. ఇంక చూసుకోండి ఆ రూపులు ఎలాగుంటాయో! ఎవరేనా కాస్త లేతరంగుల్లో కనిపించేరంటే వాళ్ళ పని అయిందన్నమాటే. అందరూ కలసి వాళ్ళ పని పడ్తారు. ఈ రంగునీళ్లు ముందురోజు రాత్రి పెద్ద డ్రమ్ముల్లోనూ వాటిల్లో కలిపి ఉంచుకుంటారు. పిచికార్లతో ముఖంమీద సూటిగా కొడ్తారు. అప్పుడు ఒళ్లు అప్పజెప్పి ఊరుకోడం కన్నా చేసేదేం లేదు. ఈ పండగలో కూడా మిఠాయిలు ఇచ్చుకుంటారు. ఇలాంటి పండగలంటే పిల్లలకి ఒకటే సందడి. ఎరుపు, నీలం, ఆకుపచ్చ నేరేడుపండు రంగు మొదలగు రంగులన్నీ తెచ్చి నీళ్లలో కలపటం .... 'ప్రక్కింటి రమేశ్ కంటె నేనే ఎక్కువ కలిపేను తెల్సా! ఈసారి వాడి పని పట్టెయ్యాలి. రంగులో ముంచెయ్యాలి." అంటూ ఉత్సాహంతో ఉరకలు వేస్తుంటారు పిల్లలు.

కొంతమంది పిల్లలు కలసి ఒక ఖాళీ పర్సుని, జనసమర్దం ఉన్న వీధిలో గిరవాటేసి ప్రక్కగా నక్కి దాక్కుంటారు. పర్సు చూడగానే ఎవరికేనా ఆశేగదా! వంగి పర్సు తీయబోయేసరికి కుర్రజట్లంతా అతనిచుట్టూ మూగి — 'ఏయ్! పర్సు దొరికితే తీసుకుంటావా? ఆశే .... కాని హోళీకి చందా ఇయ్య' మని దండెత్తుతారు. ఆ పెద్దమనిషి ముందు తెల్లబోయినా పిల్లల యుక్తికి మెచ్చి వాళ్ళ చేతిలో ఏదో పెట్టి నవ్వుకుంటూ ముందుకి అడుగు వేస్తాడు. మళ్లీ నాటకం మొదలు .... ఇలా సంపాదిస్తారు వీధుల్లోని పిల్లలు. ఈ రంగులు జల్లుకోటమే హోళీ .... సరదాగా ఉంటుంది. రూపులు మాత్రం ..... అబ్బ! ముఖమూ, తలా, బట్టలూ ఎక్కడా ఒక రంగని చెప్పడానికి వీలులేనన్ని రంగులు. ముఖం నిండా రంగులతో నిండిఉంటే నోట్లోని పలువరుస తెల్లగా మెరుస్తూ ఉంటే కళ్ళు కూడా మెరుస్తూ ఉంటాయి. చిన్నపాపలైతే తండ్రిని కూడా పోలిక పట్టలేదు. సరికదా, భయంతో ఆరున్నొకటి ఆలాపిస్తారు.

మా నాన్నగారు బట్టల మిల్లులో పని చేస్తున్నారు. ఆ మిల్లులో ఒకరోజు హోళీ ఆడతారు. ఎన్నివేల మంది కార్మికులుంటే అన్నివేల మందీ ఆఫీసర్లందరికీ రాస్తారు. అంటే ఏవిభాగంకి ఆ విభాగం ఆడతారనుకోండి. ఒక ఆఫీసరు ఒక విభాగాని కెళ్లి ఒక బల్లముందు నిలబడతారు. బల్లమీద రంగు, గుండ ఉంచుతారు. ఆ విభాగంలోని పనివారంతా ఒక్కొక్కరే వచ్చి ఆఫీసరుకింత రంగు పూసి మెడలో పూలమాల వేసి కౌగలించుకుని నోటో ఏదేనా తీపి పెడ్తారు. అలాగే ఆఫీసరు కూడా ప్రతి వారికీ రంగు పూసి కౌగలించుకుంటారు. ఇలా అన్ని విభాగాలలోకీ అందరూ వెళ్లి తమ స్నేహభావాన్ని పెంపొందించుకుంటారు.

ఇంక రక్షాబంధన్, ఇది ముఖ్యంగా తోబుట్టువులు జరుపుకుంటారు. అక్క చెల్లెళ్ళు అన్నదమ్ముల్ని తమ రక్ష కోరుతూ అన్నదమ్ముల చేతికి రక్షాబంధన్ కడతారు. అన్నదమ్ములు అక్కచెల్లెళ్ళకి ఏమేనా కానుక ఇస్తారు. ఇలా స్నేహితులు కూడా స్నేహాభివృద్ధికి ఒకరి కొకరు కట్టుకుని మిఠాయి యిస్తారు. ఈ రక్షాబంధన్‌లు బజార్లో రకరకాల పువ్వులు, లతలు, అవీ చెమ్కీలతో రంగురంగుల్లో అమ్ముతారు. ఈ రక్షాబంధన్‌కి సాధారణంగా పుట్టింటి కెళ్తారు స్త్రీలు ....ఆనందోత్సాహాలతో ఛలోక్తులు విసురుకుంటూ రక్ష కోరుతారు. ఈ పండగలన్నీ హృదయాన్ని ఆనందపరుస్తాయి.



# వనితా వాణి

## రకరకాల బిస్కట్లు

"వనితాలోకానికి రకరకాల బిస్కట్ల రుచులు చూపిన భూమాదేవిగారికి నా అభివందనములు. కాని ఒక సందేహం. పంచదార కరువు అయిన ఈ రోజుల్లో తియ్య బిస్కట్లకన్నా ఉప్పు బిస్కెట్‌లు చేసుకోటం మేలనిపిస్తుంది."

రాళ్లబండి ఇందిర (నరసరావుపేట)

## పంజాబీల పరిణయం

నాల్గు ఉత్తరములు చదివాను వారి ఉద్దేశ్యాన్ని బట్టి రెండవతెగ ఉన్నట్లు నాకు తెలియదు. మరి రచయిత్రిగారు ఏ తెగ నుద్దేశించి వ్రాసినారో వారికే తెలియాలి. మనకు పంజాబీలు అంటే సహజంగా గెడ్డాలు, మీసాలు ఉన్నవారే ఎక్కువ కన్పిస్తారు. వారినే మనం, పంజాబీలుగా భావిస్తాం. అది దృష్టిలో నుంచుకొనే ఆ ఉత్తరం (27—9—63 పత్రికలోనున్న) వ్రాయటం జరిగింది. అంతేకాని రచయిత్రిగారిని విర్శ చేయటం నా ఉద్దేశంకాదు. నా విమర్శ సహేతుకం కానప్పుడు దానిని ఉపసంహరించు కొంటున్నాను.

టి. రామలక్ష్మి (పాలకొల్లు)

## జీవిత చరిత్ర

శ్రీమతి సుచేతా కృపలానిగారిని పరిచయము చేసి వారి జీవిత చరిత్ర తెలిపినందుకు చాల సంతోషం. మహిళలలో మొదటి ముఖ్యమంత్రి పదవి పొందినందుకు భారతీయ మహిళలకు ఎంతో గర్వకారణం. వీరిని పరిచయం చేసినందుకు నా అభివందనలు. ఇక ముందు కూడ వనితాలోకంలో ఇటువంటి మహిళల చరిత్రలను ప్రచురించవలసినదిగా కోరుచున్నాను.

పోలిసెట్టి సత్యవతీదేవి (విశాఖపట్నం)

## బొట్టు మచ్చ

బొట్టు పెట్టుకొనే చోట మచ్చయగుచున్నదని ఒక సోదరి క్రిందటివారం వ్రాసిరి.

నాకు తోచిన ఒక చిట్కా వైద్యము వ్రాస్తున్నాను. ఈ విషయం అనుభవజ్ఞులయిన కొందరు చెప్పగా విన్నాను.

భావంచాలు (బెండ విత్తనములు మాదిరి ఇంకా చిన్నవిగా ఉండును) వాటిని పుల్ల మజ్జిగలో నానబెట్టి (సుమారు 4, 5 గం) అవి మెత్తబడిన వెంటనే మెత్తగా రుబ్బి ఆ లేహ్యమును మచ్చ ఉన్న చోట వ్రాసుకున్న వారం, పదిరోజులలో గుణము కన్పించును. రెండు రోజుల కొకమారు ఈ లేహ్యము యారు చేసుకొని రోజూ వ్రాసుకో వచ్చును. ఇది దురదలకు, ఏ విధమైన మచ్చలకైనను పనికి వచ్చును.

మా పద్మావతి సోదరి నా ఈ సలహాను తప్పక పాటిస్తారని తలుస్తాను.

కుమారి పారుపూడి ఇందిర (కాకినాడ) ★



# కొలంబా

### ప్రాస్పర్ మెరిమె

**జరిగిన కథ**

కర్నల్ థామస్‌నెవిల్, కుమార్తె లిడియా కార్సికాకి వెడుతూ లెఫ్టినెంటు ఆర్సో దెల్లా రెబ్బియాని కలుస్తారు. ఆర్సో తండ్రి హత్య చెయ్యబడ్డాడని మిస్ లిడియా తెలుసుకుంటుంది. ఆర్సో చెల్లెలు కొలంబా తమ తండ్రిని బారిచినీ అనే వ్యక్తి చంపించాడనీ, అందువల్ల పగ తీర్చుకోవాలనీ ప్రేరేపిస్తుంది. ఆర్సోకి పగ అంటే ఇష్టంలేదు కాని గ్రామాధికారి రాయబారాలు కూడా బారిచినీ నిర్దోషి అని రుజువు చెయ్యలేకపోతాయి. రాయబార ప్రయత్నాలు విఫలం అవుతాయి. కర్నల్‌గారు, మిస్ లిడియా మరొక ఊరినుంచి ఆర్సో స్వగ్రామం పియత్రనెరాకి రాబోతారు. కొలంబా-బారిచీని మీద ఆర్సో ఆంటన్‌కు అనుమానం ఎక్కువయ్యే ప్రయత్నాలు చేస్తుంది. ఆర్సో కర్నల్‌ను తీసుకు వచ్చేందుకు బయల్దేరాడు.

## 18

తనమాట సరిగ్గా వినని పరివారాన్ని తప్పించుకున్న ఆర్సో ముందుకి సాగిపోయాడు. అప్పటికే అతనిలో తనశత్రువులు ఎదురవుతారేమో అన్న భయంకన్నా మిస్ నెవిల్‌ని కలవవచ్చుననే సంతోషమే ఎక్కువగా ఉంది.

"ఈ బారిచినీ మూలంగా బాస్తియాకి వెళ్ళవలసి వస్తోంది" అనుకున్నాడు. "నే నెందుకని మిస్ నెవిల్‌తోబాటే వెళ్ళలేదు? ఈ బాస్తియా బదులు బరెజ్జా వూటలని చూడటానికే పోతే?" అతనికి చప్పున తన చిన్నప్పటి సంగతులు జ్ఞాపకానికి వచ్చాయి. ఆ ప్రదేశంలోని చక్కటి దృశ్యాలు గుర్తుకి వచ్చాయి. ఒక పచ్చని 'మాయ తివాసీ' ఎక్కి అక్కడి ఛెస్ట్‌నట్ వృక్షాల క్రిందకి వెళ్ళినట్లు అనిపించింది. పచ్చగా మెరుస్తున్న పచ్చికమీద, చుట్టూ ఉన్న నీలం పువ్వులు నవ్వుతున్న కళ్ళలాగ కనిపిస్తూ ఉంటే, మిస్ లిడియా తన దగ్గరే కూచుని ఉంది. టోపీ తీసివేసింది. ఆమె బంగారు రంగు జుట్టు ఎండలో ఉజ్వలంగా మెరిసిపోతోంది. నిర్మలమయిన ఆమె కంటి నీలి రంగు ఆకాశం రంగుని మించి ఉంది. చెక్కిలి చేతిమీదికి ఆన్చి, తను వణికే గొంతుకతో చెప్పే 'ప్రేమవాక్కులు' వింటోంది. తను అజాచ్చియో వదిలి వెళ్ళిన ముందు రోజు ధరించిన మస్లిన్ దుస్తులు వేసుకుని ఉంది. ఆమె చిన్న పాదానికి ఒక నల్లని సాటిన్ స్లిప్పర్ తొడిగిఉంది. ఈ పాదాన్ని ముద్దు పెట్టుకుంటేనేచాలు అనుకున్నాడు ఆర్సో. కాని మిస్ లిడియా ఒక చేతికి 'గ్లవ్' వేసుకోలేదేమో, ఆ చేతితోనే ఒక పువ్వు కోసం అందుకోపోయింది. ఆర్సో ఆ పువ్వుకోసి ఆమె చేతికి ఇచ్చాడు. ఇచ్చేటప్పుడు ఆమె చేతిని పట్టుకున్నాడు. ముందు చేతిలోని పువ్వుని, తర్వాత ఆమె చేతిని ముద్దు పెట్టుకున్నాడు. ఆమె వారించలేదు......ఈ ఆలోచనలు, వూహాలు అతని తలలో మెదులుతున్నంతసేపూ ధ్యాస దారి మీదలేక, అతని ప్రయాణానికి కొంత అంతరాయం కలిగింది. కాని గుర్రం వేగం తగ్గించలేదు. తన వూహా లోకంలో మరొకసారి మిస్ లిడియా తెల్లటి చెయ్యి ముద్దు పెట్టుకున్నా ననుకున్నాడు గాని నిజానికి తనికి తెలియకుండానే గుర్రం తలని చుంబిస్తున్నానని గ్రహించాడు! అది కూడా హఠాత్తుగా ఆగిపోయింది. చిలినా దారికి అడ్డంగా నుంచుని కళ్ళెం పట్టుకుంది.

"ఇలా ఎక్కడికి ఆర్సో ఆంటన్?" అంది.

"మీ శత్రువులు దగ్గిరే ఉన్నారు తెలుసా?"

"నా శత్రువులా?" అని అరిచాడు ఆర్సో. అంత చక్కని కలకి భంగపాటు వచ్చినందుకు "ఎక్కడ?"

"అర్లాం డుచ్చియో ఇక్కడే ఉన్నాడు. మిమ్మల్ని వెంటాడుతున్నాడు. వెనక్కి తిరిగిపొండి."

"నన్ను వెంటాడుతున్నాడా? చూశావా?"

"అవును ఆర్సో ఆంటన్. పొదల్లో పడుకుని ఉండగా ఇలా వెళ్ళాడు. అన్ని వైపులా తన దూరదర్శినితో పరిశీలనగా చూస్తున్నాడు."

"ఎటు వైపు వెళ్ళాడు?"

"అటే. మీరు వెళ్ళేవైపే."

"మంచిదే. నీకు ఋణపడి ఉన్నాను."

"ఆర్సో ఆంటన్! మా మామయ్యని వెంట పెట్టుకోరేమిటి? ఇప్పటికే చాలా ప్రమాదం! అతను వెంటవస్తే మంచిది."

"భయపడకు చిలినా. మీ మామయ్య కాపలా అవసరం ఉండదులే!"

"మీ ముందు వెళ్ళమంటారా?"

"వద్దులే ఎటో చెప్పు చాలు!"

ఆర్సో ఆ చిన్నపిల్ల చెప్పిన వైపే గుర్రాన్ని తోలుకుంటూ పోయాడు.

తన గుర్రం చెవి కోసిన వాడిని శిక్షించవచ్చును కదా అని సంతోషించాడు ముందు. కాని, వెళ్ళిన కొద్దీ, తను గ్రామాధికారికి మాట ఇచ్చిన సంగతి జ్ఞాపకం వచ్చింది. మిస్ నెవిల్‌ని అనుకున్నప్పుడు కలుసుకోలేక పోతానేమో అనే దిగులు పట్టుకుంది. అర్లాం డుచ్చియోని కలుసుకొనక పోవటమే మంచిదేమో అనుకున్నాడు. ఇంతలో తన తండ్రి మరణం, తన గుర్రానికి జరిగిన అపచారం, బారిచినీ బెదిరింపు మళ్ళీ కోపం తెప్పించాయి. శత్రువుని వెతికి పట్టుకుని పోరాడాలని నిశ్చయించుకున్నాడు. ఈ విధంగా తనలో తనే సంఘర్షణ పడుతూ ముందుకి సాగిపోయాడు. అయితే, కొద్దిగా జాగ్రత్త పడ్డాడు. పొదలని, కంపలనీ పరీక్షగా చూస్తూ వెళ్ళాడు. కొన్ని సార్లు ఆగిపోయి, అనుమానం కలిగించిన శబ్దాలను జాగ్రత్తగా విన్నాడు. చిలినాని వదిలిన పది నిముషాల తర్వాత బాగా పల్లంగా దిగిపోతున్న చోటు అంచు వద్దకి వచ్చాడు. అక్కడ పొదలలో చాలా భాగం అంతకు ముందే తగల పెట్టబడినట్లు కనిపించింది. ఇది చూడటానికి ఎలా ఉన్నా దొంగతనంగా ఎవరయినా దాక్కుని మీద పడేందుకు వీలు లేకుండా ఉంది.

ప్రతిక్షణమూ తుపాకి గుండు వచ్చి తన రొమ్ములోనుంచి దూసుకుపోవచ్చునని ఎదురుచూసే ఆర్సోకి ఇదొక చక్కటి ప్రదేశమే అనిపించింది.

మాడిపోయిన ఆ బయలులో అవతల చిన్న పొలాలు కనిపించాయి. వీటిచుట్టూ రాళ్లతో గోడలు కట్టి ఉన్నాయి. పొలాలకి గోడ వెయ్యటం కార్సికాదేశం వారికి అలవాటు. ఈ పొలాల మధ్యనుంచే బాట. పెద్ద పెద్ద చెట్లు బాటలమీద గుబురుగా ఎదిగి దూరంనించి చూడటానికి అడవిలాగ కనిపించింది.

నేల మరీ గడ్డుగా ఉండటంచేత ఆర్సో గుర్రం దిగి, కళ్లెం చేత పట్టుకుని వాలుగా కిందకి దిగుతున్న ఆ చరియ మీదుగా నడిచి వెళ్లాడు. కొంచెం ముందుకు పోయాడో లేదో పొలం ప్రాకారం వెనకనుంచి ఒక మనిషి తలకాయ, తుపాకి కనిపించాయి. తుపాకి మోగింది. ఆర్సో కూడా ఆత్మరక్షణకి సిద్ధం అయ్యాడు. ఆ క్షణంలో ఆర్సోలో చెలరేగిన ఆవేశం కేవలం ఒక ధైర్యశాలిలోను మరణాన్ని ఎదుర్కొనే ముందు కలిగిన ఆవేశమే.

"ఛీ, దొంగా!" అని అరిచాడు.....మళ్లీ అదే మాట అన్నాడో లేదో అర్లాందుచ్చియో తుపాకి పేలింది. అంతేకాక, మరొకచోటనుంచి అంతదాకా కనిపించని మరొక తుపాకి పలకడం ప్రారంభించింది. ఈ తుపాకి కాల్చే వ్యక్తి కూడా ఒక గోడ వెనకనే దాక్కొని ఉన్నాడు. రెండు తుపాకి గుళ్లూ లక్ష్యాన్ని సాధించాయి. అర్లాందుచ్చియోది కుడి చేతిని దూసుకుంటూ వెళ్లింది. రెండవది రొమ్ముకి తగిలింది. కాని అక్కడ తగిలించుకున్న బాకు అడ్డం ఉండటంవల్ల చిన్న గాయం మాత్రం పడింది. ఆర్సో ఎడం చెయ్యి పడిపోయింది. కాని అతను వెంటనే లేచి ఒక చేత్తోనే తుపాకి పట్టుకుని అర్లాందుచ్చియో మీదకి కాల్చాడు. అర్లాందుచ్చియో తల అంతకుముందే గోడమీద కనిపించి మాయం అయింది. ఆర్సో ఎడం వైపుకి తిరిగి పొగ కనిపించటంచేత తన రెండవ శత్రువు అక్కడే ఉండవచ్చునని గ్రహించి అటు కూడా తుపాకి పేల్చాడు. ఆ క్షణంలోనే ఆ మనిషి కూడా కనిపించి, తుపాకి పేలిన మరుక్షణం అదృశ్యుడయ్యాడు. ఈ చివరి ప్రేలుడు తర్వాత ఆ ప్రదేశాన్ని నిశ్శబ్దం ఆవరించింది. ఆర్సో తుపాకి గొట్టం పొగ నెమ్మదిగా ఆకాశంలోకి లేచి మాయమయి పోతోంది. గోడ వెనక సంచలనమే కనిపించలేదు. దెబ్బ తగిలిన చేతి బాధ లేకపోతే ఇదంతా తను కన్న ఒక కల అనుకోవచ్చు అనిపించింది అతనికి.

శీఘ్రంగా లేచి ఒక పొద చాటుగా దాక్కున్నాడు. అక్కడ త్వరగా తన తుపాకీలో కొత్త మందు గుండు కూరాడు. ఎడం చెయ్యి బాధ చాలా ఎక్కువగా ఉంది. ఏదో పెద్ద భారం ఎత్తినట్లు ఉంది. తన ప్రత్యర్థులు ఏరి? అతనికి అర్థం కాలేదు. పారిపోయారా? లేక గాయపడ్డారా? రెండిటిలో ఏది జరిగినా తను గమనించి ఉండే వాడేకదా? ఏదో ఒక రకమయిన సంచలనం కనిపించేది. పోనీ చనిపోయారా? లేక తను ముందుకువస్తే కాలుద్దామని పొంచి చూస్తున్నారా? ఏ నిశ్చయానికీ రాలేక ఒక చెట్టు మొదలు వెనక చేరి దాని రక్షణ దొరికినందువల్ల లేచి నుంచున్నాడు. ఒక వేలు తుపాకి ట్రిగర్ మీదనే ఉంచి తన శత్రువు కనిపించిన గోడ వంక జాగ్రత్తగా చూశాడు. ఒక క్షణం ఒక శతాబ్దంగా తోచింది అతనికి.

కొంత సేపటికి అతని వెనకవైపు ఒక అరుపు వినిపించింది. ఇంతలో ఒక కుక్క అక్కడికి పరుగెత్తుకుంటూ వచ్చి ఆగిపోయింది. అతనిముందు తోక ఆడిస్తూ నుంచుంది. అది ఎవరోకాదు, బ్రుస్కో! అంటే దాని యజమాని కూడా అక్కడికి రాబోతున్నాడన్నమాట. అప్పుడు ఆ దొంగ రాకని ఎదురు చూసినట్లు ఆర్సో ఎంత నిజాయితీ కలిగిన వ్యక్తి రాకనీ ఎదురుచూసి ఉండడు. కుక్క ముట్టెపైకి ఎత్తి జాగ్రత్తగా వాసన చూసి కొంచెం కలవరపాటు ప్రకటించింది.

ఒకసారి గుర్రుమని, తోక ముడిచి పొదలలో ఇటూ, అటూ పరిగెత్తింది. కాని ఆర్సోని మాత్రం ఒక కంట కనిపెడుతూనే ఉంది. ఇలా కొంత దూరంగా అవతలికి వెళ్ళి చివరికి ఆర్సో దిగివచ్చిన ఎత్తు ప్రదేశం అంచు చేరుకుంది. అక్కడ ఒక మనిషి ఎదురయ్యాడు. చరియ బాగా వాలుగా ఉన్నప్పటికీ చకచక దిగాడు.

"ఇక్కడ బ్రాందో!" అని కేక వేశాడు ఆర్సో. వీలయినంత గట్టిగా.

"హా! ఆర్సో ఆంటన్! గాయం అయిందా!" అని అడిగాడు బ్రాందలచ్చియో దగ్గరికి వస్తూ" వంటిమీదనా, కాలుకా, చేతికా?"

"చేతికే"

---

"ఇది పిక్నిక్‌కు చాలా అనువైన చోటండీ" ఓ పెద్దమనిషి వర్ణిస్తున్నాడు.

"అవునవును! లేకపోతే ఇన్ని వేలదోమలిక్కడెలా వుంటాయి" అని ఇంకోవ్యక్తి అర్థోక్తిగా అందుకున్నాడు.

రఘునాథం (రాళ్ళవల్లి)

---

"చేతికి! వాళ్ల సంగతేమిటి?"

"దెబ్బ తగిలిందనుకుంటున్నాను"

కుక్కని వెంట పెట్టుకుని బ్రాందలాచ్చియో గోడ దగ్గరగా వెళ్ళి అవతలకి తొంగి చూశాడు. తలమీద టోపీ తీసి.

"అర్లాందుచ్చియోకి అభినందనలు" అన్నాడు. ఆర్సో వైపు తిరిగి, "అదుగో, ఆ మనిషి పని పట్టారు" అన్నాడు.

"బతికే ఉన్నాడా?" అని అడిగాడు ఆర్సో.

"ఓహో! ఏదో లెండి. మీ తుపాకి గుండు కంట్లో పడిందే అని బాధ పడుతూ ఉండి ఉంటాడు. ఆహా! ఏమి గురి! ఏమి తుపాకి! ఎంత చిల్లు పడింది! అసలేమిటి చెప్పు ఆర్సో ఆంటన్—ఇక్కడికి వస్తూ ఉంటే పుఫ్! పుఫ్ మని చప్పుడు విన్నాను. తర్వాత ధన్! ధన్! మని వినిపించింది. అదుగో, ఇంగ్లీష్ తుపాకి పలుకుతోంది అన్నాను. బాగా పలికింది......కాని బ్రుస్కో ఏమిటంటుంటుంది?"

కుక్క తన్ని రెండవ ప్రాకారం దగ్గరకి తీసుకు పోయింది. "క్షమించండి!" అని అరిచాడు బ్రాందలాచ్చియో విస్మయంతో. "జోడు దెబ్బ! తక్కువలేదు! ఆహా! మందుమీద పొదుపు చేస్తున్నారా? దెబ్బ కొక మనిషిని కొట్టారు?"

"ఏమి టేమిటి?" అని అడిగాడు ఆర్సో.

"వేళాకోళం కట్టి పెట్టండి లెఫ్టినెంట్! పిట్ట నేలకి రాలింది. దాన్ని ఏరి తీసుకు రావాలంటారు! మంచి విందే మీ కివాళ!

ఎడ్వకేట్ బారిచినీ సంగతి ఆలోచిస్తున్నాను. ఆయనకి వారసు లెవరు?"

"ఏమిటీ విన్సెంటెల్లో కూడా చచ్చిపోయాడా"

"పూర్తిగా చచ్చిపోయాడు. అందరూ చిరాయువులుగా ఉండుగాక! (కార్సికాలో చావు సందర్భంలో వాడే దానికి తెలుగు—అ.) వచ్చి విన్సెంటెల్లోని చూడండి. మోకాళ్లమీద, గోడకి ఆనుకుని ఉన్నాడు. నిద్ర పోతున్నాడా అన్నట్లుంది. సీసపు నిద్రా? పాపం!" (తుపాకి గుండు సీసంతో చేస్తారు—అ.)

ఆర్సో భయ విహ్వాలుడయినట్లు తల తిప్పి వేసి, "చచ్చిపోయాడని గట్టిగా చెప్పగలరా?" అని అడిగాడు.

"మీ పని [illegible]యరో కార్సో లాగుంది. ఎప్పుడూ [illegible] కాల్చలేదా ఏమిటి? చూడండి! అక్కడ......రొమ్ములోనుంచి, గుండెని దూసుకుపోయింది. వించిలియోనికి వాటర్లూలో దూసుకుపోయినట్లు........రెండు కాల్పులకి ఇద్దరు మనుష్యులు! అన్న తమ్ములు! మూడో గుండుతో తండ్రిని పంపించేసేవారా......అంత పనీ జరుగుతుంది .... ఏమి దెబ్బ ఆర్స ఆంటన్!...... పోలీసులని ఎదిరించే వాడు నా కంటే మొనగాడు రాడని అన్నానే!"

మాట్లాడుతూనే బందిపోటు ఆర్సో చెయ్యి పరీక్షిస్తూ, కత్తితో అతని కోటు చెయ్యి చీల్చి, గాయం చూసి, "ఇదేమీ ఫరవాలేదు" అన్నాడు. "ఈ కోటు నింక కొలంబాగారు బాగు చెయ్యాలిసిందే! అరె! ఇదేమిటి? మీ రొమ్ముకి దెబ్బ తగిలిందేమిటి? ఫరవాలేదుగా? అంత ప్రమాదంలేదు.... ఏదీ మీ వేళ్లు పరీక్షించనీ.......ఈ వేలు కొరికితే తెలుస్తోందా?........అంతగా లేదా?....... ప్రమాదం లేదు...... మీ రుమాలు ఇవ్వండి! మీ కోటు బాగా చెడిపోయింది. అయినా ఈ అలంకరణ అంతా దేనికి?.......మాతో రండి! ఒక గ్లాసు వైన్ పుచ్చుకోవచ్చు.......అసలు మీ వెంట ఎప్పుడూ కొంచెం ఉంచుకోరా?........" హఠాత్తుగా ఈ వాగ్ధోరణి కట్టి పెట్టి, "జోడు దెబ్బ! ఇద్దరూ చచ్చారు!... మన మిత్రుడు అంటాడు.......జోడు దెబ్బ! అబ్బా చిలినాది మరీ తాబేలు నడక!"

ఆర్సో సమాధానం చెప్పలేదు. మృత్యుముఖంలో ఉన్నవానివలె పాలిపోయాడు. వణుకుతున్నాడు.

"చిలీ" అని అరిచాడు గోడ అవతలకి చూస్తూ.

"ఊ!" అని ఆమె గోడదాటి వచ్చేందుకు సహాయపడ్డాడు. ఆమె అర్లాందుచ్చియో శవం చూసి 'క్రాస్' సంజ్ఞ చేసింది.

"నువ్వేనా, మామయ్యా?" అని అడిగింది. బెదురుగా.

"నేనా? అంతకంటేనా! కాదు. ఇది ఆర్సో గారి పని. ఏదీ ఆయన్ని అభినందించు!"

"కొలంబాగారు సంతోషిస్తారు" అంది చిలినా. "మీకు గాయం అయిందంటే చాలా బాధ పడతారు!"

7 వ పేజీ చూడండి



డ్రెడ్జి బాయిలర్ ముందునుంచుంటే నరకంలో మంటల ముందు నుంచున్నట్లే; ఫయిర్‌మాన్‌కి ఇలా అనిపిస్తుంది. కాని, అది అతనిపని. చాలా కష్టంతో కూడినపని ఫయిర్‌మాన్‌గా ఉండటం మాటలు కాదు. ఎంతో అనుభవం కావాలి. అన్నిటికన్నా అవసరం, సహనం-ఒక సాధువుకి ఉన్న సహనం.

బెన్ సంగతి అంతే! రోజంతా ఫర్నేస్ (కొలిమి) ముందు నుంచుంటాడు. వాన రానివ్వండి, ఎండ కాయనివ్వండి. ఫర్నేస్‌లోకి కట్టెలు వెయ్యటమే అతనిపని. దానికి కొంచెం 'గురి' అవసరం కట్టెలు ఒకదానికొకటి అడ్డంగాపడి ఫర్నేస్‌లో నిప్పు ఆరిపోకూడదు.

అవి మరీ దగ్గరగా పడితే అంతపనీ జరుగుతుంది. మరీ వదులుగా పడితే లోపల ఖాళీ ఎక్కువయి వేడి తగ్గుతుంది. అప్పుడు మరికొంచెం సరుకు వెయ్యాలి. ఇంతలో కాలం, సరుకు కూడా దండగయినట్లే.

మీకు ఈపని బాగా అలవాటయితే ఫర్నేస్ తలుపు చీటికి మాటికి తెరుస్తూ ఉండరు. ఇలా చేస్తే వేడి వ్యర్థం అవుతుంది. అంటే పని అధికం అవుతుందన్నమాట.

బెన్ చాలా కష్టపడి పనిచేసేవాడు. అతని దుస్తులు చూస్తేనే తెలుస్తుంది, ఒక జత రబ్బరు బూట్లు—నిప్పులమీద కాలు వేస్తే ప్రమాదము ఏమీ జరుగకుండా—చిరిగిపోయిన టోపీ ఒకటి (దీని అంచుని క్రిందికి తిప్పి ఉంచుతాడు. దీనివల్ల అతని మెదడు మాడిపోకుండా, కనుబొమలు కాలిపోకుండా ఉంటాయి.)

అయినా ఫయిర్‌మెన్‌కి నష్టాలంటూ ఉండవు, కాళ్లమీద జుట్టు కూడా సాధారణంగా ఉండదు. కళ్లు నిర్జీవంగా, ఎండిపోయి ఉంటాయి. వేడికి వాటిలో నీరంతా ఇగిరిపోతుంది. బెన్ కళ్లంతే.

బెన్ నిజంగా, ఆదర్శంగా తీసుకొనవలసిన ఫయిర్‌మాన్ అనవచ్చు. అతనికి ఈ వృత్తి సహజంగా వచ్చిందా అనిపిస్తుంది. ఎంతకాలంగా ఈపని చేస్తున్నాడో అసలు! యుద్ధకాలంలో గని మూసేసినప్పుడు బెన్ వరిపొలాలలో పనిచేశాడు—చచ్చుపని అనేవాడు. గనిలో తిరిగి పని మొదలయినప్పుడు అక్కడ కార్మికులలో మొదటి ఫయిర్‌మాన్ అయ్యాడు బెన్. అందరూ అతన్ని తమ 'షిఫ్ట్' లోనే కావాలనేవారు. బెన్ పనిచేస్తూఉంటే మంటలు ఎప్పుడూ గరిష్ఠ ఉష్ణోగ్రస్థితి కలిగి ఉండేవి. అంటే, ఆవిరిపీడనం ఉధృతంగా ఉండేదన్నమాట—దీనివల్లనే కదా డ్రెడ్జి పని బాగా జరిగేది.

అది మా అదృష్టం. బెన్ మా షిఫ్ట్‌కి వచ్చాడు. ఎంతో కష్టపడి పనిచేసేవాడు, కాని సరదాగానూ ఉండేవాడు. కాని, ఎందుకో కాని ఎప్పుడూ అతని అపహాస్యాలలో అతనే 'దెబ్బ' తినేవాడు. కంచరగాడిదకి ఉన్నంత పెంకితనం, దురుసుతనం ఉండేది అతనికి.

కొన్ని సమయాలలో 'డ్యూటీ' మీద లేనప్పుడు విసుగుపుట్టి ఎవరిమీదనో పడేవాడు—పడి తను బాధపడేవాడు. దానితో సణుగుతూ, తిడుతూ

# సుప్రసిద్ధ ఆసియా కథలలో మూడవది

## రచన: అచిన్ పంజబన్ (మలయా)

> రాజకీయ వార్తల విషయంలోనే గాక సాహిత్యం విషయంలో కూడా మన పత్రికలు ఆసియా దేశాలను అశ్రద్ధ చేస్తున్నాయనే ఆరోపణ లేకపోలేదు! పాశ్చాత్య సాహిత్యం తెలిసినంతగా మనకి మన ఖండంలోనే వెలువడిన, వెలువడుతున్న సాహిత్యం గురించి తెలియదు. ఈ లోటును కొంత వరకు తీర్చేందుకే సుప్రసిద్ధ ఆసియా రచయితల కథలు కొన్ని వరుసగా ప్రచురిస్తున్నాము. మలయాకి చెందిన యీ కథ యీ శీర్షికలో మూడవది. ఒక్కొక్క వారం ఒక్కొక్క దేశానికి సంబంధించిన కథ ప్రచురిస్తాము.

కూర్చునేవాడు. కాని, పనిచేసేప్పుడు, ఫర్నేస్ ముందు, మాత్రం బెన్ జోలికి పోయేవారు కాదు ఎవరూ.

నాకు జ్ఞాపకం, ఒకసారి బెన్ పనిచేసుకుంటూ ఉండగా ఏడిపించపోయాడు ఒకడు. చకచక కొట్టెలు కొలిమిలో వేస్తూనే బెన్ నిప్పు సవరించే కడ్డీ తీసుకొని వాడిమీదికి తిరిగాడు. నవ్వుతూ తరిమి వేశాడు.

బెన్ బలంగా ఉండేవాడు. అలాగని ఆడవారిని ఆకర్షించే రూపం కాదు. అందుకనే పెళ్లిచేసుకోలేదనుకుంటాను. సంవత్సరాల తరబడి ఈపనిచేసి వికృతంగా మారిపోయాడు. అదీకాక 'మలే' (మలయాలో చైనా భారత జాతుల వారు కాక అసలు ఆ ప్రాంతానికి చెందిన జాతివారిని 'మలే' అంటారు. టుంకూ అబ్దుల్ రహమాన్ మలే !) కాబట్టి 'థాయ్' 'అంత బాగా మాట్లాడలేడు కాని, దక్షిణ థాయ్‌లాండ్ ప్రాంతాలలో గనులలో పని చేసేవారికి మలే భాష ఏదో కొంత వచ్చు. అందుకని బెన్‌కి కొంచెం హోదా ఏర్పడింది. ఏదయినా వివాదాలు వస్తే మలే భాష వాడినప్పుడు బెన్‌తో వాదించి గెలిచేవారెవరు ? ఛ ! వాడి వాగుడు వేగం ఏ వాగుకీ ఉండదు !

డ్రెడ్జికి నీరు చాలా అవసరం. 30 మంది కలిసి పనిచేసే ఒక షిఫ్ట్‌కి రెండు బకెట్లు అవసరం. కాని, ఫయిర్‌మెన్‌కి ఇంకా ఎక్కువ అవసరం ఉంటుంది. వారు విపరీతంగా చెమరుస్తారయను ! ఒక షిఫ్ట్‌లో ఇద్దరు ఫయిర్‌మెన్‌కి చెరొక బకెట్ నీరూ కావాలి. చాలా నీరు వాడేస్తారు వీళ్ళు.

రంజాన్ వచ్చింది. ముస్లింలు ఉపవాసం చేసే కాలం ఇది. పొద్దు పొడిచినప్పటినుంచి క్రుంకే దాకా ఏదీ గొంతుక దిగరాదు. చివరికి ఉమ్మి కూడా మింగకూడదు. ఇటువంటివి 40 రోజులు ఉంటాయి. అందుకనే ప్రతిదినం చీకటి పడిన తర్వాత బెన్ ఇష్టం వచ్చినట్లు తిని తాగేవాడు—మర్నాడు చేయబోయే ఉపవాసానికి, ఆ కొలిమి ముందర.

దురదృష్టంకొద్దీ అతన్ని రంజాన్‌లో పగటి షిఫ్ట్‌లకే వేశారు. అతను ఏడిపించినవారు పగ తీర్చుకునేందుకు చేసిన పని ఇది.

అతని ఎదురుగా నారింజలు వలిచి గుటకలు వేస్తూ తినేవారము. పెద్ద పెద్ద మంచుగడ్డలు తీసుకువచ్చి అతని ఎదురుగా బకెట్‌లలో పడవేసేవారము. మెల్లిగా త్రాగుతూ, చప్పరిస్తూ, వంటి మీద, ముఖంమీద చల్లుకుంటూ అతన్ని కవ్వించేవారము.

ఒక 'విదూషకుడు' కప్పులో నీరుపోసి, బెన్ దగ్గరికి నడిచివెళ్లి అతను చెమటలు కక్కుతూ చాకిరి చేస్తూఉంటే, నెమ్మదిగా త్రాగేవాడు. ఉపవాసం మానుకుంటాడని మా ఆశ. అంతపని చేస్తే పెద్ద తమాషా జరిగినట్లు వూహించేవారము.

హఠాత్తుగా ఒకరోజు, మరీ అతి చేసేశామనుకున్నాము. బెన్‌ని చూస్తే జాలివేసింది. అతన్నే త్రాగమన్నాము, వేడుకొన్నాము. రోజు విడిచి రోజు శిక్ష ఏమి టనుకున్నాము. మేము చూడనట్లు నటిస్తాములే. అవతలకి వెళ్లిపోయేవారము. అక్కడే వదలి వెళ్లిన నీరు తాగుతాడేమో అనుకునేవారము. అతను బకెట్‌ను సమీపించాడు. దానివంక చూశాడు అందుకున్నాడు. మేము వూపిరి బిగబట్టాము. కాని బెన్ కొంచెం తీసి వంటిమీద చల్లుకున్నాడు, అంతే. తర్వాత పని కొనసాగించాడు.

నిజం చెప్పాలంటే, బెన్ శ్రేయస్సే కాదు మమ్మల్ని ఈపని చేయించింది, మా సంగతి కూడా ఆలోచించుకున్నాము. బెన్ అలసిపోయి క్రింద పడితే—ఎవరయినా పడిపోవలసిందే కదా! — కొలిమిని చూసుకునేవా రెవరు ? వేడి తగ్గి డ్రెడ్జి వేగం తగ్గుతుంది. మా షిఫ్ట్‌కి చెడ్డపేరు రావటమే కాదు. మా ఫోర్‌మాన్ మామీద విరుచుకుపడడూ ? పోనీ బెన్‌కి రాత్రి షిఫ్ట్ వేయిస్తే ? పాపం, రాత్రయితే బెన్ కావలసినంత తిని తాగవచ్చుకదా !

కాని, కొందరు వీల్లేదన్నారు. బెన్ అక్కడే ఉండిపోయాడు.

మేము నిరాశతో తిరిగి వచ్చేశాము. బెన్‌కి మేము అతని పక్షం తీసుకున్నామని తెలీదు. అప్పటికే బెన్‌మీద జాలి వేసింది మాకు. కొలిమి ఏమయితే నేమిటి, అనుకున్నాము. అతను ఈవిధంగా నీరూ, ఆహారం లేకుండా చెమటోడ్చటం ఏమిటి ? అనుకున్నాము. పెద్ద చిక్కు వచ్చి పడింది, అనిపించింది.

మర్నాడు బెన్ ఏడుపు మొహంతో తయారయ్యాడు, రాత్రంతా మెక్కినా ఈ వాలకం ఏమిటో అర్థంకాలేదు. ఏదో కలత చెందిన వాడిలాగ ఉన్నాడు. అతన్ని చూస్తే జాలి కలిగింది. మాకు ఉపవాసం లేదుకాని బెన్‌ని చూస్తే మాకూ ఆహారం సహించలేదు. మా షిఫ్ట్‌లోనే ఒక రకమయిన నిస్పృహ ఆవరించింది. విపరీతంగా ఆలోచించసాగాము. మా స్నేహితుడికి సాయపడటం ఎలా ?

ఎవరికో ఒక మంచి వూహ కలిగింది. కావలసినంత పని చేశాముకదా, ఫర్నేస్ తగ్గిపోతే మట్టుకు మునిగిపోయిం దేమిటి ? బెన్‌ని నీటికుండులో దిగముంటాము. త్రాగరాదు కాని నీటిలో హాయిగా కూర్చుని విశ్రాంతి తీసుకోరాదని ఎక్కడుంది ? 'బలే !' అన్నాము. బెన్ అయోమయంగా చూశాడు మావైపు. ఇదంతా ఏమిటి అనుకున్నాడు కాబోలు.

వెళ్లి బెన్‌తో చెప్పాము. కాని, మతాభిమానం కల బెన్ ఒప్పుకోలేదు. బలవంతాన తీసుకుపోయి నీటికుండులో పడవేశాము.

మేము తిరిగి కొలిమి దగ్గరికి వచ్చేసి కొట్టెలు లోపలికి వెయ్యటానికి ఉద్యుక్తులయ్యాము. మొదటిది పైకి ఎత్తామో లేదో బెన్ నీటిలో నుంచి పైకి ఉరికి ఎర్రగా కాలిన ఇనపకడ్డీ పట్టుకుని మావైపు వచ్చాడు. పిచ్చెక్కింది అనుకున్నాము. చిందర వందర అయ్యాము. బెన్ గట్టిగా నవ్వి కడ్డీ అవతలకి విసిరి తన పని మొదలుపెట్టాడు.

అయోమయంగా చూడటం మావంతు అయింది. బెన్ పనిచేసే వేగం ఆశ్చర్యకరంగా ఉంది. కొట్టెలు గురి తప్పకుండా విసురుతున్నాడు.

"నాపని బావుంది !" అన్నాడు. "ఇప్పుడంతా బావుంది !" అని అరిచాడు. అబ్బాయ్ ! రంజాన్ అయిపోయేదాకా కొలిమి పాట పాడిందనుకో ! ! ★



# మనిషి-మిథ్య

ఆదివిష్ణు

## 2

వేళకి పోస్టుమాన్ రాకపోతే చిరాకు పడేవాళ్లలో జానకిరామయ్య ముఖ్యులు.

ఆయనకి రెండు రోజుల్నుంచీ అసలేం తోచడం లేదు. పోస్ట్‌మన్ తీసుకురాబోయే ఉత్తరాలొచ్చినా బావుండు, కాసేపు చదువుకుని మళ్లా జవాబు రాయడంలో కొంతకాలం ఖర్చవుతుంది గదా అని ఆయన అభిప్రాయం. పోనీ, తిన్నగా పోస్టాఫీసుకే వెళ్లి ఉత్తరాలు తీసుకొద్దామా అంటే వోపిక చాలడం లేదు దానికి తగ్గట్టు బయట ఎండ నిప్పులు కక్కుతోంది.

పెద్ద వయస్సు. ఈ దీపం మరింకెన్నాళ్లో వెలగదు. దీపం వెలిగిన యిన్ని సంవత్సరాల్లో ఎంత చరిత్ర! ఎన్ని అనుభవాలు! గడచినదంతా కలఖా, నడిచి వచ్చిన బాటలా ఉంది ఆయనకి.

జానకిరామయ్యగారు పేలవంగా నవ్వారు.

సుశీల కాఫీ తీసుకొచ్చింది. నాన్న పరాకుగా నవ్వడం గమనించి ఆమెకూడా నవ్వుతూ...

"కాఫీ నాన్నా! తీసుకొచ్చి రెండు నిముషాలయింది."

సుశీల మాటతో జానకిరామయ్యగారు తెప్పరిల్లారు. కాఫీ తీసుకుంటూ అడిగారు.

"ఇంకా పోస్టుమాన్ రాలే దేమిటమ్మా?"

ఆమె సమాధానం చెప్పకుండానే వెళ్లిపోయింది.

కాఫీ ముగించి వీధి అరుగుమీదికి వచ్చి నిలబడ్డా రాయన. అక్కడ నిలబడి వీధివైపు ఆశగా చూడటం మొదలుపెట్టారు.

నిరంజనం ఉత్తరం రాసి పదిరోజులు దాటింది. 'హోదాలో బతుకుతూన్న కొడుక్కి తండ్రి కనిపిస్తాడటయ్యా' అంటాడు కోటయ్య పంతులు. పంతులు పిచ్చి కాకపోతే—ఎంత హోదాలో ఉన్నా నిరంజనం తన కొడుకే. వాడిమీద నమ్మకం ఇంకా చావలేదు. తండ్రిని మరిచిపోయేంత ధూర్తుడుకాడు నిరంజనం.

నిరంజనం జాతకపురుషుడు. అతన్ని చూచి చాలామంది యీర్ష్యపడటం కూడా కద్దు. ఒక మామూలు బి. ఎ నిరంజనం ఇంత అదృష్టవంతుడవుతాడని జానకిరామయ్యగారుకూడా అనుకోలేదు.

ఆపిల్ల నిరంజనాన్ని ప్రేమించి పెళ్లి చేసుకున్నదంటే — దాంట్లో ఆశ్చర్యపడక్కర్లేదు. నిరంజనం హుందాగా, అందంగా ఉంటాడు. తన పెంపకంలో గూడా అతనికి ఏ లోటూ రానివ్వలేదు. అతనికి ఒక్క దురభ్యాసమూ లేదు. అమాటకొస్తే అతను అందరిలాటివాడూ కాదు. బుద్ధిగా చదువుకున్నాడు. అందరిలోనూ అవుననిపించుకున్నాడు.

అలాంటి నిరంజనం రేణుకని ఆకర్షించాడంటే అర్థం లేకపోలేదు. అతనే తన సర్వస్వంగా ఎంచుకున్నదంటే ఆశ్చర్యపడక్కర్లేదు.

రేణుక, లక్షాధికారుల ఇంట్లో పుట్టింది. బంగారు టుయ్యాల్లో పసితనం గడిపింది. ఆస్తి విషయంలో నిరంజనం రేణుక కంటె తక్కువ వాడే కావచ్చు. అంతమాత్రాన ఆమెకి తగనివాడు మాత్రం కానే కాదు.

నిరంజనం మనసు అమృతంలాంటిది. అతని హృదయం నిష్కల్మషమైనది. నిరంజనం రేణుకని ప్రేమించాడని తెలీగానే జనం పెడర్థాలు తీశారు. ఎన్నో చాటుగా అన్నారు. ఆ మాటలు జానకిరామయ్యగారి వరకూ వొచ్చిన మాట వాస్తవం.

అయితేనేం? కొడుకుపట్ల, అతని నిర్ణయాలమీద ఆయనకి గురీ, గౌరవమూ అప్పుడూ, ఇప్పుడూ, ఎప్పుడూ ఉంటాయి.

వాళ్ల పెళ్లి నిర్విఘ్నంగా జరిగింది. నిరంజనాన్ని అల్లునిగా స్వీకరించడానికి రేణుక తండ్రి ఏ అభ్యంతరమూ పెట్టలేదు. పైగా ఈనాడు నిరంజనం చేత ఆయన పొగాకు వ్యాపారం పెట్టించాడు. గుంటూరులో కూతురూ, అల్లుడు ఉండేందుకు ఇంద్రభవనంలాటి ఇల్లు కట్టించేరు. వ్యాపారం నిరంజనం చేతిలో పెట్టి తాను నిశ్చింతగా పల్లెటూళ్లో కాలం గడుపుతున్నారు.

నిరంజనంపట్ల ఆయనకున్న గాఢమైన విశ్వాసాని కిది చక్కటి నిదర్శనం కాదూ?

ఎవరెన్ని అనుకుంటేనేం—వాళ్ల మధ్య ఇంతవరకూ ఏవిధమైన పొరపొచ్చాలూ రాలేదు. రావు గూడాను.

జానకిరామయ్యగారు అరుగు దిగి రోడ్డుమీదికి వొచ్చారు. పోస్టుమాన్ కోసం వీధి చివరి వరకూ చూపు నిలిపారు. పోస్ట్‌మాన్ ఆలస్యం చేస్తున్నకొద్దీ ఆయనకు విసుగు కలుగుతోంది. పోస్టల్ డిపార్టుమెంటు యావత్తునీ లోలోన తిట్టిపోస్తున్నారు. తండ్రి అవస్థ గమనించిన సుశీల నవ్వుతూ అన్నది.

"వొచ్చే పోస్టుమాన్ ఎలాగో వొస్తాడు గానీ, నువ్వెందుకు నాన్నా రోడ్డుమీద ఎండలో నుంచోడం? లోపలికిరా."

ఆయన కిష్టంలేకపోయినా లోపలికొచ్చి కూర్చోక తప్పిందికాదు. కూర్చున్నారన్నమాటే గాని ధ్యాసంతా పోస్టుమాన్ మీదనే ఉంది.

'ఈపాటికి చర్చి ప్రాంతాలకి వొచ్చిఉంటాడు. రత్నంగారికి ఉత్తరాలిస్తాడు. ఆతర్వాత హాస్టల్‌కి వెళ్లాలి. అక్కడ స్టూడెంట్సు మరీ గడుగ్గాయిలు. వొచ్చిన ఉత్తరాల్ని సవ్యంగా తీసుకోడం వాళ్లకి చాతకాదు. ఆ ముసలి పోస్ట్‌మాన్‌ని నానా అవస్థలూ పెడతారు. దానికితోడు ఈ మణియార్డర్ల బట్వాడా ఒకటి, పాపం, ఆ పోస్టుమాన్ బెదిరిపోతూంటాడు మరి. ఎవరికో వొచ్చిన మణియార్డర్ని మరెవడో తీసుకోడంలాటి ఘోరాలు జరుగుతూనే ఉన్నాయిట. ఎలా సవర్దుకొస్తున్నాడో ఇన్ని అవాంతరాలని. ఎండ—ఈ ఎండలో అంత వయస్సుతో తన డ్యూటీని సక్రమంగా చేసుకుపోవడం తలకుమించిన పనే. దార్లో హడావిడిలో తనకొచ్చిన ఉత్తరాలని కాస్తా దారిలో ఎక్కడయినా పారేస్తే? ఛ .... ఇంత సర్వీసున్నవాడు అంత అజాగ్రత్తగా ఎందుకుంటాడసలు? లోగడ రెండు మూడు తడవలు, తన మనసు ఆగక ఉత్తరాల కోసం తరచి తరచి అడుగుతే అతను బాధపడి అన్నాడు. 'వొస్తే వే నివ్వనా పంతులుగారూ!' అని. కాని తన ఆదుర్దా కాస్త గమనించివుంటె—? ....

ఇవ్వాళ ఎలాగైనా ఉత్తరం వొచ్చి ఉంటుంది. నిరంజనమైనా రాయాలి—లేదా—రెండు రోజుల క్రితం కాకినాడ వెళ్లిన చిన్నకొడుకు శంకరమైన రాయాలి. తప్పదు. ఏదో ఒక ఉత్తరం తప్పని సరిగా రావాలి. ఇవ్వాళ గనక ఇద్దర్లో ఏ ఒక్కరిమండైనా ఉత్తరం రాకపోతే గట్టిగా నాలుగు చివాట్లు పెట్టి జాబు రాయాలి.

బైట సైకిలు బెల్లు వినిపించడంతో జానకిరామయ్యగారు ఉలిక్కిపడి లేచారు. గబగబా వీధిలోకి వెళ్లిపోయారు. పక్కింట్లో ఉత్తరాలిస్తూన్న పోస్ట్‌మాన్ "మీకు ఒక ఉత్తరం ఒక ఎం. ఓ. ఉన్నాయండి పంతులుగారూ" అన్నాడు నవ్వుతూ.

జానకిరామయ్యగార్కి ఉత్సాహం కలిగింది.

"అమ్మాయ్ సుశీలా! నా పెన్ను ఇలా పట్రా

[illegible] మంచుని.

సుశీల పెన్ను తీసుకొచ్చి యిచ్చింది. ఆసరికి పోస్ట్‌మాన్ తనింటికి రానే వొచ్చాడు.

వొచ్చిన పోస్ట్‌మాన్ వీధి అరుగుమీద తిష్ఠ వేసి, నింపాదిగా ఉత్తరాల కట్ట విప్పాడు. దాన్లోంచి ఒక ఉత్తరం లాగి జానకిరామయ్యగార్కి ఇచ్చాడు. ఆతర్వాత మణియార్డరు ఫారము అందించాడు.

జానకిరామయ్యగారు గబగబా ఉత్తరం చదవడం పూర్తిచేసి, ఆ ఉత్తరాన్ని సుశీల కిస్తూ,

[illegible] చిన్నన్నయ్య రాశాడు. [illegible] ఉద్యోగ ప్రయత్నాలు సాగుతున్నాయట'' అన్నారు.

తర్వాత మణియార్డరు ఫారంమీద సంతకం చేస్తూ,

''అమ్మా పోస్ట్‌మాన్‌కి చిక్కటి మజ్జిగ ఉంటే పట్రా. పాపం ఎండలో పడి తిరగా లాయె'' అన్నారు.

ఏభై రూపాయిలు నిరంజనం పంపాడు. 'తమ్ముడు కాకినాడ వెడుతున్నాడని రాశారు. ఉద్యోగం దొరికిన తరువాత నాకు తెలియజేయండి. మీ ఆరోగ్య విషయం రాయండి. [illegible] వైద్య సౌకర్యాలు చాలా బావుంటాయి. [illegible] మీరిక్కడికి వస్తే మంచిది. ఆలోచించండి' నిరంజనరావు అని రాశాడు.

ఓ రూపాయి పోస్ట్‌మాన్ చేతిలో ఉంచారు జానకిరామయ్య. సుశీల తెచ్చిన మజ్జిగ అతని కిస్తూ,

''పాపం .... యింత ఎండలో తిరగడం కష్టమే మరి.''

''తప్పుతుందాండి. డ్యూటీ అన్న తరువాత



# మనిషి - మిథ్య

డ్యూటీ'' అన్నాడు పోస్ట్‌మాన్ మజ్జిగ తాగుతూ.

మరో రెండు నిముషాలు తన పవిత్రమైన డ్యూటీ గురించి మాటాడి, ఉత్తరాల కట్ట కట్టుకుని ''ఉంటానండి పంతులుగారూ !'' అన్నాడు వీధి అరుగు దిగుతూ.

''మంచిది'' అన్నాడు జానకిరామయ్య.

అప్పటిగ్గాని జానకిరామయ్యగార్కి పోస్ట్‌మాన్ గురించి ఆదుర్దా తగ్గిందికాదు. రేపు యీ సమయానికిగాని పోస్ట్‌మాన్ మళ్లీ గుర్తుకురాడు

పడక కుర్చీలో పడుంవార్చి మళ్లా ఓమాటు యిద్దరు కొడుకులూ రాసిన విషయాలు జాగ్రత్తగా చదివారు. అప్పటికప్పుడే విరంజనానికి ఉత్తరం రాసేరు. డబ్బు ముట్టినట్టూ, వీలు దొరికితే తప్పకుండా గుంటూరు వొచ్చి నాలుగు రోజులపాటు ఉంటావనీను.

కాగా చల్లపడ్డ తర్వాత అలా బజారువైపు వెళ్లాలనిపించింది.

సుశీలను పిలిచారు.

''పెద్దాడు పంపిన పైకాన్ని షావుకారికి జమ కట్టి వొస్తానమ్మా. పాపం .... నోరు తెరుచుకు అడగలేక నానా యిబ్బంది పడుతున్నా డతను. మరి వెళ్లివొచ్చేదా ?'

''వొచ్చేప్పుడు మాత్రం తప్పకుండా పెచ్చాలు పట్రా నాన్నా ! ఇంట్లో నిండుకున్నాయి. ఏమేమి కావాలో రాసిచ్చానుగదా ?''

''అలాగే.''

ఆయన వీధిలోకి వొచ్చారు. ఆలోచిస్తూ నడక ప్రారంభించారు. పయస్సు ముంచుకొస్తుంది. జవసత్వాలు డిగిపోతున్నాయి. ఇంట్లోంచి కదిలి బయటికి రావడ మంటేనే భయం వేస్తోంది. బయటకొచ్చి, కాస్త అలా బజారు మొహం చూడకపోతే బొత్తిగా తోచి చావదాయె ఎంతసేపని ఆయింటి నాలుగ్గోడల మధ్యా కూర్చుని గోళ్లు గిల్లుకోవడం ?

చిన్నతనం జ్ఞాపకానికి వొచ్చింది. గతం ఎప్పుడూ అందంగానే ఉంటుందిట. నిజమేనేమో. లేకపోతే అప్పటి ఆనందం, హాయీ యిప్పుడేవి ? ఎక్కడికి వెళ్లిపోయాయి ?

ఆరోజుల్లో జీవితంపట్ల యిన్ని ప్రశ్నలూ, యిన్ని ఆలోచనలూ ఉండేవి కావు. చదువుకోడం, స్నేహితుల్తో నవ్వుతూ హాయిగా తిరిగేయడం, ఈ రెండే ముఖ్యమైన వ్యాపకాలు.

చిన్నప్పుడు అందరూ తనని 'అగ్గిపిడుగు' అని పిలుస్తుండేవారు. ధైర్యసాహసాల్లో తనకి పెట్టింది పేరు. పయస్సుకు మించిన అంగసౌష్ఠవం, బలం తన సొత్తు. అందర్లోనూ చలాకీగా, కంటికి 'పదురు' గా కనిపించేవారు. దేన్నీ ఖాతరు చేసే వారు కానేకాదు.

ఒకసారి--తన కప్పుడు పదహారేళ్ల వయస్సుంటుందేమో. కుర్రాళ్లందర్తో కలిసి చెడుగుడు ఆడటానికి 'వఱ్ఱ' లోకి వెళ్లారు. కాస్సేపు ఆడుకున్న తరువాత, చింతచెట్టెక్కి చింతకాయలు కోసుకోడం మొదలెట్టారు.

ఆ ప్రాంతాల్లోనే మహా వికృతంగా ఉండే పిచ్చివా డొకడు తిరుగుతూ ఉండేవాడు. వాడిని చూచి పిల్లవాళ్లే కాదు, పెద్దవాళ్లు కూడా వంటరిగా ఉంటే గజగజ లాడేవారు. అప్పుడప్పుడూ ఆ పిచ్చాడు పిల్లల వెంటబడి తరిమేవాడు. దొరికితే కొట్టేవాడు కూడాను.

చింతకాయలు కోసుకుంటూన్న సమయంలో ఆ పిచ్చాడు అటు రావడం జరిగింది. అల్లంత దూరాన వాడిని చూడగానే పిల్లలందరూ బల్లిపిల్లల్లా కొమ్మలకి అంటుకునిపోయి గజగజ వణికిపోతున్నారు. దురదృష్టవశాత్తూ, ఆ పిచ్చాడు తిన్నగా వొచ్చి ఆ చెట్టుక్రిందనే తిష్ఠ వేశాడు. పిల్లలకి పై ప్రాణాలు పైనే ఎగిరిపోయాయి. వాడు చెట్టుక్రింద కూచుని పిచ్చిగా నవ్వుతూ గుడ్డపేలికల్ని యిష్టం వొచ్చినట్టు చించుతూ, మధ్య మధ్య ఏదో వాగేస్తూ, కేకలుపెడుతూ నానా భీభత్సమూ చేసేస్తున్నాడు.

వాడు చేస్తున్న యీ హంగామాతో మరింత భయపడిపోయారు. పిల్లలు. తేలుకుట్టిన దొంగల్లా గప్‌చిప్‌గా కొమ్మల్నే అంటిపెట్టుకుని కూర్చున్నారు.

వాడివాలకం చూస్తుంటే వాడు అంతలో కదిలే సూచనలు కనుపించడంలేదు. పోనీ, చెట్టు దిగి పారిపోదామా అంటే, వాళ్లల్లో ఎవడో ఒకడు ఆ పిచ్చాడి చేతిలో పడక తప్పదు. ఈ స్థితిలో జానకిరామయ్య అనబడే పదహారేళ్ల కుర్రాడు చిన్న ఉపాయం ఆలోచించేడు.

తనొక్కడే గబగబా చెట్టు దిగాడు. పిచ్చాడికి కాస్త అవతలగా నిలబడి, నడుంకి చేతులు ఆనించి వాడివంక గుడ్లురిమి చూశాడు. పిచ్చాడు తనని చూస్తూ పిచ్చిగా నవ్వేడు. తల గోక్కున్నాడు. గుడ్డపేలికలు తలమీద తలంబ్రాలులా వేసుకుని మురిసిపోతున్నాడు.

''ఏయ్ .. . నువ్వక్కడ్నుంచి లే'' అన్నాడు తను.

''.... .... .... ....''

''నీకే .... వెళ్లిపో యిక్కడ్నుంచి.''

ఈ మాటతో పిచ్చాడు లేచి నిలబడ్డాడు. తనవైపు కళ్లెర్రజేసి చూశాడు. చెట్టుపైనున్న పిల్లలకి చెమట పడుతుంది. తర్వాత ఏమవుతుందో అని కన్నార్పకుండా చూస్తున్నారు.

వాళ్లందరూ చెట్టు దిగి యిళ్లకి వెళ్లాలంటే యీ పిచ్చాడు యిక్కడ్నుంచి కదలాలి. వాడు కదలాలంటే తను వాడ్ని కవ్వించాలి.

''నీకేనోయ్ చెప్తూంట .... కదలవే.'' మళ్లా పిచ్చాడిని రెచ్చగొట్టాడు. వాడు కదిలాడు. తన వైపు నడిచాడు. తనూ కదిలాడు. వాడు తనను అనుసరిస్తున్నాడు. కొంతదూరం యిద్దరూ అలా నడిచిన తర్వాత, తన కాలికి బుద్ధి చెప్పాడు.

ఆ పిచ్చాడిని ముప్ఫైమూడు చెరువుల నీళ్లు తాగించిన తర్వాత, తాపీగా తను యింటివైపు దారి తీశాడు. ఇంటిదగ్గర తనకోసం చాలామంది ఎదురు చూస్తూన్నారు. ఎవరో అన్నారు గూడా.

''నువ్వు అగ్గిపిడుగువేరా జానీ !''

ఆ రాత్రి అమ్మ తనకి దిష్టి తీసింది.

జానకిరామయ్యగారు నవ్వుకున్నాడు. ఆ వయస్సుకి అలాటి కార్యం 'సాహసమే' మరి. చాలా మంది భయపడిన ఆ మహాత్కార్యాన్ని తాను సక్రమంగా ముగించారు. అందర్లోనూ అవుననిపించుకున్నారు.

చిన్నప్పట్నుంచీ తాను అలా పెరిగారు. ఇప్పుడు ?

ఈ జీవితమంతా సాహసాలతో మునిగిపోతే ఎంత బావుండునూ తన పిచ్చిగాని యిప్పుడీ జీవితమే ఒకానొక ఎడ్వంచర్. కాకపోతే—సంసార

మనే యీ మహాసాగరాన్ని యీది, తనే ఆధారమైన తన పిల్లల్ని ప్రయోజకుల్ని చెయ్యడం తమాషానా ? కాదుగదా.

చచ్చి స్వర్గాన ఉన్న భార్య—తనని ఒంటరి చేసిన లగాయితూ యీ జీవితం మరింత 'ఇరుకు' గా తయారయ్యింది. అన్ని విషయాల్లోనూ చేదోడు వాదోడుగా ఉండి, జీవితంలో తీపిని ప్రసాదించిన భార్య లేని ఈ సంసారం ఏ లోటూ రానీకుండా, గుట్టుగా ఇంతవరకూ తీసుకురావడం 'ఘనత' కాదూ ?

పిచ్చాడి బారినుండి బయటపడటం చిన్నప్పటి ఎడ్వెంచరైతే, మనిషిగా తన ధర్మాన్ని, విధినీ నిర్వర్తించడం సిసలైన ఎడ్వెంచర్ !

జానకిరామయ్యగారి చెప్పుకి రాయి తగిలింది. తూలి పడబోయి తమాయించుకుని నిలబడ్డారు. అప్పటిగ్గాని తనెక్కడ ఉన్నదీ గుర్తుకురాలేదు. షావుకారి షాపు దాటి వంద గజాలు దూరం వొచ్చేశారు.

నవ్వుకున్నా రాయన. మళ్ళా వెనక్కు నడిచారు.

వయస్సు పెరుగుతున్నకొద్దీ మతిమరుపూ పెరుగుతోంది. బడిపంతులు ఉద్యోగం. బడిపంతులైనవారికి జ్ఞాపకశక్తి ఖచ్చితంగా ఉండి ఉండాలి. అది చలా ముఖ్యమైన అవసరం. లేకపోతే పిల్లల్తో, వాళ్ళ అతి తెలివి ప్రశ్నల్తో సర్దుకుపోడం చాలా కష్టం. అన్నేళ్ళ సర్వీసులోనూ లోనూ ఒక్కనాడు గూడా తాను చెడ్డపేరు తెచ్చుకోలేదు. 'జానకిరామయ్య మాస్టారే మాస్టారు. పాఠాలు చెబితే ఆయనే చెప్పాలి' అని అటు విద్యార్థులూ, ఇటు తోటి మాస్టర్లూ అనేవారు. ఆ రోజుల్లో తన ప్రజ్ఞకి తనే గర్వపడేవారు.

అలాంటి పేరెన్నికగన్న జానకిరామయ్య మాస్టారికి 'మతిమరుపు అనే జాడ్యం వొచ్చేసిందోయ్' అని ఎవరైనా అనుకుంటే ఎవరో ఎందుకు ? యిప్పటి తనను చూస్తుంటే తనకే అనిపిస్తుందలా .... ఛ .... ఎంత అవమానం.

జానకిరామయ్యగారు సిగ్గుపడ్డారు. కాస్త బాధ కూడా అనిపించింది.

ఈ సశేషంలో యింకా ఎన్ని బలహీనతలు, ఎన్ని జాడ్యాలూ అనుభవించాలో గదా ? జీవితపర్యంతం ఏలోస్టూ లేకుండా హాయిగా బ్రతికేందుకు అవసరమైన శక్తీ, ఆరోగ్యమూ దేవుడు ప్రసాదించకూడదూ ?

తన వెనకాల వొచ్చే కారు, హారను మోగించింది. ఉలిక్కిపడి పక్కకి తప్పుకున్నారు. కారులో కూర్చున్న ఆసామి తనవైపు హేళనగా చూశాడు. తన అజాగ్రత్తకి నొచ్చుకున్నా రాయన.

తను వెళ్ళవలసిన షావుకారు కొట్టుకి మళ్ళా ఓ పది అడుగులు (అటువైపు) దూరంగా నిలబడి ఉన్నట్లు గ్రహించి—ఈమాటు కాస్త బిగ్గరగా నవ్వుకున్నా రాయన. ఇంకా ఏమీ ఆలోచించకుండానే గబగబా కొట్లోకి వెళ్ళి షావుకారిని పలుకరించేశారు. షావుకారు కొట్టు కుర్రాడిచేత, మాస్టారు కూర్చునేందుకు స్టూలు వేయించాడు.

మాస్టారు జేబులోంచి డబ్బు తీసి యిస్తూ,

"ప్రస్తుతాని కిది జమ వేసుకోండి. మిగతాది మళ్ళా ఓ వారం పది రోజుల్లో సర్దుతాను. సరేనా ?"

"బలేవారండీ ! మీదగ్గర డబ్బెక్కడ పోతుందండీ—అలాగే కానివ్వండి."

"ఇప్పుడు ఎంత తమాషా జరిగిందో చూశారా ? ఇంటిదగ్గర్నుంచి తిన్నగా మీ షాపుకి బయలుదేరానా ? ఏదో ఆలోచిస్తూ షాపు దాటి వెళ్ళిపోయాను. అక్కడ తెప్పరిల్లి మళ్ళీ మీ షాపుకి బయలుదేరి మళ్ళీ పప్పులో కాలు వేశాను" అన్నారు నిండుగా నవ్వుతో.

షావుకారూ నవ్వేడు.

"పెద్దవాళ్ళయి పోతున్నారు గదండీ మరి."

"ఇప్పుడు సన్నెవడైనా జాగ్రత్తగా గమనించి ఉంటే పాపం .... యీ పెద్దమనిషికి మొన్నిమధ్యనే మతి చెదిరిపోయింది కావాల్నంటూ చింతించేవాడేను. ఏమంటారు ?"

"అలా అని ఎవరనుకుంటార్లెండి ?"

"అహ .... మాటవరసకి చెప్తున్నాను. లేకపోతే మీ కొట్టుముందు తచ్చాడట మేమిటి చెప్పండి."

షావుకారు మొహమాటంగా నవ్వేడు.

కాసేపు ఏవో విషయాలు మాట్లాడుకున్నారిద్దరూ. రాను రాను షాపులో రద్దీ ఎక్కువవడం గమనించి, వొస్తానంటూ లేచి నిలబడ్డారు జానకిరామయ్యగారు. అప్పటిగ్గాని షావుకారి మొహంలో ఆనందం మెరిసింది కాదు.

జానకిరామయ్యగారు మెట్లు దిగుతూ "నా మాటల్తో అతని బేరం ఏమైనా పాడయ్యిందో ఏమో. మరి కాదూ — వ్యాపారమా ! బాతాఖానీ క్లబ్బా ?" అని నొచ్చుకున్నారు.

ఈమధ్య కనిపించే ప్రతివాళ్ళతోనూ అధికంగా మాటాడేయటం ఒకటి అలవాటయ్యింది. ఇది కొత్త అలంకారం కాబోలు.

రోడ్డుమీది కొచ్చిన తరువాత కోటయ్య పంతులు గుర్తు కొచ్చేడు. అతన్ని కలుసుకుని నాలుగు రోజు లవుతుంది. ఈరోజైనా వెళ్ళి పలుకరించి వస్తే బావుంటుం దనుకుని పంతులింటివైపు నడకని మళ్ళించారు.

పంతులింటి కొచ్చేసరికి, ఆ యింట్లోనుండి చిన్నసైజు గలాటా బయటకు వినిపిస్తోంది. వీధిలోనే నిలబడిపోయారు జానకిరామయ్య.

"అవున్నాన్నా ! అది అన్నదాంట్లో తప్పేముంది ?" ఇది కోటయ్య పంతులి కొడుకు గొంతు.

"ఏమిట్రా నీ ఉద్దేశ్యం ?"

"కాఫీ తాగాలనిపించినప్పుడు, కాఫీ కావాలని అడగటానికి నీకు అభిమానమైతే, నువ్వడగనిదే కాఫీ యివ్వడానికి దానికి మాత్రం అభిమానం కాదూ ?"

"దీన్లో అడిగే దేముందిరా .... పొయ్యంత్రం ఫలావా వేళకి కాఫీ కావాల్సి వొస్తుందని ఆపిల్లకి తెలీదా ?" పంతులు అన్నారు.

"ఇది మరీ బాగుంది. టైం ప్రకారం అన్నీ అమర్చిపెట్టేందుకు యీ ఇంట్లో పనిమనుష్యులెవ్వరూ లేరు. ఈ ఇంటెడి చాకిరీ నా ఒక్కదాని నెత్తిమీద వేసుకుని సతమత మైపోతున్నాను బాబూ" అన్నది పంతులి కోడలు.

"చాల్లే, నోరుమూసుకుని అవతలికెళ్ళు. అంతా నీవల్లే జరుగుతుం దసలు." కొడుకు కసురుకున్నాడు.

"అవును తప్పంతా నాదే. పాపిష్టిదాన్ని."

47 వ పేజీ చూడండి



"అల్లుళ్ళు మీరిద్దరూ వచ్చాక హాయనిపించింద్రా నా ప్రాణానికి...!!"



# వక్రగతులు

డి.వి.రావు

(గత సంచిక తరువాయి)

"అనేక తెగలుగా కనిపించారు విద్యార్థులు నా కంటికి. కేవలం తమ పెద్దల ఆనందం కోసమే చదివేవారూ. నా పూర్వపు ఛాయలను కలిగి కాలేజీ జీవితంలోని 'మజా' అనుభవిస్తున్నామని భ్రమించే వారూ. లెక్చరర్లు చెప్పేవి సరిగా తలకెక్కక భవిష్యత్తేమవుతుందోనన్న గాభరాతో ఘడియ ఘడియకు తెలియనివి చెప్పించుకోడానికి లెక్చరర్ల వద్దకు, తెలివైన వారనిపించుకొనే విద్యార్థుల వద్దకు పరుగులెత్తి నానా హైరాన పడేవారూ. నేను ఫలానా పబ్లికేషన్లలో ముప్ఫై వ్యాసాలు కంఠపాఠం చేశానండీ, మరొక దానిలో అయిదు వందల ప్రాబ్లెమ్స్ సాల్వ్ చేశాను. క్లాసు వస్తుందంటారా" అని సీనియర్ విద్యార్థులను అడిగేవారూ— ఇలా ఎన్నోరకాలుగా ఉండేవారు.

"వీరందరికంటె విచిత్రమైన తెగకు చెందిన మరి కొందరుండేవారు. వారు 'అతి తెలివిమంతులు' లెక్చరర్ల మేధాశక్తిని మెరిపెట్టడం వారి ధ్యేయం. పుస్తకాలలో ఏ మూలల నుండో వెదికి తీసి 'మాష్టరూ! వారం రోజుల నుండి కుస్తీ పడుతున్నా ఈ లెక్క తెగడంలేదండీ. పరీక్షలో వస్తుందేమోనని భయంగా ఉంది. కాస్త చేసి పెడితే ధైర్యం వస్తుంది' అంటూ ఏవో లెక్కలు ఇచ్చేవారు అంతే! ఆ రోజు పీరియడ్‌లో జరిగేది సున్న. పాపం. లెక్చరర్లు పీరియడ్ అంతా దాన్ని సాధించడానికి తంటాలు పడేవారు. తెలివైన వారైతే ప్రారంభించకుండానే తరువాత తమ గదికి రమ్మనో, ఆలోచించి మరుసటి పీరియడ్‌లో చెబుతామనో తప్పించుకొనేవారు అయితే ఎవరెవరైతే ఆ లెక్కలు ఇచ్చేవారో వారే పీరియడ్ ముగిసే సమయంలో లేక తరువాత పీరియడ్‌లోనో 'చూడండి, ఈ విధంగా చేస్తే ఆన్సరు వస్తోందిగాని, పద్ధతి సరియైనదో కాదో అని అనుమానం' అంటూ తమ నోట్‌బుక్ చూపేవారు. వాళ్లను ప్రశంసించక తప్పేది కాదు లెక్చరర్లకు.

"ఆ విధంగా లెక్చరర్లు తెలివి తేటలతో చెలగాటా లాడడం ద్వారా వారికి ఒరిగినదేమిటో తెలియదు. కాలం వృథా అయేది. లెక్చరర్లయిన పాపానికి అన్ని పుస్తకాలలోను ఇచ్చే వేలాది సమస్యలను సాధించి ఎవరైనా అడుగుతారని ముక్కున పెట్టుకొని ఉండడం ఏ లెక్చరరుకు సాధ్యంకాని పని. క్రింది తరగతి అవడం వలన క్రొత్తగా ఉద్యోగంలో ప్రవేశించిన వారిని మన క్లాసుకు వేసేవారేమో, ఇటువంటి బాణాల తాకిడికి తట్టుకోలేక పోయేవారు. పాపం వారిని చూస్తే జాలి కలిగేది.

"తీరా ఫలితాలు తెలిసిన తరువాత క్లాసులో తమ అతి తెలివిని ప్రదర్శించిన ప్రబుద్ధులంతా 'రేంక్'లతో వెలిగిపోతారేమో అనుకుంటే, ఎటు చెదరిపోయారో ఎక్కడా కనిపించలేదు. కొందరివి నంబర్లు కూడ కనిపించకుండా పోయాయి. అటువంటి వారిని చూచి నవ్వుకోవలసి వచ్చింది."

కొంచెం ఆగాడు రాంబాబు. అప్పటి క్లాసులు నాకళ్లముందు ప్రత్యక్షమయ్యాయి. రాంబాబు వర్ణించి చెప్పిన దృశ్యాలను తిలకించిన ప్రేక్షకులలో నేనూ ఒకడిని. కొందరు విద్యార్థుల తత్వాలను చూచి నేనూ చికాకు పడేవాడిని.

"తన ఉనికి కూడా తెలియకుండా క్లాసుకు వస్తూ పోయే విద్యార్థి ఒకడు కాలేజీ అంతకు ప్రథముడిగా ఉత్తీర్ణుడయ్యాడు. అతనే మీరు."

ఉక్కిరి బిక్కిరయ్యాను.

"అదేముంది! మిగిలిన వారంతా పరీక్షలు సరిగా రాయక ఆ స్థానాన్ని నాకు అంటగట్టారు. దానిలో ప్రత్యేకించి నా గొప్పతనం లేదు." అన్నాను నేను ఏమనాలో తెలియక.

"నేనూ సరిగా ఆ సమాధానాన్నే వూహించాను. మీ దగ్గరనుండి. ఆ విధంగా ఆకర్షించారు నన్ను మీరు. అప్పటి నుండి మీ పురోగతిని గమనిస్తూ వచ్చాను. చకచక భవిష్యత్తులోకి నడిచారు నేను వూహించినది. కాంక్షించినది అదే. ఈ 'ప్రాజెక్టు'కు అధికారిగా నియమింప బడినట్టు ముందుగానే తెలిసింది. ఆత్మీయుణ్ని యుగాల తరువాత కలుసు కుంటున్న అనుభూతి కలిగింది. అందుకనే మీరు నన్ను గుర్తుపట్టలేక పోయారని తెలిసేసరికి కోపం పట్టలేక పోయాను. నానా మాటలు అని నా క్రోధాన్ని వెళ్ళగక్కాను. ఆ మాటలు తలచుకొంటే ఇప్పుడు నవ్వు వస్తోంది."

ఆనకట్ట నిర్మాణానికి బాగా అనువుగా ఉన్న స్థలం సమీపాని కొచ్చింది. మేము నడుస్తున్న దిక్కుకు కుడివైపు రాంబాబు కుటీరం ఉన్న గుట్ట ఉంది. ఎడమ దిక్కుగా దానికి రెండు ఫర్లాంగుల దూరంలో చిన్న పర్వతశ్రేణి దూరాన ఉన్న కొండలలో కలుస్తోంది. నేను అటు చూడడం గమనించి రాంబాబు అన్నాడు.

"మీ ఆనకట్ట కట్టడానికి ఇది శ్రేష్టమైన స్థలం. భూమాత ఇక్కడ తనకు తాను నిర్మించు కున్న రూపాన్ని సహాయంగా తీసుకొని దూరాన ఉన్న ఆ పర్వతశ్రేణిని ఈ గుట్టను కలుపుతూ ఆనకట్ట కట్టారంటే దానికి వెనుకవైపు పళ్లెం లాగ చుట్టూరా గట్టుతో ఒక లోయలా ఏర్పడుతుంది. వర్షఋతువులో వృథాగా ప్రవహించే నీటిని అందులో నిలవచేసి అవసర సమయంలో వ్యవసాయానికి వాడవచ్చు"

అతని సాంకేతిక పరిజ్ఞానానికి విస్తుపోయాను.

అంతలో దూరంనుండి 'వాన్నారు, వాన్నారు' అని అరుస్తూ అప్పుడే విచ్చిన పువ్వుల్లా ముస్తాబయి ఇంచుమించు ఏడు సంవత్సరాల అబ్బాయి, అయిదేళ్ల అమ్మాయి పరుగెత్తివచ్చి రాంబాబును చుట్టేశారు. ఇద్దరికీ చెరికాక చేయిని అందిస్తూ.

"పిల్లిద్దరూ మా కుటీరానికి మణిదీపాలు, వాసు, రేఖ." అన్నాడు రాంబాబు.

"ఎవరు వాన్నారరా?" అనడిగారు చిలుక పలుకుతో ఇద్దరూ.

"మామయ్య. మన ఇంటిముందు పెద్ద చెరువును తయారు చేస్తారు ఆయన. రోజా

మనం పడవలలో షికారు పోవచ్చు" రాంబాబు సమాధానం చెప్పాడు.

"నమస్తే మామయ్యగారూ" అన్నారు పిల్ల లిద్దరూ చిన్నారి చేతులను జోడిస్తూ. ఇద్దరి భుజాలను అరచేతితో నిమురుతూ అన్నాను.

"బడికి వెళ్ళి బాగా చదువుకుంటున్నారా ?"

ఒకేసారి ఇద్దరూ అన్నారు,

"బడిలేదుగా ! అమ్మే మాష్టారు. నాన్నారు పెద్ద మాష్టారు."

రాంబాబులో అనంతమైన పరిణామం కలిగిం దని గ్రహించాను.

"మామయ్యగారూ. ఇక్కడ నీళ్ళు లేవుగా పెద్ద చెరువులో కట్టేస్తే అందులోకి నీళ్ళెల్లా వస్తాయి ?" వాసు అడిగాడు.

రాంబాబే సమాధానం చెప్పాడు.

"నాన్నాలూ, ఆ చెలువులో నేను కాగితపు పడవలు వేసి ఆడుకుంటాను" అంది రేఖ కళ్ళను తిప్పుతూ.

"షికారుకు పడవలెలా వస్తాయి ?" వాసు ప్రశ్న.

"కట్టిస్తాను." రాంబాబు.

"ఇక్కడ, ఏవీ లేవుగా. ఎలా కడతారు ?"

"అన్నీ వస్తాయి. ఇక్కడ మంచి వూరు తయారవుతుంది."

"నేను ఈదడం నేర్చుకుంటాను నాన్నారూ"

"అలాగే."

"ఆ చెలువులో మొసళ్ళుంటాయా నాన్నాలూ?" విప్పారిన నేత్రాలతో మొఖం పైకెత్తి అడిగింది రేఖ.

"ఉండవు."

"ఏంపాపా భయమానికు మొసళ్ళంటే ?" నేనడిగాను.

"కాదండీ. మరేమో మొసలి చాల చెడ్డ జంతువు. కోతిని మోసం చేసింది మొసలి—కోతి కథలో."

"నువ్వెప్పుడైనా మొసలిని చూశావా పాపా ?"

"లేదండీ. నేను ఇంకొంచెం పెద్ద దాన్నయిన తరవాత నాన్నాలు జూకి తీసుకెళ్ళి చూపిస్తారట"

"మరి కోతిని చూశావా ?"

"ఓ, బోలెడు సార్లు. మా ఇంటికి అప్పు డప్పుడు వస్తుంటాయి."

కొంచెం ఆగి మళ్ళీ అంది రేఖ.

మామయ్యగారూ, మరేమో అమ్మ అంటుంది గదా, మనిషీ కోతీ ఒకటేనట. తప్పుకదండీ. మనిషికి తోకలేదుగా ?"

నవ్వుతూ బుగ్గలు నిమిరి "పెద్ద దాని వయ్యాక తెలుసుకుందువుగానిలే" అన్నాను.

విసుగు తెచ్చుకోకుండ పసిపిల్లల ప్రశ్నలకు ఓపికతో సరియైన సమాధానాలు చెప్పడాన్ని మించిన సుశిక్షణలేదు. అయితే అలా చెప్పకలిగే తల్లిదండ్రులే అరుదు. బిడ్డలు తల్లిదండ్రుల సంస్కృతికి ప్రతిబింబాలు. వాసు, రేఖలు అటువంటి అరుదైన తల్లిదండ్రుల బిడ్డలే ననిపించారు. రాంబాబు గత చరిత్ర తెలుసుకోవా లన్న ఉత్కంఠ మరింత అధికమయింది.

అప్పటికి రాంబాబు కుటీరానికి చేరుకున్నాం. అక్కడక్కడ గులకరాళ్ళు పైబడి పచ్చటి గడ్డితో నిండిన చిన్న గుట్టల అద్మి పైనుండి దగ్గరలో మాలపలి తాలూకు గుడిసెలు కనిపిస్తు న్నాయి.

సుమారు పావు ఎకరం స్థలంలో చూడ ముచ్చటగా నిర్మింపబడింది రాంబాబు కుటీరం. చుట్టూ వెదురు బద్దలతో కట్టబడిన కంచె. వెనువెంటనే రెండు అడుగుల వెడల్పు పన్నటి రెమ్మలతో దట్టంగా పెరిగిన ఏవో మొక్కలు పచ్చటి ప్రహరీ గోడను కల్పించాయి. పెన వేసు కున్న లతలతో ద్వారం ఆకారంలో నిర్మింపబడిన మల్లె పందిరి ఆహ్వానిస్తూ మా ముందు నిలచింది. పరిసరాల వర్ణంలో కలసిపోతూ ఆకుపచ్చరంగు వేయబడిన వెదురు బొంగుల గేటును తీసుకొని వాసూ, రేఖా లోనికి పరుగెత్తారు. గేటువద్ద నుండి సుమారు నలభై అడుగుల దూరంలో పూర్వపు గురుకుల వాసాలను జ్ఞప్తికి తెస్తూ రెల్లుగడ్డి కప్పుతోనున్న కుటీరం కానవచ్చింది. అక్కడకు చేరుకొనే బాటకిరుప్రక్కలా అరటి చెట్లు పహరా సిపాయీలలా నిలాలచాయి. మిగి లిన స్థలం చదరంగం గడులలా విభజింపబడి గులాబీలు, మందారాలతో నిండి ఉంది.

"సరోజా, అతిథులొచ్చారు." అని కేక పెట్టాడు రాంబాబు ఇంట్లో ప్రవేశించినదే తడ వుగా.

బయటకు పర్ణశాలలా కనిపించినా లోన నేలంతా రంగుల సిమెంటుతో నున్నగా గచ్చుచేయ బడి ఉంది. పై దూలాలు కనిపించకుండా చెక్క లతో సీలింగు. గోడలకు ప్రకృతి వర్ణ చిత్రాలు తగిలించి ఉన్నాయి. లావుపాటి జొన్న కంకులు నవారు పట్టెలతో కూర్చోడానికి వీలుగా కుర్చీ లలా కట్టబడి ఉన్నాయి. రాంబాబు మాటలు మొదలుపెట్టాడు.

"ఈ ప్రదేశం నన్ను ఆకర్షించడానికి ముఖ్య కారణం ఇక్కడొక బావి కనిపించడం ఈ ఎత్తయిన ప్రదేశంలో, రాళ్ళలో ఈ బావి ఎప్పుడు ఎవరి చేత త్రవ్వబడిందో తెలియుదు. అంతకు మిం చిన అద్భుతం అందులో జలపడడం. ఏదో అంతర్ ప్రవాహం సరిగా ఈ స్థలంగుండా పోతూండి ఉండాలి. ఇంటి నిర్మాణానికమువుగా ఈ ప్రదేశం కూడ చదునుగానే ఉండడంవల్ల ఇక్కడకు చేరాను. ఇక్కడ మాకొచ్చిన లోటొకటే. అది ఎలక్ట్రిసిటీ. నావేషం చూసి విజ్ఞానం ప్రసా దించే సౌకర్యాలంటే గౌరవం లేదనుకోబోకండి. ఈ గ్రామానికి విద్యుచ్ఛక్తి వచ్చినా నేను వూరికి కొద్దిగా దూరంగా ఉన్నానని ఈ ఇంటికి వేయడం నిరాకరింప బడింది. మీరు ఇక్కడ 'డాన్' కట్ట డంతో ఆ లోటుకూడా తీరుతుందని ఆశగా ఉంది."

కొంగుతో భుజాలను నిండుగా కప్పుకొని నుదుట పెద్ద కుంకుమబొట్టుతో పాతికేళ్ళ పైబడ్డ స్త్రీ 'ట్రే'ను రెండు చేతులతోను పట్టు కొని మేమున్నగదిలో ప్రవేశించింది. చీర కుచ్చె ళ్ళను వెనొకవైపు పట్టుకొని వాసు, రేఖ వెంట వచ్చారు.

"మా శ్రీమతి, సరోజ" పరిచయం చేశాడు రాంబాబు.

ట్రేను కుర్చీల మధ్యగా ఉన్న బల్లపై ఉంచి నమస్కారం చేసింది. ఆవిడ. ప్రతి నమస్కారం చేసాను. మూడు పెద్ద గ్లాసులూ, రెండు చిన్న గ్లాసులూ నారింజ రసంతో నింపబడి ఉన్నాయి ట్రేలో.

"సరోజా, ఈయనెవరో తెలుసా ? నాలాగే

30 వ పేజీ చూడండి



# వక్రగతులు

27 వ పేజీ తరువాయి

జీవితం తీసుకొని దేశసేవ చేసే వ్యక్తులలో ఒకరు. నేను భావి భారత పౌరులను తయారు చేస్తుంటే, ఆయన బీడునేలల్ని సస్యశ్యామలం చేసి దేశాన్ని సుభిక్షం చేసే పథకాల నిర్మాణానికి అధిపత్యం వహిస్తున్నారు.

పూర్వపు అతిశయోక్తులు ఇంకా అలాగే ఉన్నాయి. అందరూ గ్లాసుల్లోని రసం త్రాగాం. చిన్న గ్లాసులు నాను, రేఖలు తీసుకున్నారు. ఒక కుర్చీలో సరోజ ఒదిగి కూర్చుంది. రాంబాబే ఏవో మాటలు కానిచ్చాడు. కొంతసేపు ముచ్చటల అనంతరం బయటపడ్డాం.

రాంబాబు కుటీరం ఉన్న గుట్టకు అవలవైపు అంతా ఎగుడుదిగుడు నేల. గ్రామంలోని పాలెవాళ్ళు పశువులను తోలుకొచ్చి పచ్చికతో నిండిన ఆ స్థలంలో మేపుతుంటారు. అటు నడుస్తుండగా గ్రామానికి తిరిగి పోతూన్న పశువుల మంద ఎదురైంది మాకు.

"దండాలండి బాబయ్యా." అన్నాడు రాంబాబును చూచి పశుల కాపర్లు.

"చదువుకోతగిన వయసులో ఉన్న కుర్రాళ్ళనందరను, స్వయంగా వెళ్ళి, నచ్చచెప్పి, స్కూలులో చేర్పించానని మాలపల్లిలో వాళ్ళందరుకు నేనంటే చాల అభిమానం మా కుటీరానికి దగ్గరగా తోడుగా ఉన్నది ఈ పల్లె జనులే. వూరికి దూరంగా, అనేక సదుపాయాలు సరిగా లేక ఒంటరిగా ఉన్న మాకు చీకూ చింతా లేక గడిచి పోతోందంటే వాళ్ళ సహాయమే కారణం" అన్నాడు రాంబాబు వాళ్ళు దూరం కాగానే.

సూర్యుడు పూర్తిగా క్రిందికి దిగిపోయి పశ్చిమాన ఆకాశం అరుణవర్ణం దాల్చింది. దూరాన కొండలలో ప్రారంభమైన యేటి చారలు మెలికలు తిరిగిన కొండ చిలువలా కనిపిస్తున్నాయి. సుమారు అరమైలు నడచి పచ్చికలో కూలబడ్డాం. రాంబాబు తన పూర్వ గాథను ప్రారంభించాడు.

తల్లిదండ్రులకు లేకలేక కలిగిన ఏకైక సంతానం రాంబాబు. తత్కారణంగా బాల్యం నుండి లోటనేది ఎరుగక అతిగారాబంగా పెరిగాడు. తండ్రి కొన్నాళ్ళపాటు మునిసిపల్ హాస్పిటల్‌లో పనిచేసి తరువాత స్వంత ప్రాక్టీసు పెట్టిన ఎల్. ఎమ్. పి. డాక్టరు. జమీందారు ఫాయిదాలో నడువగలిగే పాటి సంపాదన లేకపోయినా నలుగురిలో ఉన్నవారిలా కనబడడానికి తగిన రాబడి ఉండేది. తల్లి దండ్రుల గారాబు పెంపులో ఆదినుండివిద్యయొక్క ధ్యేయం ఏమిటో ఎరుగలేకపోయాడు. రాంబాబు. హైస్కూలు విద్యాభ్యాసం గడచి కాలేజీలో చేరడం ఏదో పండగ చేసుకోవడం అయింది. రాంబాబుకు. యవనారంభంలో అదే స్థితిలో నున్న ఆడపిల్లలను చూసినపుడు మనసులో కలిగే అవ్యక్తానుభూతులు. అతన్ని విద్యార్థినులవైపు ఆకర్షింప చేశాయి. అయితే ఆ అనుభూతుల అర్థాలు తెలుసుకోలేని పరిణతి చెందని వయసదే. స్వంత ఇంట్లో పొదరి ప్రేమ అంటే ఏమిటో ఎరుగని హృదయం,

రంగురంగుల చీరల రెపరెపలతో తమకు దూరం దూరంగా, గుంపులుగుంపులుగా నడయాడే విద్యార్థినులను చూస్తే వింతగా కనిపించి ఏవైనా చిలిపి పనులు చేసి వాళ్ళను కవ్వించాలనిపించేది. తనకు మద్దతు నిచ్చే విద్యార్థులు ఇంకా కొందరు కలియగా వాళ్ళకు నాయకుడే అయ్యాడు.

ఇంటరు చివరలో జరిగిన సంఘటన రాంబాబు గిరగిరా తిప్పి ఓ క్రొత్తబాట కెదురుగా ఆపింది. ఆ బాటను పడగానే జీవితం మరో రంగు దాల్చింది. తన జీవితానికి ధ్యేయం ఏమిటో ఎప్పుడు ఆలోచన జరుగనందున చేతికి అందుబాటులో నున్న బి. ఎ.లో చేరాడు, ఇంటరు కాగానే. బి. ఎ.లో కూడ జీవితం ఓ మార్గాన పడి నడవడం తప్ప ఆ ధ్యేయం ఏమిటో అస్పష్టంగానే ఉండిపోయింది. ఓ అమ్మాయి తన జీవితంలో ప్రవేశించి తను బి. ఎ. పాసయినప్పుడు 'ఐ. ఎ. ఎస్.' అని చెప్పేవరకు.

ఇంటరు చివరిలో అలవడ్డ జీవితంపట్ల పరిశీలనా దృష్టి, విమర్శనా దృష్టి అలానే నిలచిపోయాయి అతనిలో. బి. ఎ.లో తన పాఠ్య గ్రంథాలే కాక ప్రఖ్యాత రచయితల రచనలు ఎన్నిటినో చదివాడు. అనేక జీవిత సత్యాలు తెలిసి జీవితంపట్ల విశాల దృక్పథం ఏర్పడింది. అంతే కాక ఒకప్పుడు అందరను ఆకర్షించాలనే ప్రయత్నంతో ప్రారంభించిన 'టెన్నిస్' ఆటను కూడ బాగా అభివృద్ధి పరచుకొని ప్రావీణ్యం సంపాదించాడు. బి. ఎ. మొదటి సంవత్సరం కాగానే తనతో సమంగా టెన్నిస్ ఆడగలిగే వాళ్ళు కాలేజీలో ఎవరూ లేకపోవడంవల్ల ఆ పట్టణంలో అందెవేసిన ఆటగాళ్ళు ఆడే టౌన్‌హాల్ టెన్నిస్ క్లబ్బులో చేరాడు.

టౌన్‌హాల్ క్లబ్బులో చేరిన కొన్నిమాసాలు అనంతరం ఓ సాయంత్రం టెన్నిస్ సెక్రటరీ రాంబాబును పిలిచి ఆ అమ్మాయిని తనకు, తనను ఆ అమ్మాయికి పరిచయం చేశాడు.

"ఈమె మిస్ ఇందిర. రిటైర్డ్ హైకోర్టు జడ్జీగారి అమ్మాయి. ఈ మధ్యనే మనవూరు వచ్చి స్థిరపడ్డారు."

ప్రాణం, రక్తం పోసుకొన్న దంతపు శిల్పం తన ఎదుట సాక్షాత్కరించి నట్లైంది రాంబాబుకు. పరిమళాలు వెదజల్లుతూ విరబూసిన పుష్పోద్యానంలో ప్రవేశించిన అనుభూతి కలిగింది. వీణ మీటినట్లు 'నమస్తే' అన్న శబ్దంరాగా తను ప్రతి నమస్కారం చేసాడు.

ఇందిరకు అప్పటికే టెన్నిస్‌లో కొంత ప్రవేశం ఉంది. ఆ వూరు రాగానే తండ్రి ప్రోద్బలంతో దానిని అభివృద్ధి చేసుకోడానికి టౌన్‌హాలు క్లబ్బులో చేరింది. మెళకువలన్నీ బాగా తెలిసిన జూనియర్ మెంబరవడం వలన అవసరమైన అభ్యాసం లభిస్తుందని ఇందిరకు తగు శిక్షణనీయవలసిందిగా రాంబాబును కోరాడు టెన్నిస్ సెక్రటరీ.

ఇందిర సాన్నిధ్యంలో రాంబాబు మనసు దూది పింజలా తేలికై ఎటో విహరించేది. ఈ ముగ్ధమోహన సుకుమారికి టెన్నిసేమిటి అనుకొనేవాడు. ముఖ్యంగా మొదటి రోజుల్లో ఇందిర 'సర్వీస్' చేస్తున్నపుడు, ఒక చేతితో బంతిని పైకి విసరి రెండవ చేతితో బలాన్నంతా కూడ గట్టుకొని దానిని కొట్టే భంగిమ ప్రసాదించే పరవశత్వాన్నుండి కోలుకొనేటప్పటికి ఆ బంతి తనకు దగ్గరగా ఎక్కడో పడేది.

"హల్లో మిస్టర్ రావ్. ఇలా అయితే నాకు టెన్నిస్ వచ్చినట్టే. మరొకర్నెవర్నయినా చూడమంటాను సెక్రటరీని" అని ఫిర్యాదు చేసేది ఇందిర.

కాని కొద్ది రోజులకే ఇందిర సరిగా ఆడలేకపోయినా సరే తన ప్రావీణ్యంతో ప్రతి బంతిని త్రిప్పికొట్టి ఆటలో ఆసక్తిని పోషించేవాడు రాంబాబు.

"అయామ్ సారీ. మీకు చాల విసుగెత్తిస్తున్నట్టున్నాను. నాతో ఎక్కువసేపు ఆడవద్దు. బాగా ఆడేవాళ్లతో మీరు కొంతసేపు ఆడుకోండి." అనేది ఇందిర.

"మరేం ఫరవాలేదులెండి. నేనేమీ వింబుల్డన్ ఛాంపియన్ నవడంలేదు" అనేవాడు రాంబాబు.

టెన్నిస్ నేర్పడం ప్రారంభించిన కొన్ని రోజుల తరువాత రాంబాబు అడిగాడు ఇందిరను.

"మిమ్మల్ని కాలేజీలో ఎక్కడా చూడడం లేదు. వచ్చే సంవత్సరం చేరుతారా ?

ఒకాయన ఇంకొకర్ని అడిగాడు 'రోజుకు ఎన్నిసార్లు గడ్డం గీస్తావ్?

'ఓ నలభైసార్లు'

'నీ కేమన్నా పిచ్చెక్కిందా ఏం'? అవతలి వ్యక్తి అదిరిపోయాడు.

'లేదండీ! నావృత్తి అది' ఇవతల వ్యక్తి తాపీగా ఇచ్చిన సమాధానం.

మంగయ్య (మార్కాపురం)

"లేదండీ, ఒక సంవత్సరం క్రితం వరకు కాన్వెంటులో చదివి మెట్రిక్ పాసయాను. తరువాత నాన్నగారే ఆపించేసారు. ఆడపిల్లలకు, ముఖ్యంగా ఉద్యోగాలకు పోనివాళ్ళకు ఇప్పటి కాలేజీ చదువులు ఏవిధంగానూ ఉపయోగపడవని నాన్నగారి అభిప్రాయం. కొద్ది రోజులలో ఆయన ఎలాగూ రిటైరైపోతున్నారు కాబట్టి నా విద్యాభ్యాసం బాధ్యత ఆయనే నెత్తినేసుకుంటానని చెప్పి నన్ను కాలేజీలో చేరనీయలేదు. రిటైరైన పిదప నాకు చదువు చెప్పడం ద్వారా ఆయనకు కాలక్షేపం జరుగుతోంది. మనసుకు హాయి గొలిపే విద్య నాకు లభిస్తోంది. నాన్నగారి విద్యావిధానం అద్భుతం. ఒక్కొక్క పాఠ్యభాగాన్ని పరిచయం చేసి కొన్నాళ్ళు నన్ను పరిశీలిస్తారు. ఆసక్తి చూపుతున్నట్టు అనిపిస్తే ఆ విషయం లోతులన్నీ క్షుణ్ణంగా గ్రహించేటట్టు చేస్తారు. లేకపోతే పూర్తిగా వదిలివేస్తారు. ఈ ఆదివారం మీరు మా ఇంటికి ఎందుకు రాకూడదూ, నాన్నగారిని పరిచయం చేస్తాను."

ఆ ఆదివారం రాంబాబు ఇందిర ఇంటికి వెళ్ళాడు. ఉత్సాహంతో పరిచయం చేసింది ఇందిర రాంబాబును తన తండ్రికి. కాని మాటలలో ఆయనకు తనంటే ఏదో ముభావము గోచరించింది రాంబాబుకు. ఇందిరకు ఆయన ఇస్తున్న శిక్షణ గురించి తప్ప మరేమీ మాటాడలేకపోయాడు. తరువాత ఇందిర ఇంటికి వెళ్ళాలన్న కోరిక కలుగలేదు.

ఇందిర రాంబాబు హృదయానికి క్రొత్త సంచలనాన్ని తీసుకొచ్చింది. యౌవనారంభంలో అమ్మాయిలను చూచినపుడు కలిగిన అవ్యక్తానుభూతుల అర్థాలు ఇప్పుడు స్పష్టరూపం దాల్చాయి. రోజులు దొర్లుతుండగా నిత్యము చలాకీగా మసలుతూ మెరుపుతీగెలా దర్శనమిచ్చే ఇందిర హృదయమంతా ఆవరించింది.

బి. ఎ. పరీక్షా ఫలితాలు తెలిసిన రోజున తన ఆనందాన్ని ముందు ఎవరితో పంచుకోవాలో తెలియలేదు రాంబాబుకు. వెంటనే ఇందిర ఇంటికి పరుగెత్తాడు. యూనివర్సిటీ అంతకు, ఇంగ్లీషు భాషలో రెండవ తరగతి లభించే చాలకొద్ది మందిలో తనొకడయ్యాడు.

రాంబాబును చూడగానే హృదయపూర్వకాభినందనలు తెలిపి "తరువాత ఏం చేస్తారు ?" అని ప్రశ్నించింది; ఇందిర. నిజానికి ఆ ఆలోచనే అంతవరకు రాలేదు రాంబాబుకు.

"నూతన పంథాలో చదువు నేర్చుకుంటూ దేశ పోకడలన్నీ ఆకళింపు చేసుకుంటున్నారుగా! ఏం చేస్తే బాగుంటుందో మీరే చెప్పండి." అన్నాడు రాంబాబు.

"ఐ. ఎ. ఎస్.కు వెళ్ళండి"

ఆజ్ఞాపిస్తున్నట్టుగా వినిపించాయి ఆ మాటలు. ఆ మాటలలో ఎన్నో అర్థాలు గోచరించాయి. ఇందిర తన సొత్తైతే అని అనుకున్నపుడల్లా కనుల ముందు నిలచే అంతస్థుల అంతరాలు తొలగిపోడానికి దివ్యమైన సూచన అది. ఇందిర హృదయాంతరాళంలో మెదులుతున్న వరుని యోగ్యతలలో అదొకటేమో !

"తప్పకుండా పాటిస్తాను మీ సలహాను. ఎమ్. ఎ. చదివితే దానికి చాల సహాయకారిగా ఉంటుంది. ఇప్పుడే అప్లికేషన్ పడేస్తాను" అని వూహలతో మరో లోకంలో విహరిస్తూ ఇంటికి చేరిన రాంబాబు తనకు ఎదురైన దృశ్యాన్ని చూసి కొయ్యబారిపోయాడు.

గుండె జబ్బుతో ఆకస్మికంగా మరణించాడు తండ్రి.

తేలికగా ఎగిరే గుండెకు మణుగులకొద్దీ బరువును కట్టినట్లైంది. కలలు కూడ ఒక రూపానికి చేరుకోకుండానే బాధ్యతలు నెత్తిన పడ్డాయి. క్రుంగదీసే ఆలోచనలకు దూరం కావడానికి వూరిలోనే ఉన్న ఒక బాంకులో గుమాస్తాగా చేరాడు. వీలయినపుడల్లా ఇందిర స్వయంగా వచ్చి రాంబాబు మనసును తేలిక పరచడానికి ప్రయత్నించేది. నెలల అనంతరం రాంబాబు తిరిగి టెన్నిస్ రేకెట్‌ను ముట్టాడంటే దానికి ఇందిరే కారణం.

సంవత్సరం గడిచేసరికి ఇందిర కట్టే కట్టే కట్లతో తనకు కలిగిన అఘాతాన్నుండి చాలవరకు కోలుకున్నాడు రాంబాబు. అంతే కాక ఒకరోజున తన













# వక్రగతులు

కలలకు తిరిగి జీవం కూడా పోసింది ఇందిర. ఐ. ఎ. ఎస్. ఫలితాలు పడిన రోజున వార్తాపత్రికలో ఎన్నికైన వారి పేర్లన్నిటిని చూపిస్తూ.

"మిస్టర్ రావ్, ఈ పేర్లలో మీ పేరును ఎప్పుడు చూపిస్తారు ?" అని అడిగింది.

వెంటనే ఐ. ఎ. ఎస్.కు సంబంధించిన వివరాలన్నీ తెప్పించి దానిలో మనసు లగ్నంచేసి మరుసటి సంవత్సరం పరీక్షకు హాజరయాడు. కాని ఎదురైన ఫలితం చాల కృంగదీసింది. కొద్ది మార్కులతో ఇంటర్వ్యూ తప్పిపోయింది. సంగతి తెలిసిన ఇందిర అమితమైన విచారం వ్యక్తం చేస్తూ అంది.

"మిస్టర్ రావ్. నేను చాలా పొరపాటు చేశాను. ఈ విషయంలో నాన్నగారు ఎంత సహాయం చేయగలిగి ఉండేవాడో పూర్తిగా మరచిపోయాను. ఈ సారి మీరు నెగ్గడం ఖాయం. ఈ రోజే మీ సంగతి నాన్నగారికి తెలియజేస్తాను. ఆయన తప్పక సహాయం చేస్తారు."

ఆశించిన దానికంటె అధికమైన సహాయం లభించింది రాంబాబుకు ఇందిర తండ్రి దగ్గర నుండి. తనకు గడచిన సుమారు అరువది వసంతాలలోను విశేషానుభవాన్ని జీర్ణించుకొని జీవితపు సంజ చీకట్లు ముసురుకుంటున్నా అలసట ఛాయలు లేని వ్యక్తి ఆయన. తను ఆర్జించిన విజ్ఞానంతో ఊహంతో ఎన్నో నూతన మార్గాలను నిర్మించారాయన. జీవితంలో అడుగు పెడుతున్న కొందరు యువతీ యువకులనేరి వారిపై ఆ మార్గాలను ప్రయోగించి వాటిని వారికి అందజేయాలని ఆయన ధ్యేయం. మొదట ఇందిర లభించిన దాయనకు. ఇందిరతో ప్రయోగం ఒక కొలిక్కి చేరకుండానే ఇందిర పట్టుతో రాంబాబు వైపు కూడ దృష్టిని సారించాల్సి వచ్చినది. అయితే అది ఆయనకు ఏవిధమైన ఆటంకాన్ని ఆశాభంగాన్ని కలిగింపలేదు. ఇందిర ప్రయోగంతో ఒక శ్రేణికి చెందితే రాంబాబు పూర్తి వైవిధ్యంతో మరొక శ్రేణికి చెందాడు. ఆయన ఉత్సాహం యినుమడించింది. రాంబాబులో నిద్రాణమై ఉన్న నేక భావాలను వెలికితీసి ఒక విలక్షణమైన వ్యక్తిత్వం ఏర్పడేట్టు చేశాడు ఆయన తన సహచర్యంలో.

తిరిగి ఐ. ఎ. ఎస్. పరీక్షలు రాసినపుడు ఏ విధమైన వెర్రిభావం కలుగకపోగా పరిపూర్ణ సంతృప్తితో ఈ సారి నెగ్గడంలో సంశయం లేదనుకున్నాడు రాంబాబు. భవిష్యత్తుని గూర్చిన కలలు ముందెన్నడూ లేనంత దట్టంగా ముసిరాయి. మంచి హోదాతో చిల్లర బాధ్యతలు కాక అతి ముఖ్యమైన బాధ్యతలుండే ఉద్యోగం లభిస్తుంది. తను నిర్వహించే ప్రతి బాధ్యత తన ధీశక్తికి మరింత పదునుబెట్టి తన వ్యక్తి గౌరవాన్ని ఇనుమడింప చేస్తుంది. చూపరుల నిట్టే ఆకర్షించే విగ్రహాన్నిప్పటికే కలిగి ఉన్నాడు. తను భవిష్యత్తులో దూసుకు పోవడం తథ్యం. ఇందిర తోడు లభిస్తే తన జీవితం ఇంకా శోభిస్తుంది. ఈ విషయంలో ఇందిర మనసు తెలుసుకొనే ప్రయత్నం ఎన్నడూ చేయలేకపోయాడంతవరకు. దానికి ఇందిర జన్మించిన కుటుంబ సంస్కారం, తనలో

మృగ్యమైన అర్హతలు అడ్డొచ్చాయి. ఇందిరను ఒక సాధారణ వ్యక్తి భార్యగా వూహించి తనెపుడు దురాశ పడలేదు. నిరంతరం ఉత్సాహం, విజ్ఞానం, సౌందర్యం ప్రవహింపచే ఇందిర ముందు ఎప్పుడూ వెలవెలపోకుండ నిలచే వ్యక్తిత్వం గల పురుషులు బహు కొద్దిమంది ఉంటారని అతని భావం.

స్థూలంగా చూస్తే తనకు కలుగుతూన్న వ్యక్తిత్వం ఇందిరవల్లనే మలచబడింది. ఆ వ్యక్తిని ఇందిరకే అర్పిస్తే దానికి మించిన భాగ్యమేముంది? ఇందిరకు మటుకు తన జీవితం రాణించడానికి ఇంతకు మించిన అర్హతలు గల వరుడు ఎక్కడ లభిస్తాడు ?

ఇంటర్వ్యూకు పిలుపు అందిన రోజున అదే తగిన తరుణంగా భావించి తన మనసులోని మాటను వెల్లడి చేయడానికి అమితోత్సాహంతో ఇందిర ఇంటికి బయలుదేరాడు రాంబాబు.

ఇందిరే తలుపు తెరచింది. తలుపు తెరుస్తూనే 'హల్లో రావ్, నువ్వు సమయంలో ఇక్కడకు వస్తే ఎంతో బాగుండునని ఇప్పుడే అనుకుంటు న్నాను. నీకో తీయటి వార్త చెప్పబోతున్నాను'' అంది పట్టలేని ఆనందంతో.

''నేనూ నీకో శుభవార్త చెబుదామనే వచ్చాను'' అన్నాడు రాంబాబు.

''అహా, నేను చెప్పబోయే దానిముందు నీ వార్తైనా దాసోహం అనాల్సిందే. ఉండు, ఇప్పుడే వస్తాను.'' అని లోపలకు పరుగెత్తింది.

దేనినో చేతులతో వీపువెనుక దాచి చిరునగవుతో మెల్లగా అడుగులు వేసుకుంటూ రాంబాబు దగ్గరకు వచ్చి అంది.

''చేయి చాచు''

గుండెలు దడదడలాడాయి రాంబాబుకు. అప్రయత్నంగా చేయి తనంతతానే లేచింది. తను దాచి తెచ్చిన వస్తువును రాంబాబు చేతిలో ఉంచుతూ

''ఇప్పుడు చెప్పు'' అంది ఇందిర.

దానిని చూడగానే లోకమంతా తన కనుల ముందు తల క్రిందులైనట్టయింది. రాంబాబుకు. ఇందిర పెండ్లి శుభలేఖ అది !

ఇందిర చెప్పుకు పోయింది.

''ఎవరో తెలుసా ఆయన ? ఎవరో కాదు బావే! ఇంతవరకు అమెరికాలో డాక్టరేట్ చేశారు. నిన్ననే బొంబాయి చేరినట్టు వైరు వచ్చింది. కొద్ది రోజుల క్రితమే నాన్నగారు అడిగారు నా ఉద్దేశం ఏమిటని. ఏమీ తెలియనట్టు క్రొత్తగా అలా అడగడం ఎంతో సిగ్గనిపించింది. బావ ఎంత చిలిపి వాడని ! అందగాడు కూడాను. అభ్యంతరం ఎలా ఉంటుంది ? చిన్నప్పటినుండి అనుకున్నదేగా ! రేపిక్కడకు చేరుకుంటారు. నాకో మాంచి అన్నయ్య దొరికాడని నిన్ను పరిచయం చేస్తాను.''

అక్కడ నిలువలేక గిర్రున వెనక్కు తిరిగి వచ్చేశాను.

క్షణం ఆ వూరిలో ఉండ మనసు నిరాకరించింది. తల్లికేదో చెప్పి చాలా రోజులపాటు ఏవేవో ఊళ్లు తిరిగాడు. అక్కడక్కడ స్థిరపడ్డ చాల మంది స్నేహితులను సందర్శించాడు. అనాలోచితంగా వచ్చిపడ్డ స్నేహితుడిని చూచి కొందరు విస్తుపోయారు. కొందరు సంతోషంతో ఆహ్వానించారు. కాని తుఫానులో ముక్కలయిన నావలా ఉన్న తన మనస్థితి ఎవరికీ చెప్పుకోలేకపోయాడు. చివరికి అశాంతితో నిండిన మనసుతోనే తన మేనమామ ఉంటున్న ఆ గ్రామానికి చేరుకున్నాడు.

ఉదయం నోటిలో వందుం పుల్లతో వీధి అరుగు మీద నిలబడి పల్లు తోముకుంటూండగా ఎదురింటి గుమ్మంముందు ముగ్గులు పెడుతూ పరికిణీ ఓణీలతో ఉన్న ఓ అమ్మాయి కనిపించింది రాంబాబుకు. పొడవాటి వాలుజడ చివర నేలను జీరాడుతుండగా, వంగుని, అప్పుడప్పుడు కొన్ని చుక్కలను ఒక కాలితో తుడిచేస్తూ కొన్ని గీతలు వేసి కొంతసేపు ఆలోచిస్తూ, ఏదో క్రొత్త ముగ్గు వేయడానికి ప్రయత్నిస్తోంది. పల్లెటూర్లలో అందమైన ఆడపిల్లలుంటారనిపించింది రాంబాబుకు.

మొహం కడగడానికి తను నీళ్లు తెచ్చుకోవడం మరచిపోయినట్టు గ్రహించి మేనమామ కూతురు పదేళ్ళ పార్వతికోసం 'పారూ' అని కేకపెట్టాడు వెనక్కు తిరిగి. 'వస్తున్నా' అన్న జవాబుతో పార్వతి పరుగున బయటకు వచ్చింది. నీళ్లు కావాలని చెప్పబోయి ఇటు చూసేసరికి ఎదుటి గుమ్మం ముందు ఎవరూలేరు. అసంపూర్తిగా వదిలి వేయబడ్డ ముగ్గూ, కొంత సున్నం నేలమీద ఒలిగిపోగా ప్రక్కనేపడి ముగ్గుతో నిండిన కొబ్బరి చిప్ప కనిపించాయి.

"బంధువుల్ని వాదులుకోవటం చాలా కష్టంగా వుంటుంది కదూ!" బంధుప్రీతిగల ఓ పెద్ద మనిషి ప్రశ్న.

'కష్టమా! బాబోయ్ దుస్సాధ్యం' బంధుభీతిగల మరో పెద్ద మనిషి సమాధానం.

రంగారావు (మద్రాస్)

తను పెట్టిన గావుకేకతో, ఇంటి వాసాలనంటుతూ నిలబడ్డ తనను చూసి బెదిరి లోపలకు పారిపోయి ఉంటుందనుకున్నాడు.

''నేను లోపలకు పోయి మొహం కడుక్కుంటాను గానీ, నీవు ఆ ఇంటికి వెళ్ళి, ఆ అమ్మాయి ఎవరో, ముగ్గులు పెట్టుకోమని చెప్పు.'' అని పార్వతి అటుపరిరుగెత్తగా తను లోపలకు నడిచాడు.

తరువాత పార్వతి చెప్పింది.

''ఆ అమ్మాయి సరోజక్కయ్య బావా. సరోజక్క ఎంత తెలివైనదో తెలుసా ? మా వూర్లో ఉన్న ఎనిమిది క్లాసులూ చకచక చదివేసి ఫస్టున పాసయిపోయింది. ఇక్కడ చదవడానికిక క్లాసులు లేనందువల్ల రెండు మూడేళ్ళనుండి వూరికనే ఉంది. బోలెడు పుస్తకాలు చదువుతూంటుంది. నాకు ఎన్నో కథలూ ఇంకా బోలెడు సంగతులు చెబుతుంది.''

కొన్ని దినాలు ఆ గ్రామ పరిసరాలు చూస్తూ గడపిన పిదప కొంత మనశ్శాంతి చిక్కి పోగొట్టుకున్నదేదో తిరిగి లభించిన అనుభూతి కలిగింది రాంబాబుకు. ఒక రోజున తన మామయ్య నడిగాడు.

''ఇక్కడ నేను చేయగలిగిన ఉద్యోగం ఏదైనా ఉందా'' అని.

''నీ చిన్నప్పటో నెలకొల్పారు వానికి ఎరా? ఇక్కడ ఉద్యోగం నీకు'' అన్నాడాయన.

వివాలేమి చెప్పకుండా క్లుప్తంగా ''ఇంటర్వ్యూకు వెళ్ళలేదు మామయ్యా'' అని జవాబు చెప్పాడు రాంబాబు.

''హాని, నీ భవిష్యత్తుని తలచుకొని మేము మురిసి పోతుంటే ఇదట్రా నీవు చేస్తున్నది. మీ అమ్మ చూస్తూ ఎలా వూరుకుంది ? ఆవిడకు తెలుసా నీవు చేసిన ఘనకార్యం ?''

''జరిగిపోయిన దానికేమిటిగాని, మీ వూరు నాకు చాల బాగుంది. ఇక్కడే ఉండిపోదామనుకుంటున్నాను. నాకు ఉద్యోగమేమీ చూడకపోతే మీ ఇంట్లోనే ఉండిపోతాను'' అని త్రుంచేశాడు రాంబాబు.

రాంబాబు మనసు మార్చడానికి మేనమామ చేసిన ప్రయత్నాలేవి ఫలించలేదు. అప్పుడే ఉన్నత పాఠశాలగా మార్చబడుతున్న ఆ వూరి బడిలో పంతులు పనితప్ప వేరే ఉద్యోగం కనిపించలేదు ఆ పల్లెటూర్లో.

ఆ విధంగా రాంబాబు బడిపంతులు అయ్యాడు.

మరి రెండు సంవత్సరాలు గడిచిన తరువాత సరోజతో వివాహం జరిగింది. అదే పాఠశాలలో మధ్యమ తరగతులకు పాఠాలు చెప్పే మరో మాష్టరు కుమార్తె సరోజ.

అతి ప్రశాంతంగా జీవనం గడిపే చాల అరుదైన పల్లెటూర్లలో అదొకటి. జమీందార్ల బెడదలు, మునసబు కరణాల మధ్య కక్షలు, ముఠాలు, వైరాలు వగైరాలు ఆ గ్రామ ప్రజలకు అట్టే అనుభవంలేదు. అందువల్ల రాంబాబు ఉత్త బడిపంతులుగా ఉండిపోక అనేక విధాల ఆ గ్రామానికి సహాయకారి కాగలిగాడు. తన నివాసం అక్కడ ప్రారంభం కాగానే సమసమాజంలో ప్రజలకు కావలసిన అవసరాలేవో ప్రజలందరు గుర్తించేటట్టు చేసి ఆ గ్రామంలో నూతన చైతన్యాన్ని తీసుకు వచ్చాడు. సమాజాభివృద్ధి పథకాలెన్నో ఆ గ్రామంలో నిర్వర్తింప బడ్డాయి. తరచుగా మంత్రులు వాళ్లను వీళ్లను వెంట బెట్టుకొని వచ్చి ఆ గ్రామాన్ని చూపడం కద్దు. నేను వెళ్ళిన ఆన కట్ట విషయం కూడ ప్రథమంగా ప్రభుత్వం దృష్టికి తెచ్చినది రాంబాబే.

ఎటో చూస్తూ రాంబాబు తన కథనం ముగించాడు.

'ఇందిరను కలుసుకోవడం ఎప్పుడైనా తటస్థించిందా' అని అడగాలనిపించింది. ప్రశ్న వేయడానికి ముందుగానే నా మనసులో భావాన్ని పసిగట్టి రాంబాబు చెప్పాడు.

''ఇందిరను కలుసుకోవాలన్న కోరిక చాలసార్లు ఉదయించింది తరువాత. ఇందిర విషయంలో సమాధానపడడం చాల తేలికగానే జరిగింది. భగవంతుడు ప్రసాదించిన దేవత సరోజ. ఇందిర విషయంలో ఆశాభంగం కలిగిన మాట నిజమే అయినా ఇందిర నన్ను మోసం చేసింది అన్న భావం నాకెప్పుడూ కలగలేదు. ఇందిర అంతరంగాన్ని గ్రహించాలని ఏ మాత్రం ప్రయత్నించినా విష

**గం ముందే తెలిసేది. కాని నాకు అనిపిస్తున్న** దేమిటంటే, అటువంటి విషయమేదో ఉంటుం దని వ అనుమానించి, ఆ నిజం వెల్లడి య్యితే ఆ ంచి నిరాశకు లోనయ్యే గ్యం లేక వా ు ప్రయత్నాన్ని కో యక పోయిందా వాడు వేసిందని. అందువల్ల ఈ విషయంలో ఎక్కడైనా మోసం అన్నది జరిగితే అది మనసే తనను మోసం చేసుకుంది."

"ఇందిర హృదయం అతి నిర్మలమైనది. అమాయకమైనది. సూటిగా ఆలోచించడం తప్ప వాటికి మలుపులుంటాయని తెలియదు. అటు వంటి కోరిక నాలో ఉద్భవించే అవకాశం ఉందని కూడ తలచి ఉండదు. బహుశా ఇందిర తండ్రి ఆ అవకాశాన్ని పసిగట్టి మొదట మేము కలసి నపుడు నా పట్ల కనపరచిన ముభావం ద్వారా ఆ విషయంలో ఆశలు రగుల్చుకోవద్దని సూచించి ఉంటారు. అంత సున్నితమైన సూచనను గ్రహించే శక్తి ఆ వయస్సులో ఉన్న హృదయానికి ఉండడం కష్టం. ఇందిర ప్రకృతి ఆయనకు బాగా తెలిసి ఉన్నదే. అందువల్ల ఇందిరను హెచ్చ రింప వలసిన అవసరం ఆయనకు ఎప్పుడూ రాలేదు. కాగా ఇందిర హృదయం ఏ కారణానైనా ఆనా క్రాంతమైనదేమోనన్న సం యు నివాహించుకో డా కి ముహూర్తం నిర్ణయించే ం ఇందిరనే అడిగి చూసారు. ఆయన అంచనా తప్పలేదు. నా పట్ల అయ కు అ వాత తరువాత కలిగిన సుహృద్భావాన్ని బట్టి, ఇందిర ఏ కారణానైనా నాపై మొగ్గు చూపిస్తే ఆయనకు ఏ విధమైన అభ్యంతరం ఉండి ఉండేది కాదనే నా నమ్మకం.

# వక్రగతులు

"నేను అకస్మికంగా అంతర్ధానం కావడానికి కారణం ఇందిర తండ్రి ఒక్కరే గ్రహించిఉంటారు. ఇందిర ఇప్పటికీ కూడ అసలుకారణం గ్రహించి ఉండదు. తండ్రి కూడ చెప్పిఉండడు. అది నుండి నన్ను సోదరునిగానే భావించి ఉంటుంది. తనకు వివాహం కాబోతోందని, తనూ ఒక పెద్ద దానిగ అవ బోతోందని తెలిసిన వెంటనే నాపట్ల తనకున్న భావాలన్నీ ఒక్కసారిగ వ్యక్తంచేసి ఉంటుంది. దురదృష్ట వశాత్తు వాటిని స్వీకరించే స్థితిలో నేను ఉండలేదు. ఇందిర ఎప్పుడు నా స్మృతి లోకి వచ్చినా ఆఖరురోజు నేను విడచి వచ్చిన ఇందిరే గుర్తుకు వస్తుంది. ఆ రోజు చూపిన అప్యాయత, చనువు, అదికారాలే పదేపదే మన సులో మెదులుతాయి.

"ఇందిరను చూడాలన్న ప్రగాఢమైన కోరిక అప్పుడప్పుడు కలుగుతున్నా వెళ్లలేక పోతున్నం దుకు కారణం ఒకే ఒకటి. పోయినసారి ఏ స్థితిలో చూసానో అదే ఇందిర నా ముందు ప్రత్యక్ష మవు తుంది. అదే అప్యాయత, అదే చనువు, అదే అధి కారంతో ఐ. ఎ. ఎస్. ఇంటర్వ్యూకు ఎందుకు వెళ్లలేదని ప్రశ్నిస్తుంది. భవిష్యత్తుని సర్వ నాశనం చేసుకున్నానని దురపిల్లుతుంది. ఇంటర్వ్యూకు ఎందుకు వెళ్ళలేకపోయానో నిజం చెప్పే శక్తి నాలో లేదు. నిజాన్ని కప్పిపుచ్చి కల్లిబొల్లి కారణా లతో ఇందిరను సంతృప్తి పరచే వేర్పుగాని మోసం చేయాలన్న కోరికగాని లేవు."

ఇద్దరం లేచాం. వెన్నెల రాత్రులు. చంద్రుని మెత్తని కాంతిలో ఆ పరిసరాలన్నీ వెండిపూలామా చేయబడి నట్లున్నాయి.

ఆ గ్రామంలో పెన వైచుకుపోయిన అతని జీవితం, ఆ గ్రామం పట్ల అతనికున్న అనురాగం తెలియవచ్చిన 'తరువాత ఎప్పుడైనా ఆ గ్రామాన్ని వదలి పట్టణాల వైపు పోదామన్న కోరిక కలి గిందా ?' అని అడుగుదామన్న ప్రశ్న లోలోనే అణగి పోయింది.

రాంబాబు ఇంటిని సమీపిస్తూండగా కొన్ని సంవత్సరాల అనంతరం అక్కడ ఏర్పడ బోయే కృత్రిమ సరస్సూ, అదే వెన్నెల కాంతిలో అందు లోని చిరు కెరటాలు వెండిజిల్లీ తళతళలూ లీలగా కనుల ముందు మెదిలాయి.



### గ్రహస్థితి

మిధునంలో రాహువు, తులలో సూర్య బుధులు, వృశ్చికంలో కుజ శుక్రులు, ధన స్సులో కేతువు, మకరంలో శని, మీనంలో గురువు, మేష వృషభ మిధున కటకాలలో చంద్రుడు.

## ఆంధ్రసచిత్ర వారపత్రిక

## వారఫలాలు

**దైవజ్ఞ పోతూరి శ్రీరామమూర్తి**

**1-11-1963 శుక్రవారము మొదలు**
**7-11-1963 గురువారము వరకు**

### మేషం :

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

కార్యభారం పెరుగుతుంది. ఇతరుల వలన ఇంతకు ముందున్న చిక్కులు తీరిపోతవి. కుటుం బంలో శుభ సంతోష సూచనలు తెలుస్తవి. విశేషంగా ఖర్చులు తగిలే సమయం. మాటలలో తొందరను తగ్గించుకొనటం అవసరం. ఆరోగ్యం తగ్గుతుంది. వివరం తెలియకుండా వస్తువుల మీద దండగ ఖర్చులు చేస్తారు. వ్యవహారాలు శ్రమగా ఉన్నా సవ్యమార్గంలో పూర్తి అవుతవి. బంధువుల నుంచి, స్నేహితులనుంచి నిష్ఠురాలు రాగల సూచనలున్నవి. ముందు ముందు మీ పను లకు ఒక నిర్ణయం జరుగతగిన సమయం. ఈ సమయంలో ఇతరుల సలహాలను ఆలోచించి అనుసరించటం అవసరం. 2, 4 తేదీలలో స్థిరాస్థుల వృద్ధి సూచనలు, వ్యవహార జయము.

### వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)**

స్వశక్తి బాగుంటుంది. స్వేచ్ఛగా అభివృద్ధికి పోగలుగుతారు. డబ్బు కొద్దికొద్దిగా పొదుపు చేసి ఒకేసారి వినియోగించ గలుగుతారు. వ్యాపారం వంటి వృత్తులలో అభివృద్ధి కలుగుతుంది. వ్యవహార రంగంలో రాజీ మార్గంలో పోవటం మంచిది. కుటుంబంలో సాధారణమైన సుస్తి సూచనలు కనుపిస్తవి. క్రొత్త మనుష్యులతో పరిచయం లభిస్తుంది. అనేక సందర్భాలలో వెదుక బోయిన తీగే కాలికి తగిలినట్లుగా పనులు కలిసివస్తవి. పిల్లల నిమిత్తం శ్రమ పడవలసి వస్తుంది. భాగస్తులతో కలిసి చేయుపనులు పెద్దగా ఫలించవు. మిమ్ములను గౌరవించినట్లు నటిస్తూ చాటున అపకారం చేయటానికి ప్రయ త్నించేవారుంటారు. ప్రయాణాలు లాభించవు.

### ఈ వారము ధరలు

మిర్చిధర క్రమంగా పెరుగుతుంది. ప్రత్తిధర ముందు మందీ, వారం రెండవ భాగంలో తేజీ, బెల్లంధర కొద్దిగా తగ్గు తుంది. వేరుశనగపప్పు ధర తగ్గుతుంది. శనగల ధరలో మందీ సూచనలున్నవి.

* * *

### మిధునం :

**(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

ఎదటివారి సమాధానం వచ్చేవరకూ మీ అభి ప్రాయం గుప్తంగా ఉంచుకొనటం అవసరం. ఈ సమయంలో మీరు ఇతరులకు చేసే సహా యం రాణించదు. శారీరకంగా శ్రమపడ వలసిన పనులను తగ్గించుకొనుటం అవసరం. ఆదాయం మామూలుగా ఉంటుంది. ఇతరుల వద్దనుంచి రావలసిన ధనం వస్తుంది. పై అధికారులను మెప్పించటం చాలా కష్టం. మిత్రుల వద్ద నుంచి లాభ వార్తలు తెలుస్తవి. ఈ వారంలో తరచుగా మనస్సు చికాకు పడుతు ఉంటుంది. అయితే తగినంత కారణం మాత్రం ఉండదు.

మధ్య మధ్య ఆటంకాలను ఎదుర్కొంటూ ఒక స్థితికి రాగలుగుతారు. మాటలలో మీవలన కార్యం గడుపుకొనేవారుంటారు. 5, 6 తేదీలలో అకస్మాత్తుగా దేహబాధలు వస్తువులు పోవుట.

* * *

## కర్కాటకం :

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)**

బాహ్య విషయాలలో చాలా మంచి కాలం. ఏ సందర్భంలో ఎవరితో కలసినా ఆదరాభిమానాలు లభిస్తవి. పేరు ప్రతిష్ఠలు పొందగలుగుతారు. ఎప్పటికప్పుడు ఏదో ఒక క్రొత్త ప్రయత్నంలో ఉంటూ ఉంటారు. ప్రస్తుతం ఒకరిని నమ్మకొనటం మంచిదికాదు. మనశ్శాంతి లభిస్తుంది. కుటుంబ కార్యములలో బాధ్యతలను ఇతరులపైన వదిలి నెమ్మదిగా ఉండగలరు. ఖర్చులు పెరగటం వల్ల కలిగే ఆందోళన మాత్రం ఉంటుంది. తాము చేసిన పొరపాట్లను మాత్రం మీమీద రుద్దటానికి ప్రయత్నించేవారుంటారు. జాగ్రత్త.

* * *

## సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

మొత్తం మీద గ్రహబలం బాగున్నది. పలుకుబడి, ప్రతిష్ఠ లభిస్తవి. సహవాస దోషం వల్ల ఇతరుల పొరపాట్లు మీకు వర్తించగల సూచనలున్నవి. ధైర్యంతో వ్యవహార జయం పొందగలుగుతారు. బంధువుల వల్ల ఖర్చులు పెరుగుతవి. వృత్తిలో ఎదురువడే కఠిన సమస్యలు మీ బుద్ధి బలంతో చురుకుగా పరిష్కరించుకో గలుగుతారు. ప్రస్తుతం విశేషంగా ఫలితం చూడకుండా మీ ధర్మమును నెరవేర్చు కొనటం అవసరం. ధనవ్యయం, శ్రమ భరించవలసి ఉంటుంది. అధికారుల మన్నన లభిస్తుంది. పుణ్యకార్యాలు జరుగుతవి. శిరస్సుకు సంబంధించిన అవయవాలలో బాధ కలుగుతుంది. ప్రయాణాలకు ఆటంకాలు.

* * *

## కన్య :

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

ప్రస్తుతం దూర దృష్టితో యోచించే అవకాశం ఉండదు. మీ శక్తికి అసాధ్యమని తోస్తున్నా ప్రయత్నం మానలేక పోతారు. చేతికి అందనున్న ఫలితం వేసుకకు పోతుంది. బంధు విరోధం సూచిస్తుంది. దూరపు ప్రయాణాలు చేస్తారు. పడమర దిశనుంచి శుభ వార్తలు తెలుస్తవి. వ్యవహార రంగంలో ఇంతకు ముందుకన్నా అభివృద్ధి, ఉత్సాహం తెలుస్తవి. అయితే తరచుగా విసుగు, పనుల యందు విరక్తి కనిస్తు ఉంటవి. అనవసరపు ప్రశ్నలతో మిమ్ములను విసిగించే వారుంటారు. కుటుంబంలో మీరు తలపెట్టిన ప్రయత్నాలు చాలా నిదానంగా సాగుతు ఉంటవి. 3, 4 తేదీలలో ధనలాభం, అధికారుల వలన సహాయం.

## తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

"గట్టిగా మాట్లాడితే గడుసరి, చల్లగా మాట్లాడితే అసమర్థుడు" అన్నట్లుగా ఉంటుంది. మిమ్ములను గురించి ఇతరుల భావంలో. ఆదాయము, ఆరోగ్యము బాగుంటవి. అయితే ప్రతి ఘట్టంలోను ముందు జాగ్రత్త తీసుకొనటంతో మనస్సుకు పని సరిపోతుంది. శుభకార్యాలు జరిగిపోతవి. ఒకటి, రెండు సమయాలలో వృత్తిలో అభ్యంతరాలు, ఇతరులవల్ల మోసం జరుగుతుందేమో నానే భయము కలుగుతవి. కుటుంబంలోనివారి ఆరోగ్యం ఇంతకు ముందుకన్నా బాగుంటుంది. మీ పనులు, మీ వ్యవహారాలు మీకు భారంగా తోచే సమయంలో ఇతరులు కూడా మీ సహాయం కోరుతారు. జాగ్రత్తగా ఉండండి.

* * *

## వృశ్చికం:

**(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

వృత్తి ఉద్యోగాలలో మీకు ఏవిధమైన కొరత ఉండదు. ప్రత్యేకంగా క్రొత్త వ్యవహారాలలో ముందుకు వెళ్లటానికి సాధ్యం కాకపోవచ్చు. స్థిరాస్తులు కొనే ప్రయత్నాలు అనుకూలిస్తవి. బంధుమిత్రుల శుభ ప్రయోజనాలలో పాల్గొంటారు. వృత్తి ఉద్యోగాలలో అభివృద్ధికి ఆటంకాలు కలిగే సమయం. ప్రస్తుతం ప్రయాణ సన్నాహాలు చేస్తారు. అనుకూల సూచనలు తక్కువ. ఆదాయం సాధారణంగా ఉంటుంది. బంధువులను గురించిన వార్తలు అసంతృప్తికరంగా తెలుస్తవి. రక్తదోషం, లోపము నీటివల్ల ఆరోగ్యం లోపిస్తుంది. స్వయంగా నిర్వహించుకొనగల శక్తి సామర్థ్యాలున్నా సలహా సంప్రదింపుల నిమిత్తం ఎదురు చూడవలసి ఉంటుంది. 5,6 తేదీలలో కార్యభంగము, నష్టము.

* * *

## ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

తరచు సందేహాలు వస్తూ ఉంటవి. ఆడంబరం మాత్రం అధికం. వృత్తిలోను, వ్యవహార విషయాలలోను ఒకవిధంగా పూర్తి చేయగలిగామనే సంతృప్తి కలుగదు. దైవానుగ్రహంవల్ల కష్టనష్టాలు మాత్రం ఉండవు. మంచివారితో పరిచయం లభిస్తుంది. కుటుంబ కార్యకలాపాలు సుఖంగా జరుగుతవి. మనస్సు నిబ్బరంగాను, ఉత్సాహంగాను ఉంటుంది. ఈ సమయంలో దేనికది చిన్న ఖర్చుగానే కనుపించినా మొత్తం అన్నీ చేరి మీ శక్తిని మించిపోయే అవకాశా లున్నవి. సంఘ కార్యాలలో పేరు ప్రఖ్యాతులు పెరుగుతవి. ప్రయాణ సూచనలున్నవి. ఇతరులవద్ద నుంచి రావలసిన ధనం అంత సులువుగా రాదు. నౌకరులతో సౌమ్యంగా ప్రవర్తించవలసిన సమయం. 2, 3 తేదీలలో ధనలాభం, గౌరవం, దేహ శ్రమ.

* * *

## మకరం :

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

సుఖము, సంతోషము లభించే సమయం. ఆదాయము వృద్ధి అవుతుంది. మీ కార్యకలాపముల యందు మీకు శ్రద్ధ అవసరం. అధికారులతో సంబంధించిన లావాదేవీలలో ఆలస్యము. అశ్రద్ధ పనికిరాదు. మాట మృదుత్వంతోనే ఫలితం పొందగలుగుతారు. ఈ సమయంలో కొన్ని పనులు కుంటుపడినట్లు కనుపిస్తవి. కాని, అందువల్ల తరువాత మీకే అనుకూలసత కలుగుతుంది. కుటుంబంలో ఇంతకుముందుకన్నా బాగుంటుంది. దుబారా తగ్గుతుంది. క్షేమారోగ్యములు లభిస్తవి. వృత్తి, వ్యాపారాలలో గొప్పగొప్ప అవకాశాలు రానున్నట్లు కనుపించినా ప్రతిబంధకాలు వస్తూ ఉంటవి. సంఘంలో గౌరవప్రదమైన సమయం. క్రమక్రమంగా ఆదాయం పెరుగుతుంది. స్నేహితుల సహాయం లభిస్తుంది.

* * *

## కుంభం :

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

ఈవారం మీకు అన్నివిధాలా ఉత్తమంగా ఉంటుంది. సాటివారిలో గౌరవం, ఘనత లభి లభిస్తవి. మనోధైర్యం బాగుంటుంది కోర్టు కచేరీలలో ధనము, గౌరవము కూడా లభింపగల అవకాశాలున్నవి. వృత్తిలో అకస్మాత్తుగా ధనం లభించే అవకాశా లున్నవి. మధ్యలో ఒకానొక సమయంలో నాతదోషంవల్ల బాధపడతారు. అయితే వెంటనే నివర్తి అవుతుంది. క్రొత్తవారితో కలసి వ్యాపారం చేయటం, భారీగా ధనం వినియోగించి క్రొత్త సంస్థలు ఆరంభించటం మొదలయిన వాటికి అనుకూలమయిన కాలం. మీ ఆలోచనలకు రూపం ఏర్పడుతుంది. దక్షిణ, పశ్చిమ దిశలలకు ప్రయాణం చేయవలసి రావచ్చు. విలువగల వస్తువాహనాలను కొనగలుగుతారు. 3, 4 తేదీలలో అధికారుల స్నేహం, దైవకార్యాలు.

* * *

## మీనం:

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)**

కుటుంబంలో క్షేమ లాభాలు బాగుంటవి. భాగ్యవృద్ధి, బంధువులవల్ల గౌరవము, సంఘంలో ఉత్తమ స్థానం పొందగలుగుతారు. మీరు ఎవరిని అసమర్థులుగా భావించారో వారివల్లనే కార్యసిద్ధి పొందగలుగుతారు. వృత్తిఉద్యోగాలలో మీ యుక్తితో కూడిన మాటలు, పనులు ఎదురు తిరిగిరాగల అవకాశాలున్నవి. జాగ్రత్తగా ఉండండి. ప్రస్తుతం వ్యవహార కార్యాలు కాని, ఇతరత్రా విరోధులను గురించిన ప్రసంగాలు కాని అనుకూలంగాను, సౌమ్యంగాను కనుపించవు. వృత్తిలో పెద్దగా చెప్పుకోదగిన మార్పులు ఏమీ ఉండవు. బంధువుల వద్దనుంచి శుభవార్తలు తెలుస్తవి. 5, 6 తేదీలలో మానసికంగా అశాంతి, వృధా కార్యభారం. ★

# రామ చరిత మానస

## 3

## శివుడు పార్వతికి రామ మహిమను గురించి ఉపదేశించుట

"ఓ భరద్వాజా! శివభక్తిలేనివారు స్వప్నమందైననూ రామచంద్రుని సంతోషపెట్టజాలరు. శివకేశవులకు భేదము లేదని తెలిసినవాడవు కాబట్టి ప్రారంభమున నీకు ఆ కైలాసపతి కథ క్లుప్తముగ వివరించి చెప్పితిని. ఇక రఘుపతి రమణీయగాథ వినిపించెద సావధానుడవై ఆలకింతువుగాక" అని యాజ్ఞవల్క్య మహర్షి భరద్వాజమునికి రామచరిత్ర చెప్ప నారంభించెను.

"సిద్ధ తపోధన జోగి జన
సుర కిన్నర ముని బృంద,
బసహి తహాఁ సుకృతీ
సకల సేవహి శివసుఖకంద."

దేవతలు, సిద్ధులు యోగులు, మునులు, కిన్నరులు నిత్యము సేవించుచుండ ఆనంద ధాముడగు విశ్వనాథుడు కైలాసగిరిపై నివసించుచుండెను. కామారికి విముఖులైనవారు కలయందైనా కైలాసమున నివసింపజాలరు. ఆ పర్వత ప్రదేశమున ఎల్ల కాలములందు పచ్చగనుండు మర్రిచెట్టొకటి కలదు. చల్లని ఆ వటవృక్ష ఛాయలో విశ్వనాథుడప్పుడప్పుడు విశ్రమించు చుండునని వేదములు చెప్పుచున్నవి.

ఒకనాటి సమయమున చంద్రమౌళి వియద్గంగ— విదియ చంద్రుడు జటాజూటమున శోభించుచుండ, శరత్కాల చంద్రుని ధిక్కరించు ముఖకాంతితో వ్యాఘ్రాజినముపై విశ్రమించియుండెను. ఆ రమణీయ ప్రదేశము హరుని హృదయమునకు ఆహ్లాదము గొల్పుచుండెను. ఇదియే మంచి తరుణమని భావించి జగన్మాత పార్వతి చంద్రమౌళి చెంత జేరి మృదుమధుర వాక్కుల పరమేశు నిట్లు ప్రశ్నించెను—

"ఓ జగదీశా! సర్వజ్ఞుడవగు నీవు నన్ను కరుణించి, లోకోత్తర పురుషుడగు శ్రీరాముని లీలా రహస్యములను వెల్లడించి, నా అజ్ఞానమును పోగొట్టవలసినదిగా ప్రార్థించుచున్నాను.

స్వామీ! ముందు జన్మలో నేనొకప్పుడు శ్రీరాముని దివ్య ప్రభావమును దర్శించియుంటిని, కానీ అతని చర్యలకు మహిమకు గల వ్యత్యాసము నేటికినీ గ్రహింపలేకున్నాను. వేదములయందు వర్ణించబడిన రాముడు, సాకేత రాముడు ఒకరేనా! ఒకరే యైనచో భార్యా వియోగదుఃఖముచే అట్లు ఎందులకు పరితాపమొందును!

నాథా! నిర్గుణ బ్రహ్మ సగుణరూపముతో అవతరించుటకు కారణమేమి? అట్లు అవతారమెత్తిన ప్రభువు బాల్యము వివాహాదులను విస్తరముగ వినగోరుచున్నాను. తదుపరి వారు వనవాసమెందుకు చేయవలసి వచ్చెను! రావణ సంహారమెట్లు జరిగెను. పట్టాభిషేకము పిమ్మట స్వామి సాకేతవాసులతో కలసి చేసిన వైకుంఠ యాత్ర మున్నగు లీలను, భక్తి జ్ఞాన వైరాగ్య సమన్వితమగు రామకథా తత్త్వ ప్రభావమును వివరముగ బోధించి నన్ననుగ్రహింప వేడుచున్నాను." అని ప్రసన్నవదనయైన పార్వతి పరమేశుని ప్రార్థించెను.

రామకథాశ్రవణ కుతూహల యగు పార్వతి ప్రశ్న ఆలకించి హరుని హృదయము హర్షితమయ్యెను. తత్క్షణమే త్రుటికాలములోపల రాముని దివ్యచరిత్రంతయూ కామారి కన్నులకు గోచరమయ్యెను. రామకథాస్మరణచే పశుపతి శరీరము పరమానందముచే పులకరించిపోయెను. అంతట నిమీలితనేత్రుడై రాముని కొద్దిసేపు ధ్యానించిన పిమ్మట పరమేశుడు పవిత్రమగు రామకథను పార్వతి కిట్లు చెప్ప నారంభించెను.

"ఓ అపర్ణా! లోకోపకారార్థమై నీవు మంచి ప్రశ్న వేసితివి. గంగ వంటి పవిత్రమగు రామకథను వినదలచిన నీవు ధన్యురాలవు. దేవీ! రామ మాహాత్మ్యమును గురించి నీ కింకనూ సందేహము తీరనట్లున్నది. ఇచ్చట నీ కొక్క విషయము స్పష్టము చేయదలచు చున్నాను. అది యేమన,— చక్కగ గ్రహించిన తర్వాతనే ఇది సర్పము కాదు త్రాడు అన్న సంగతి విదితమగును. అవ్విధముగ, ఆత్మజ్ఞానము పొందిన పిమ్మట శంకా సందేహము లన్నియూ వాటంతటవే వైదొలగి పోగలవు. వేదములో వర్ణించబడిన రాముడు — దశరథరాముడు ఒకరేనా యని విచికిత్సకులోనైతివి. శృతులకు, యతులకు, ఆత్మజ్ఞానమునకు దూరులగు అజ్ఞానులు మాత్రమే యిట్లు శంకించెదరు. సత్యాసత్యములు చక్కగ తెలిసిన విజ్ఞులివ్విధముగ నూహించజాలరు.

"భవానీ! పరమాత్మని సగుణ నిర్గుణ రూపములకు భేదములేదు. రూపనామక్రియారహితుడైన పరబ్రహ్మ తన భక్తుల ప్రీత్యర్థము అవతారము ధరించుచున్నాడు. అతి శీతలముచే జలము ఘనీభవించి మంచుగడ్డగా మారుచున్నట్లు సూక్ష్మమగు పరమ తత్త్వము ఒకప్పుడు స్థూలరూపమును పొందుచుండును. అందుచే శుద్ధ జ్ఞాన స్వరూపమగు ఆ పరమ తత్త్వము మాయా మోహ ద్వంద్వములకు అతీతమైనదిగా భావించవలెను. కావున, సచ్చిదానంద స్వరూపుడగు శ్రీరాముడు మాయామోహములకు అతీతుడైన జ్ఞాన స్వరూపుడేగానీ వేరొండు గాదు.

కేవలము జ్ఞానస్వరూపమగు ఆ పరమాత్మ తత్త్వమే ఈ జగత్ సృష్టికి మూల కారణము. దానికి ముక్కు చెవులు కన్నులు నాలుక పాదములు లేకున్ననూ, అది చూడగలదు. వినగలదు, ఆఘ్రాణించగలదు. దాని మహిమ సూక్ష్మము, దాని వ్యాపారములు లౌకికములు.

ఆ పరమాత్మయే దశరథరాముడై అవతరించెను. సర్వాంతర్యామి, చరాచరములకు నాథుడగు ఆ శ్రీరామచంద్రుడే నాకు ఆరాధ్యుడు. అట్టి మహాత్ముని గురించి నీవు శంకించడము విచారకరము.

"పార్వతీ! మానస సరోవరము వంటి పవిత్రమగు రామ కథను మొదట పక్షిరాజు గరుత్మంతుడు కాకభుశుండి వద్ద వినియుండెను. దానినే నీకు వివరించి చెప్పుచున్నాను. సావధానచిత్తవై ఆలకించవలసినది" అని బోధించి పరమశివుడు జగన్మాతకు రామకథాక్రమం బిట్లు వర్ణించి చెప్పెను.

"భో—భూ—దేవ—బ్రాహ్మణులకు దుర్జనుల

జనుల బాధ లెక్కువైనప్పుడు, ధర్మము నశించి అధర్మము మిక్కుటమై పాపములు పెరిగినపుడు భగవంతుడు భూభార నివారణార్థమై అవతరించు నుట విదితమే కదా ? రామావతారమునకు ఇదియే ముఖ్య హేతువు. కానీ శ్రీరాముని జననమున కనేక యితర కారణములు కూడ కలవు. అందులో ఒకటి రెండు జన్మలను గురించి విశదీకరించెదను.

## రామావతారమునకు కారణములు

"జయ విజయులని ఇద్దరు ద్వారపాలకులు వైకుంఠ మునం దుండిరి. వారు శ్రీమన్నారాయణ మూర్తికి అత్యంత ప్రియపాత్రులు. సనకస నందుల శాపముచే వారిద్దరు దైత్య వంశమున హిరణ్యాక్ష హిరణ్యకశిపులై జన్మించిరి. వారిరువురు అజేయులై వేల్పులను వేధించుచుండ భగవంతుడు వరాహ నృసింహావతారము లెత్తి వారిని సంహరించెను. భగవంతుని చేతిలో పంచత్వ మబ్బిననూ మూడు జన్మముల వరకూ రాక్షసులుగా పుట్టుచుందురని మునులు శపించి యున్నందున వారికి ముక్తి కలుగలేదు. అందుచే తిరిగి వారు రావణ కుంభకర్ణులై జన్మించిరి. వారి కొరకై హరి పునః భూమిపై అవతరించవలసి వచ్చెను. ఆ కల్పమున అదితి కశ్యపులు కౌశల్యా దశరథులుగా జన్మించిరి. వారి గర్భమున రాముడై అవతరించి దేవుడు లోకరక్షణ చేసెను.

"మరొక కల్పమున జలంధరుడను రాక్షసుడు దోర్బలుడై దేవతల రాజ్యము హరించెను. శైలజా! ఆ జలంధరుని నేను కూడ ఓడించలేక యుంటిని. ఆ దైత్యుని అర్ధాంగి మహా పతివ్రత యగుటచే వానికి చావులేకుండెను. అప్పుడు గత్యంతరములేక హరి తన మాయోపాయముచే ఆమె పాతివ్రత్యమును భంగపరచి వాని మరణమునకు తోడ్పడెను. ఈ సంగతి తెలుసుకున్నపిదట అతని భార్య భగవంతుని మానవశరీరము ధరించి భార్యా వియోగ మనుభవింపుమని శపించెను. ఆమె శాపము కూడ రామావతారమునకు కారణ మయ్యెను. ఆ జలంధరుడే రావణుడుగా అవతరించెను.

## నారదుని శాపము

పార్వతీ ! అదియేగాక నారదుని శాపమువలన కూడ భగవంతుడు అవతారము దాల్చవలసి వచ్చెను.''

అని శివుడు చెప్పగా విని శాంకరి ఆశ్చర్య పడెను. విష్ణుభక్తుడగు నారదుడు పరమ జ్ఞాని గదా ! అత డెట్లు దేవుని శపించెనని భవాని శంకించుట జూచి భవుడిట్లు నుడివెను.

"ఉమా ! జ్ఞానులు సైతం భగవన్మాయకు లోబడి అతని ఇచ్ఛానుసారము వర్తించుచుందురు. అందుల కుదాహరణగా నారదు డెట్లు వివేకము కోల్పోయినది వివరించుచున్నాను వినుము.

హిమవత్పర్వత ప్రాంతమందు గంగానది యొడ్డున ఒక ఋష్యాశ్రమ ముండెను. ఒకప్పుడు నారదుడు దాని రామణీయకతకు ముగ్ధుడై లోక సంచారము చాలించి, అచటనే భగవధ్యానము చేయు చుండెను. సురమౌని తపస్సుకు భయపడి ఇంద్రుడు నారదుని దీక్ష భంగపరచి రావలసిన దని మన్మథుని పంపెను.

అంతట కాముడు రంభాద్యప్సరసలను, వసంతాది అనుచర బృందమును వెంట విడుకొని వచ్చి నారదుని మనసు చలింపజేయుట కెంతయో ప్రయత్నించి చూచెను. కానీ నిష్ఠానిమగ్నుడగు నారదుడు అనంగుని ఆకర్షణకు లోనుగాక నిశ్చలుడై యుండెను. అంతట మనోభవుడు తన పరాజయము స్వీకరించి, నారదుని వద్ద క్షమాభిక్ష వేడుకొని దేవలోకమునకు తిరోగమించెను.

ఒకప్పుడు త్రిలోకసంచారి నారదుడు కైలాసమున కేగియుండి అచట శంకరునితో నేను కాముని పరాభవించితి నని ప్రగల్భము లాడెను. శివుడది విని "నారదా ! నాతో ప్రస్తావించినట్లు ఈ విషయము నారాయణునితో మాత్రము చెప్పకుము. దీనిని గోప్యముగా నుంచుకొనుట శ్రేయస్కరము" అని హిత వొసంగెను.

హరుని హితోక్తులు నారదుని చెవి కెక్కలేదు. అతడు క్షీరసాగరమందు శయనించియున్న శ్రీమన్నారాయణుని దర్శించి అతనితో భావజుని పరాభవించితినని గర్వోక్తు లాడెను. భగవంతుడు నారదుని నిగ్రహాశక్తిని ప్రశంసించి అప్పటికి అతనిని పంపివేసెను. నారదు డక్కడనుండి పోయిన వెంటనే నారాయణమూర్తి మాయానటిని బిలిచి నారదుని అహంకారమునకు తగిన శాస్తి జేసి రమ్మని ఆదేశించి పంపెను.

వెంటనే మాయానటి నారదుడు పోవుచున్న మార్గములో ఒక సుందరమైన నగరమును సృజించెను. సకల వైభవములచే ఆ నగరము భూలోక వైకుంఠమువలె భాసించెను. ఆ పట్టణపు రాజుపేరు శీలనిధి. శీలనిధి కుమార్తె విశ్వమోహినికి స్వయంవరము జరుగుచుండెను.

జగన్మోహనకరమైన ఆ స్వయంవరోత్సవము చూడదలంచి నారదుడు రాజభవనమునకు వెళ్ళెను. శీలనిధి సురమౌనికి స్వాగత సత్కారములు చేసి తన కన్యకను రావించి పరిచయము చేసెను. విశ్వమోహిని రూప లావణ్యములకు మునీశ్వరుని కన్నులకు మిరుమిట్లు గొలిపెను. ఆ చిన్నదాని చక్కదనము చూచిన నారదుని నిగ్రహము నీరై మోహాధీన మయ్యెను. ఎట్లయిననూ ఆ మోహాంగిని వివాహమాడి తరించవలెనని మునివరుని మనస్సు కొటకొట లాడెను. తుదకు నారదుడు ఆ మచ్చకంటి చక్కదనమునకు చిక్కువడి ఆమెను వివాహమాడుటకు కృతనిశ్చయు డాయెను.

నారదుడు పరిపరివిధముల ఆలోచించసాగెను. స్వయంవరమునకు ముహూర్తము సమీపించుచుండెను. జప తపములు చేసి కార్యము సాధించుటకు వ్యవధిలేదు. బైరాగి వేషముతో స్వయంవరమునకు వెళ్ళిన ఫలితము లభింపదు. ఆ తొందరలో నారదునికి ఏమి చేయుటకు దిక్కు తోచలేదు. భగవంతు డొక్కడే ఇట్టి విపత్సమయములో నన్నాదుకొనగలడని యోచించి తుదకు నారదుడు నారాయణుని స్మరించెను. అతడు తంబుర మీటినదే తడవుగా నారాయణుడు ముని ముందర వచ్చి నిలబడెను. నారదుడంతట కేలుగీలించి, శిరము వంచి, దీనవదనుడై స్వామిని సంబోధించి —ఓ దేవా ! నేనా విశ్వమోహినిని మోహించితిని. ఆ చిగురుబోడిని చేపట్టి సుఖింపకున్న నా జప తపము లన్నియూ వ్యర్థమగును. కాబట్టి ప్రస్తుతము నే నా చిన్నదాని కన్నులకు మన్మథుని వలె కన్పడవలెను. ఆమె నా రూపుకు ముగ్ధురాలై నా మెడలో వరమాల వేసి నన్ను వరించవలెను. అందుకుగాను స్వయంవర సమయములో నీ రూపు నాకు ప్రసాదించి నాకు సహాయపడవలెను" అని విధేయుడై వేడుకొనెను.

"ఆహా ! నారదమునులవారు బహు చిక్కుగా మాయకు లోబడి యున్నారు" అని తలంచి ముసి ముసిగా నవ్వుకొనుచు నారదా ! నీకు మేలు కలుగుగాక యని దీవించి హరి అంతర్ధానమై పోయెను.

ఆమీదట నారదుడు సంతోషముతో పరుగు లిడుచూ స్వయంవర మంటపములోనికి ప్రవేశించి రాజకుమారుల మధ్య ఠీవిగా కూర్చొనెను. విశ్వమోహిని నన్నే వరించగలదని ధీమాతో ఉండెను. కాని భగవంతుని లీలలు అతని కవగతము కాలేదు.

దేవుని మాయచే నారదుడు రాజన్యుల కన్నులకు ముని వలెను, రాజకుమార్తె చూపులకు కోతి వలెను, తన దృష్టికి కతడు విష్ణువు వలెను కన్పట్టసాగెను. అజ్ఞానవశుడై అతడు తనవంటి చక్కనివానిని విశ్వమోహిని తప్పక వరించగలదని ఉప్పొంగుచుండెను.

శివుని అనుచరు లిద్దరు ఆ సభకు బ్రాహ్మణ వేషమున వచ్చియుండిరి. వారికి మాత్రం నారదుని లోగుట్టు తెలిసియుండెను. వారిద్దరు 'ఆహా ! నారదులవారి 'హరి' రూప మెంత అందముగా నున్న' దని పరిహాసోక్తు లాడుకొను చుండిరి.

రాజకన్య విశ్వమోహిని వరమాల చేబట్టుకొని రాజసభలోనికి వచ్చెను. ఆమె నారదుని వైపు కన్నెత్తి కూడ చూడలేదు. ఆ వచ్చినవారి మధ్య ఒక రాజకుమారుని రూపుతో వచ్చి ఒక ప్రక్కగా కూర్చొనియున్న శ్రీమన్నారాయణుని గళసీమను ఆమె తన వరమాలచే అలంకరింపజేసెను. తక్షణమే అందరు చూచుచుండ నారాయణుడు విశ్వమోహినిని తనవెంట బెట్టుకొని అచటి నుండి వెడలిపోయెను.

బ్రాహ్మణ వేషములో నున్న శివుని సేవకు లిద్దరు నారదునివైపు జూచి పకపక నవ్వుచూ 'నారదస్వామీ ! నీ ముఖము కాస్త అద్దములో చూచుకొనుము' అని ఎగతాళిచేసి అక్కడనుండి కాలికి బుద్ధిచెప్పిరి. నారదుడు తన ముఖమును జలములో చూచుకొని ఖిన్నుడయ్యెను. తనను పరిహసించి పరుగెత్తిపోయిన శివసేవకులను తూలనాడి వారిని రాక్షసులుగా పుట్టుదురు గాక యని శపించెను.

తనకు జరిగిన పరాభవమునకు మునీశ్వరుడు ఉగ్రుడై మండిపడుచు పరుగెత్తిపోయి శ్రీమన్నారాయణుని సమీపించి అతని నిట్లు తూల

ఇద్దరు పరిచితుల సంభాషణ:
"నేను మిమ్మల్ని ఎక్కడో చూసినట్లు జ్ఞాపకం?"
"చూసేవుంటారు! నేనక్కడకు చాలాసార్లు వచ్చాలెండి"
రాజేశ్వరరావు (రామచంద్రపురం)

నాడెను—"ఓ దేవుడూ! నీవు వట్టి మోసగాడివి, ఈర్ష్యాపరుడవు. స్వార్థచింత గలవానివి. సము ద్రము మథించినపుడే నీ మోసము ప్రపంచమునకు తెలిసిపోయెను. పాపమా శివునికి విష మిప్పించి లక్ష్మిని, కౌస్తుభము మున్నగు మంచి మంచి వస్తువులను కాజేస్తివి. నీవంటి కపటి, కుటిలుడు మరొక్కడు లేడు. ఈనాడు నా కన్నుల్లో గూడ కారముజల్లి విశ్వమోహినిని హరించితివి. ఇదిగో! యే రాజకుమారుని వేషముతో నన్ను వంచించితివో ఆ రూపముతో నీవు భూలోకమున పుట్టుము, నాకు విశ్వమోహినిని దక్కనీకుండ చేసినందులకు నీవు సైతం భార్యా వియోగ మనుభవింతువు గాక, నాకు కోతిరూప మిచ్చి పరాభవించినందులకు ఆ కోతులనే నీవు ఆశ్రయించెదవుగాక" అని సుర మౌని కోపముతో శపించెను.

నారదుని ఆగ్రహావేశము చూచి నారాయణుడు చిన్నగ మందహాసము చేసెను. హరి దరహాసవద నము తిలకించగనే ఇంతవరకు మౌనిని ఆవరించి యున్న మాయ తొలగిపోయెను. మాయా వశుడై మూఢునివలె భగవంతుని దూషించి నందుకు నారదుడు పశ్చాత్తాపము జెంది హరి పాదములపై బడి ప్రాయశ్చిత్త మిప్పింపుమని ప్రార్థేయపడెను.

హరి దయార్ద్రహృదయుడై నారదుని అవలో కించి ఇట్లనెను— "మునివరా! అంతయూ నా సంక ల్పానుసారమే జరిగినది. ఇందుకు నీవు చింతించ పని లేదు. నీ మేలుకొరకే ఇట్లు జరుగవలెనని నేను కోరియుంటిని. నీవు సదాశివుని నూటొక్కమారు జపించుము. అదియే నీకు మనశ్శాంతి ప్రసాదించ గలదు. ఎవనికి శంకరుని దయ లభించునో వానికి నేను వశ్యుడని విశ్వసించుము" అని ఆశ్వాసించి నారాయణుడు రాజకుమారుని రూపము వీడి నిజ రూపము బొందెను.

ఇవ్విధముగ నారాయణుడు నరుడుగా అవత రించుటకు, నా సేవకులిద్దరు రావణ కుంభకర్ణులై పుట్టుటకు నారదుని శాపము కూడ కారణ మయ్యెనని శర్వుడు శర్వాణికి విశదీకరించెను.

## మనుచరిత్ర

స్వాయంభువు మనువు అతని భార్య శతరూప మానవ జాతికి మూల పురుషులు. వారికి ఉత్తాన పాదుడు ప్రియవ్రతుడని ఇరువురు కుమా రులు, దేవహూతియను కుమార్తె ఒకతె ఉండెను. దేవహూతికి కర్దమునికి జనించిన వాడే కపిలుడు. అతడు సాంఖ్య శాస్త్రమును రచించి లోక ప్రసిద్ధి నొందెను.

వృద్ధాప్యము సమీపించగానే పెద్ద కుమా రుని రాజ్యాభిషిక్తుని జేసి శతరూప స్వాయంభు వులు తపస్సుకై నైమిశారణ్య ప్రాంత మందున్న గోమతీ తీర్థమునకు చనిరి.

ఆ వృద్ధ దంపతులు నిద్రాహారములు మాని, రేయింబవళ్ళనక, ద్వాదశాక్షరీ మంత్రము జపించుచూ కొన్నివేల సంవత్సరములు ఘోర తపస్సు చేసిరి. భక్త పరాధీనుడగు భగవంతుడు ఆ పుణ్య దంపతుల తపస్సుకు మెచ్చి వారల యెదుట సాక్షాత్కరించెను. స్వాయంభువు, శత రూప దేవదేవుని దివ్య మంగళ స్వరూపమును ఱెప్పవేయక చూచుచుండిరి. ఆ జగన్మోహనుని దివ్య రూపమును ఎంత చూచిననూ వారి తృషిత నేత్రములకు తృప్తి లేకుండెను.

బాల సూర్య ప్రభా సన్నిభమగు మణిమయ మకుటము, కర్ణకుండలములు, ఉరమున వన మాల, నీలనీరద శరీరకాంతి, పీతాంబర ధారియై వామ భాగమున మహాలక్ష్మి హస్తద్వయమున శంఖ చక్రగదా పద్మములు శోభిల్లుచుండ, కోటి మన్మథుల ధిక్కరించు మనోజ్ఞ— మూర్తి శ్రీమన్నారాయణుని సుందర రూపమును ఆ దంప తులు తన్మయులై చూచిరి. తదుపరి వారు నేత్రముల ఆనంద భాష్పములు రాలుచుండ పులకిత శరీరులై శ్రీనివాసుని చరణ ద్వయ ముపై వ్రాలి ఇట్లు ప్రార్థించిరి—

"ఓ భక్తకల్ప ద్రుమా! జగద్బాంధవా! కృపా సాగరా! తమ దివ్య దర్శనముచే మా తపస్సు ఫలించి జన్మతరించెను. ఓ దీనబంధూ! మాకొక కోరిక కలదు, చెప్పుటకు నోరాడకున్నది, అయి ననూ నిజము దాచలేకన్నాము. అది యేమన— మాకు తమవంటి కుమారుడు ఒకడు కలుగ వలెనని నిక్కలి మక్కువగా నున్నది. మా మనవి మన్నించి మామక్కువ తీర్చవలసినది" అని వారు వేడుకొనిరి.

---

రాము: ఏరా, పత్రిక తియ్యగానే వారఫలాలు చూసు కుంటున్నావా?

మోహన్: నా నికాదురా; మన స్నేహితు లెవరికైనా 'ధన లాభం' అని రాశారేమో, పదో, ఐదో అప్పడుగుదామని...

కె. రాంగారావు.

---

భగవంతుడు వారి నిండు హృదయమునకు కడుంగడు సంతసించి—

"మహాత్ములారా! అటులనే మీ కోరిక సిద్ధించ గలదు. ప్రస్తుతము మీరు ఇంద్రపురికి వెళ్ళి అక్కడ కొద్ది కాలము సుఖింపుడు. కాలాంతర మున అయోధ్యలో నేనే మీ గర్భమున అవతరించె దను." అని వారిని అనుగ్రహించెను.

"భరద్వాజా! ఇవ్విధముగ భవుడు భవానికి చెప్పిన కథా వృత్తాంతము నీకెరిగించితిని. రామావతారమునకు గల మరొక కారణము గూడ విశదీకరించెద శ్రద్ధాళుడవై ఆకర్ణించ వలసినదని యాజ్ఞవల్క్యుడు వచించెను.

## ప్రతాపభానుని కథ

"కేకయ దేశాధీశుడగు సత్యకేతునకు ప్రతాప భానుడు అరిమర్దనుడను ఇర్వురు పుత్రులుండిరి. జ్యేష్ఠుడగు ప్రతాపభానునికి పట్టముగట్టి సత్య కేతుడు తపమునకై వనములకు వెళ్లెను. గుణధాముడగు అరిమర్దనుడు అన్నకు అన్ని విధ ముల సహాయ పడుచుండెను. రాజనీతి విశారదు డగు మంత్రి ధర్మరుచి వారికి మంత్రాంగము చేయుచుండెను. ప్రతాపభానుడు దిగ్విజయము చేసి ఏకచఛత్రాధి పత్యము వహించి రాజ్య మేలెను.

ఒక దినము ప్రతాప భూపతి అశ్వారూఢుడై వేట నిమిత్తము వింధ్యాటవికి వెళ్లెను. అట్లు వనాంతరమున వివిధ మృగములను వేటాడు చున్న నృపతి ఒకచోట పెద్ద పందిని చూచి దానిని చంపుటకు ఉద్యమించెను. గుర్రపు డెక్కల ధ్వని విని ఆ వరాహము ప్రేటు తప్పించు కొని అడవిని బడి పరుగులిడెను. ఆ పంది నెట్లు యినా సాధించవలెనని రాజు దానిని వెంబడించెను. తుదకా వరాహము గొప్ప కీకారణ్య ప్రాంతము ప్రవేశించి అచ్చట ఒక్క కొండ గుహలో దూరి అదృశ్యమయ్యెను.

దూరాగతుడైన రాజు అప్పటికే అలసిపోయి, దాహముగొని, దారి దప్పియుండెను. మార్గము దప్పి, ఏకాకియై, అడవిలో దిక్కు తెలియక ఇటూ అటూ తిరుగుచున్న ప్రతాపభానునికి అక్కడ ఒక ఋష్యాశ్రమ ముండుట గోచరించెను. బ్రతుకు జీవుడా! ఇక్కడెవ్వరో మహాత్ములు నివసించుచున్నట్లున్నది! అని సంతోషముతో రాజు ఆశ్రమములోనికి పోయెను.

ఇంతకు పూర్వము ప్రతాప భానుడు దిగ్విజయ యాత్ర సాగించినపుడు అతనిచేతిలో ఓడి పోయి రాజ్యము పోగొట్టుకున్న ఒకానొక రాజు కపటముని వేషముతో అక్కడ ఆశ్రమములో కాలము గడపుచుండెను. ఆ కుహనా ముని ప్రతాప భానుని గుర్తుపట్టెను. అయితే ప్రతాపునికి మాత్రం అతడు ప్రచ్ఛన్న వేషములో నున్న శత్రురాజను సంగతి తెలియరాకుండెను.

ముని ప్రతాపభానుని అత్యాదరముతో లోనికి ఆహ్వానించి, చల్లని పానీయాదులతో సత్కరించి, తియ్యని పలుకులతో "అయ్యా! మీరెవరో మహారాజువలె కన్పట్టుచున్నారు. ఇప్పటికే చీకటి పడి రాత్రి కావచ్చినది. ఈ కారడవిలో రాత్రి పూట ప్రయాణించుట అపాయకరము. పూర్తిగా అలసియున్నట్లున్న మీరు రాత్రికి మా యాశ్రమ ములో విశ్రమించి ఉదయమునకే మీ నిజ నివా సమునకు పయనము కావచ్చును." అని అభ్యర్థిం చెను.

రాజు ముని సత్కారమునకు ముగ్ధుడై "మహాత్మా! నేను ప్రతాప భాను భూమీశుని మంత్రిని. వేటకై వచ్చి దారితప్పి అలసితిని." అని రాజు తన నిజనామమును మరుగు పరచిమాట్లా డెను.

రాత్రి చాలసేపు వరకు వారిద్దరి మధ్య సంభాషణ జరిగెను. మాటల సందర్భమున కపట యోగి రాజుతో — యోగదృష్టిచే సర్వము గ్రహించితి ననియూ, నీవు కేకయదేశాధీశుని వైన ప్రతాప భానుడవనియు విశదీకరించెను.

సత్కారము, సంభాషణ సరళి, మాటల తీరు మున్నగునవి చూచి ప్రతాపునికి మునిపై శ్రద్ధా భక్తి కలిగెను. ఇతడెవరో అసామాన్యుడైన సిద్ధపురుషుడుగా యుండనోపునని రాజు విశ్వ సించెను.

అంతట రాజు దొంగసాధువు యెదుట ముకు ళిత హస్తుడై— "మహాత్మా! మీరెవరో మహా పురుషులుగా నాకు తోచుచున్నది. స్వామీ! నాపై కరుణించి నేను అజేయుడనై నూరు కల్పముల వరకు యావత్ప్రపంచమును యేలు నట్లు నాకు వరమిచ్చి కృతార్థుని చేయవలసి నది." అని అర్థించెను.

ప్రతాపుడు తన మాయకు లోబడెనని గ్రహించి సాధు వేషధారియగు శత్రురాజట్లనెను—

"రాజా ! ఈ ముల్లోకములలో నాకు దుర్లభమైన దేదియూలేదు. నీవు నా దాసుడవని నమ్మి నీ కోరిక సిద్ధించునట్లు వరమిచ్చుచున్నాను. ఇది అత్యంత రహస్యముగాబట్టి ఈ సంగతి ఇతరులకు తెలిసిన హానికరము. రాజా ! ఇందులో నీవు ఇంకొక్క విషయము గుర్తించుకొన వలసియున్నది. అదియేమన— ఒక్క బ్రాహ్మణ శక్తి తప్ప ఆ హరిహర బ్రహ్మాదులు కూడ నా వరము నిష్ఫలము చేయజాలరు. కాబట్టి నీవు ఈ నాటి నుండీ భూసురోత్తముల కోపము నకు గురి కాకుండా మెలగవలసి యుండును." అని సెలవిచ్చెను.

భూపాలుడు ముని విధించిన తుది నియమమున కత్యంత వికలుడై ఇట్లు ప్రార్థింపదొడగెను— "స్వామీ ! మీరను గ్రహించి వర ప్రదానము చేసినందుకు నేనత్యంత కృతజ్ఞుడను. కానీ మీరు నుడివినట్లు బ్రాహ్మణులను యెంత కాలముని ప్రసన్నులను చేయగలనా యను సందేహము నన్ను కలత బెట్టుచున్నది. ఇందుకేదైనా ఉపాయమున్న తమరే సెలవిచ్చి నన్నుద్ధరింప వలసినది."

"రాజా ! అందుకు మార్గాంతరములేక పోలేదు. నే చెప్పినట్లు చేసిన యెడల భూసురులు నీయెడల సర్వదా సుముఖులై యుండగలరు. నేను మీ ఇంట నుండి వంటలు చేసెదను. నాచే వండిన వంటకములు తినినయెడల బ్రాహ్మణులు మీ కవశ్యము వశ్యులగుదురు. అయితే నేను ప్రకటముగ రాచనగరుకు వచ్చి యుండుటకు వలను పడదు. ఇందుకు నైతమొక ఉపాయము ఆలోచించితిని. నేను నాతపోబలముచే మీ పురోహితుని బంధించి తెచ్చి ఇక్కడ ఉంచెదను. నేను అతని వేషముతో వచ్చి మీ ఇంట ఒక సంవత్సరకాలముండగలను. మీరు నిత్యము బ్రాహ్మణ సంతర్పణ చేయుచుండ వలసినది." అని దొంగసాధువు చెప్పగా విని రాజు సంతోషించి అతనిని పలువిధముల ప్రస్తుతించెను. ఆ పైన ముని రాజు నవలోకించి "రాజా ! అర్ధరాత్రి కావచ్చుచున్నది. ఇకనీవు వెళ్ళి శయనింపుము. రేపు ఉదయాత్పూర్వమే నిన్ను నీ గుర్రముతో సహా నా తపశ్శక్తిచే రాచనగరు చేర్పించెదను." అని చెప్పెను. అంతట రాజు మౌనికి ముమ్మారు సాష్టాంగపడి అతని వద్ద సెలవు పుచ్చుకొని వెళ్ళి పండుకొనెను. మేను వాల్చినదే తడవుగా రాజుకు గాఢనిద్ర పట్టెను.

రాజుకు నిద్రపట్టగనే కాలకేతుడను రాక్షసుడు దొంగ సాధువు వద్దకు వచ్చెను. ఈ కాలకేతుడే పందివలె నటించి ప్రతాపభానుని ఇంత దూరము వచ్చునట్లు చేసి పిమ్మట అదృశ్యుడై యుండినది.

ఈ కాలకేతునికి నూర్గురు పుత్రులు పది మంది సోదరులు ఉండిరి. వారు బలదర్పములతో కూడిన పరమ దుర్మార్గులు. ఆ దుష్టులు నిత్యము వేల్పులను వేధించుచున్నందున వారిని ప్రతాపభానుడు వధించి యుండెను. ఆ పైన కాలకేతుడు ప్రతాపభానునిపై పగ తీర్చుకొనుటకై కపట మునితో చేతులు కలిపి కుట్ర బన్నెను.

కపట ముని సాకల్యముగా జరిగినదంతయూ విని కాలకేతుడిట్లనెను. "రాజా ! ఆలస్యం అమృతం విషం. శత్రు నాశనమునకు జాగు చేయుట మంచిదికాదు. శత్రువంశమును సులభముగా క్షయింప జేయుటకు నీవు పన్నిన పన్నాగము బాగనే యున్నది. అందుకింత వ్యవధి కావలెనా ! నేను నాల్గు దినములలో శత్రువును మట్టుపెట్టి వచ్చెదను. నీవు నిశ్చింతగా యుండుము. అంతయు నేను చూసుకొనెదను."

అని చెప్పి కాలకేతుడు ప్రతాపభానుడు నిద్రించుచున్న చోటికి వచ్చెను. అతడు తన మాయా బలముచే నిద్రించుచున్న రాజును అతని గుర్రమును తీసుకపోయి రాజాంతఃపురములో యెవరికి తెలియకుండునట్లు వదలి పెట్టెను. పిమ్మట రాజ పురోహితుని దొంగలించి అతని స్థానములో కాలకేతుడే పురోహితునివలె నటించ సాగెను.

మరుదినము కపటముని సెలవిచ్చి యుండిన ప్రకారము రాజు లక్ష బ్రాహ్మణులకు సమారాధన చేయుటకై సర్వము సిద్ధము చేయించెను. వేళకు భూసురోత్తము లందరు భోజనమునకై పంక్తులు దీరి కూర్చుండిరి.

పురోహితుని ఆదేశ ప్రకారము వివిధ మాంసాదులతో వండిన వంటకము లన్నియూ వడ్డించబడెను. బ్రాహ్మణులు భుజించుటకు ప్రారంభించుచుండ, ఇంతలో కాలకేతుని పూర్వ సంకేత ప్రకారము పై నుండి "ఓ భూసురులారా ! ఆ పదార్థములు ముట్టుకోవలదు. మీకు వడ్డించబడిన పలలాదు లందు బ్రాహ్మణ మాంసము కలుపబడి యున్నది." అని ఆకాశవాణి ధ్వనించెను.

ఈ మాటలు వినిన బడగనే తటాలున బ్రాహ్మణులు విస్తళ్ళు వదలి, దిగ్గున పైకి లేచి, కోపోద్రిక్తులై రాజునుద్దేశించి—

"ఓరీ రాజాధమా ! సతీ సుత బంధు సమేతముగ నీ వంశము ఒక్క సంవత్సరములోపు నిర్వంశమై రాక్షసకులమున ఉద్భవించుగాక," అని దారుణముగ శపించిరి. ఇంతలో "రాజును శపించుట పొరబాటు, అతడు నిరపరాధి, మీరు పొరబడితిరి" అని ఆకాశవాణి పలికెను.

'ఇక గతించిన దానికి వగచి లాభము లేదు. బ్రాహ్మణ శాపము బ్రహ్మకైనా అనుభవించి తీరవలసినదే.' ఇక దానికి తిరుగు లేదని విచారించుచూ బ్రాహ్మణులు ఎచ్చటి వారచ్చటకు వెళ్ళి పోయిరి.

అనంతరము ధూర్తుడగు కపటముని ప్రతాపభానునికి సంబంధించిన విపత్తు వార్తను చిటికెలలో నలుదెసలకు తెలియజేసెను. నలువైపుల నుండీ శత్రురాజులు దండెత్తివచ్చి ప్రతాపభానుని నగరమును ఘోరముగ ముట్టడించిరి. ఆ యుద్ధములో ప్రతాపభానుని వంశమంతయూ నశించి అంతరించెను. (సశేషం)



పలకడానికి సూర్యుడు ఆకాశంలోకి నేరుగా వచ్చాడు. అతడు రాకముందే కోళ్ళు లేచి 'క్కొక్కొరోకో' అన్నాయి. ఆ తరవాత ఫ్యాక్టరీ సైరన్ విస్పష్టంగా కూసింది.

కూలీలంతా మామూలు తేనెటీగల్లాగ పనిలోకి బయల్దేరారు. రాము అందరిలాగే మామూలు కూలీ. ఫ్యాక్టరీలో పనిచేస్తూ రెక్కల కష్టం

## తిరిగివచ్చిన కథ

15 వ పేజీ తరువాయి

మీద బ్రతికే కష్టజీవి. అతని ఆశయాలు, ఆవేశాలు, మునిసిపాలిటీవాళ్ళు రోడ్డుపక్క వేసి వదిలేసిన కంకరగుట్టలా చెదిరిపోయినా, సంస్కారం, సహృదయతా,—వేశ్యకి పెద్దమనుమ లిచ్చిన పెద్దరోగాల్లా నిలిచిపోయాయి.

అతను అన్యాయంగా డబ్బు సంపాదించలేకపోయినా, కష్టాలన్నీ ధైర్యంగా ఎదుర్కొని నిలబడే సాహసం సంపాదించాడు. ఇదిగాక నలుగుర్నీ ఆకర్షించే రూపం, నలుగురిచేత ఔననిపించుకునే నేర్పు ఉన్నవాడు. మనుష్యు లందరూ ఒకటేనని, అందరిలోనూ 'ఎర్ర' రక్తమే ప్రవహిస్తోందని,

ఆఖరికి సర్పాన్ని చంపినా అదే రక్తం వస్తుందని అతని నమ్మకం. అందుకనే అతనే వాళ్ళ ఫ్యాక్టరీ కార్మిక సంఘానికి నాయకుడు.

ఇలా ఉండగా—అవసరం తీరాక, అంతవరకూ పెళ్ళి చేసుకుంటానన్న అమ్మాయిని "నువ్వెవరు?" అనడిగిన కాలేజీ అబ్బాయిలాగ ఆ ఫ్యాక్టరీ మేనేజ్మెంట్‌వాళ్ళు—రావలసిన బోనస్ ఇమ్మని అడిగిన కూలీలని 'రిట్రెంచ్‌మెంట్' పేరుతో పనిలోంచి తీసేశారు. ఆ సమస్యని ఎదుర్కోడానికి ఒకటే మార్గం. సమ్మె చేస్తామని నోటీసిచ్చి చూసారు. కాని లాభం లేకపోయింది.

మాటలతో లాభంలేక కూలీలంతా సమ్మె ప్రారంభించారు. సమ్మె ముమ్మరంగా సాగుతోంది. రాము ముందుండి సారథ్యం వహిస్తున్నాడు ఫ్యాక్టరీ యజమాని పెద్ద కారులో వచ్చి కూలీలని చిన్నచూపు చూసి లోపలికి వెళ్ళిపోయాడు

దిక్కులేని ముష్టివాళ్ళ మీదికి అల్సేషియన్ కుక్కలని వదిలిపెట్టే జమీందారులా—ఫ్యాక్టరీ యజమాని, తాను పీర్చి పిప్పిచెయ్యగా మిగిలిన శల్యాలలాంటి ఆ కార్మికుల మీదికి దున్నపోతుల్లాంటి రౌడీలని ఉసిగొల్పాడు.

రాముకి తలమీద పెద్ద గాయం తగిలి పడిపోగానే—గుంపులో ఒక కొంగ తుపాకీ దెబ్బ తినగానే మిగిలిన కొంగలు పారిపోయినట్టు మిగిలిన కూలీలు చెల్లాచెదురై పోయారు.

రాము మాత్రం దిక్కులేకుండా అక్కడే స్పృహతప్పి పడివున్నాడు. ఇంతలో ఒక చిన్న కారులో యజమాని కూతురు సీతాలక్ష్మి అక్కడకు వచ్చి, జరిగిన దారుణం చూసి, తన తండ్రి చేసిన పనికి చాలా సిగ్గుపడింది. దెబ్బ తగిలి పడివున్న ఉన్న రాము దగ్గరికి వచ్చి సపర్యలు చేసింది. నీళ్ళు కలపని పాలులా అరుదైన ఆమె సహృదయానికి జోహార్లర్పించాడు రాము. పబ్లిక్ సెక్టర్లో ఉన్న లాభాలొచ్చే వ్యాపారంలా అంతగంటే అరుదైన అతని సంస్కారానికి అంజలి ఘటించింది సీతాలక్ష్మి. వారిద్దరిమధ్య అనురాగం అంకురించింది. దూరంగా ఉన్న తాడిచెట్టూ పక్కనే ఉన్న ఈతచెట్టూ ప్రకృతికి విరుద్ధంగా కలిసి ఉత్రూత లూగాయి. అంతస్థుల భేదా విస్మరించి వారిద్దరూ ఆదర్శప్రాయంగా దంపతులయ్యారు. సన్మార్గుడని సన్మానం చేయించుకోడానికి సారా దుకాణం ఎత్తేసిన అప్పలస్వామిలా ఫ్యాక్టరీ యజమాని మనస్సు మారి మంచివాడయ్యాడు. మరో ప్రపంచంలోలా కూలీలంతా సుఖజీవనం సాగించారు. *

ఇంత విప్లవాత్మకమైన గాథ (గాథ కాదు ఇది —బీద ప్రజల బాధ) నేను నా అడ్రసు రాయక పోయినా తిరిగి వచ్చేసింది. నేనే రాసానని పత్రిక వాళ్ళకి ఎలా తెలిసిందో మరి కవరు కూడా చింపి చూడలేదు వాళ్ళు.

అయినా నేను నిరుత్సాహ పడలేదు. ఇంతలో మా పక్క వాటాలో ఉన్న 'భారశ్రీ' కి పోటీ కథల్లో ప్రైజు వచ్చిందని తెలిసి ఆయన దగ్గరికి పట్టుకెళ్ళాను నా కథని.

నేను వెళ్ళేసరికి అతను పడక కుర్చీలో పడుకుని వ్యూహాలోకంలో ఉన్నాడు. ఉన్నట్టుండి అతని కళ్లంట నీళ్ళు కారడం ప్రారంభించాయి. భారంగా లేచి కళ్ళు తుడుచుకున్నాడు.

"బ్రతుకు ముళ్ళబాట .... దేవుడు, అందరూ తనని జ్ఞాపకం ఉంచుకోడానికి అందరికీ రకరకాల కష్టాలు కలిగిస్తూ ఉంటాడు" అన్నాడు భారశ్రీ హృదయ విదారకంగా.

అవుననిపించింది నాకు.

"కష్టంలో ఉన్నవాడికి సానుభూతి చూపించడమే మానవత్వం" అన్నాడు భారశ్రీ భారంగా.

కాబోలనుకున్నాను.

అంతే! ఆయన నా కథ చదవలేదు. 'కథ' అంటే ఎలా ఉండాలో ఆయనే చెప్పడం ప్రారంభించాడు.

"ఒక పాత్రని సృష్టించి, అనేక కష్టాలు కల్పించి—ఆ పాత్రకి పాఠకుల సానుభూతి కలుగ చెయ్యాలి. కథ చివరిదాకా బలమైన సెంటిమెంటు

---

రావు, లంచ్ టైములో టిఫిన్ కారియర్ తెరిచి, "ఛీ! పెరుగూ అన్నం!" అన్నాడు. మర్నాడూ అలాగే అన్నాడు. మూడవ రోజు బాగా విసుగుగా "మళ్ళీ పెరుగూ అన్నమే!" అన్నాడు. నాలుగవనాడు "ఇవాళకూడా.." అంటూవుంటే పక్కనే కూర్చున్న రాజు, "నీ కంత ఇష్టం లేకపోతే మీ ఆవిడతో పెరుగూఅన్నంపెట్టియివ్వద్దను!" అన్నాడు.

"ఆవిడెవరు? నాకు పెళ్ళి కాలేదు. నేనే వంటకూడా," అన్నాడు రావు.

కె. వి. ఎస్. (చీరాల)

---

ఉండాలి. కథ అంతంలో పాఠకుల సానుభూతిని పొందిన పాత్ర చచ్చిపోవాలి" అని మంత్రోపదేశం చేసాడు.

నేను ఇంటికొచ్చి కథని మార్చి రాసాను.

## *భారప్రేమ

కలెక్టరాఫీసులో లోవర్ డివిజన్ క్లార్కు రామారావు తన పాత సైకిల్ వేసుకుని ఆఫీసు నుంచి ఆరింటికి తిరిగి వస్తున్నాడు ఇంటికి. దారిలో బజార్లో ఆగి తన భార్య సీతకి ఇష్టమైన మల్లెపువ్వులు కొనుక్కుని మళ్ళీ సైకిలెక్కాడు. సైకిల్ చక్రం గిరగిర ముందుకు తిరుగుతోంది. రామారావు మనసులో కాలచక్రం వెనక్కి తిరిగింది.

రామారావు పుట్టినప్పుడే తల్లిని పోగొట్టుకున్నాడు. కాని, అందరూ 'పొట్టని పెట్టుకున్నాడం' టారు. మరో ఆర్నెళ్లకి తండ్రి కూడా పోయాడు. అప్పట్నించీ రామారావు మేనమామ గారింట్లో పెరిగాడు. మేనమామకి అప్పట్లో పిల్లలు లేరు. కాబట్టి రామారావుకి ఐదేళ్లవాడయ్యేవరకు గారాబంగానే పెరిగాడు.

తరవాత మేనమామకి లేకలేక ఒక కూతురు పుట్టింది. అప్పట్నించీ రామారావు నిర్లక్ష్యం చెయ్యబడ్డాడు. సీతని అపురూపంగా పెంచాడు మేనమామ.

రామారావు అదే ఇంట్లో మరో పదేళ్ళు దిక్కులేనివాడిలా పెరిగాడు. అదే వయస్సులో రామారావు స్కూలుఫైనల్‌లో ఫస్టుగా వచ్చాడు. కాని మేనమామ పై చదువులు చదివించలేదు. ఏదో గుమాస్తా ఉద్యోగం చూపించి తన దారి తనని చూసుకోమన్నాడు.

మేనమామ ఇంట్లో తనకి స్థానంలేకపోయినా, సీత హృదయంలో రామారావుకే స్థానం ఉంది. సీత బావనే పెళ్ళి చేసుకుంటాలనని పట్టుపట్టింది మేనమామ వీల్లేదన్నాడు. సీత సుఖపడాలంటే ఎవరైనా ధనవంతుల అబ్బాయిని పెళ్ళిచేసుకోవాలన్నాడు.

అవును. నిజమే. సీత సుఖపడాలి. తను ప్రేమించినవారి సుఖాన్ని కోరినప్పుడే అది నిజమైన ప్రేమ తను సీతని సుఖపెట్టలేకపోవచ్చు అందుకనే రామారావు సీతని మర్చిపోడానికి ప్రయత్నించాడు. కానీ సీత తల్లిదండ్రుల్ని సంఘాన్ని ఎదిరించి వచ్చి రామారావు బావనే శరణు కోరింది.

సీతా రామారావులు ఒక ఇంటివారయ్యారు. రామారావు సీతని సుఖపెట్టడానికి సకల ప్రయత్నాలు ఆరంభించాడు. సాయంత్రం ప్రయివేట్లు చెప్పి కొంత డబ్బు అదనంగా సంపాదిస్తున్నాడు. ప్రయివేట్‌గా బియ్యే ప్యాసయ్యాడు. ప్రమోషన్ కూడా సంపాదించాడు. ఆరోజే ప్రమోషన్ కాగితం వచ్చింది.

ఆరోజు పర్వదినం. సరిగ్గా క్రిందటి సంవత్సరం అదేరోజున సీతని తను వివాహం చేసుకున్నాడు. ఇంటికి వెళ్ళగానే ప్రమోషన్ సంగతి చెప్పి ఆమె కిష్టమైన మల్లెపువ్వులు ఇస్తే ఎంత సంతోషిస్తుందో అందుకనే రామారావు సైకిల్ వేగం హెచ్చించాడు.

రామారావు తన ఆనంద తన్మయత్వంనుండి తేరుకునేలోగా ఎదురుగా ఒక లారీ శరవేగంతో వచ్చేసింది. రామారావు పాత సైకిల్ బ్రేక్ పడలేదు. నాటు సారా కైపులో ఉన్న లారీ డ్రైవర్ బ్రేక్ వెయ్యలేదు. పర్యవసానం—రామారావు మరిక లేడు. సీత కుంకుమ చెరగిపోయింది. మల్లెపువ్వులు రామారావుతోపాటే లారీ చక్రాల క్రింద నలిగిపోయాయి. ప్రమోషన్ కాగితం రోడ్డు మీద గాలిలో ఎగిరిపోయింది. *

ఇంత భారమైన ట్రాజెడీ, నేను కవర్‌మీద—నా ఎడ్రసే రాయడం మూలాన నాకే తిరిగి వచ్చేసింది. నామీద నాకే జాలివేసింది.

ఏమైతే అయిందని, ఈ కథలన్నీ కలిపి కథగా పంపిస్తున్నాను.

ఇది తిరిగి పంపిస్తే- ఆత్మహత్య చేసుకుంటానని, నామీద ఒట్టేనని కూడ రాసాను. ఏ కానుందో మరి!!!

వీరాజీ

## జరిగిన కథ

సురేఖను భాస్కరానికీ భాస్కరాన్ని సురేఖకు పరిచయం చేస్తుంది, పద్మావతి. భాస్కరం సవతి తల్లి జానకమ్మగారు అతన్ని కన్నబిడ్డ కంటె ఎక్కువగా ప్రేమిస్తుంది. భాస్కరానికీ, కూతురు వసంతకూ ఒకేసారి వివాహం చేయాలని ఆమె ఆరాట పడుతుంది. తత్ఫలితంగా భాస్కరాన్ని పెళ్ళిచూపులకు బలవంతంగా ఒప్పించి తీసుకెళ్తుంది. పెళ్ళికూతురు సురేఖ అని తెలియగానే భాస్కరం మనస్సులో కల్లోలం చెలరేగుతుంది. సురేఖ దొడ్డమ్మ అయిన ధనమ్మకు మాత్రం భాస్కరంలో అన్నీ మంచి గుణాలే కన్పించి ఎలాగైనా భాస్కరాన్ని తన అల్లుడుగా చేసుకోవాలని పట్టుదల పెరుగుతుంది. భాస్కరం పద్మావతిని ప్రేమించడం నిజమా, కాదా అనే సందేహం కూడా సురేఖకి కలుగుతుంది. ధనమ్మకు దూరపు బంధువు ముకుందరావును వసంతకు ఇచ్చేటట్లు కూడా అప్పుడే ఏర్పాటు జరుగుతుంది. తను సురేఖను వద్దంటే ధనమ్మ తన కూతురుకే ముకుందరావును ఇచ్చి చేస్తానంటోంది. చెల్లెలి సంబంధం తన మూలంగా చెడిపోతుందని భాస్కరం; ముకుందరావుని వివాహం చేసుకుందామని కల్లో కూడా అనుకోని సురేఖకు తను భాస్కరాన్ని వద్దంటే ధనమ్మ తనను ముకుందరావు కిచ్చి చేస్తుందేమో అన్న భయంతో సురేఖా ఎటూ మాట్లాడలేకపోతారు. చివరకి భాస్కరం తన పెళ్ళి ఏడాది వాయిదా వేస్తాడు. ఇంతలో యూనివర్సిటీ తెరుస్తారు. సురేఖ, పద్మ యిద్దరూ ఎం. ఏ లో చేర్తారు. భాస్కరం కూడా ఫైనలియర్ పూర్తి చేయటానికి వస్తాడు. సురేఖ అంతా చెప్పేఉంటుందని భాస్కరం అనుకొని పద్మతో ఏమీ చెప్పలేకపోతాడు. ఎగ్జిబిషన్‌లో కూడా పద్మావతిని కల్సుకొని ఎలాగైనా జరిగింది చెప్పాలని చాలా ప్రయత్నించాడు. భాస్కరం. కాని చెప్పలేక పోయాడు. వసంత పెళ్ళి జరుగుతోంది. అక్కడ సురేఖను ధనమ్మగారు జానకమ్మగారి కోడలు అని చెప్తుంది పద్మావతి హతాశయై వెళ్ళిపోతుంది. మనస్సులోని చికాకువలన సురేఖకు సుస్తీ చేస్తుంది. పద్మావతికి ఆమె వరస అన్న రాజా వేరే సంబంధాలు చూస్తుంటాడు. భాస్కరం సురేఖను వద్దని పిన్నితో చెప్పేస్తాడు.

## 47

పద్మావతికి విశ్వ విద్యాలయ ఆవరణమంతా విచిత్రంగా తోచింది. సురేఖ క్లాసులకి రాలేదు. భాస్కరం అగుపించలేదు. సైన్సు కళాశాల వైపు చూస్తూ చూస్తూ కళ్ళు పీకిపోయాయి. రక రకాలుగా వెలితి, శంక, భయం పీడించసాగాయి. ఇంటికి పోదామనిపించింది. చదువుకోసం వస్తున్న వారందరి మధ్య తా వొక్కతే దాని విషయం పట్టించుకోకుండా కూచున్నానే అన్న బాధ కలిగింది.

"అమ్మకి నే నిలా చదువు నీళ్ళగార పెడుతున్నా నని తెలిస్తే ఎలా?" అనుకోగానే పద్మావతి గుండెలు దడదడ లాడాయి. పాఠాలే చెప్పారో... పోట్సులే చెప్పారో తెలియదు. క్లాసులన్నీ, రైల్లో కూచుని కిటికీలోనించి బయటికి చూడని వాడికి కుదుపు తప్ప మరేం తెలియనట్లుగా అయిపోయాయి పద్మావతికి.

తిన్నగా ఇంటికి వెళ్ళింది. జయమ్మ ఈమెకు కాఫీ ఇచ్చి "అమ్మాయీ! రాజా ఏ విషయం చాలా శ్రద్ధ వహిస్తున్నాడు సుమా" అన్నది.

"ఈ రాజా అన్నయ్యేకదూ వెనకటికి విస్సా, విస్సా దిక్కుమాలిన వాళ్ళనిగా చేసి తీరుతానని శపథం చేశాడూ" పద్మావతి వెటకారం చేసింది.

"వెనకటివి తవ్వుకుని వెక్కి వెక్కి ఏడవ కూడదు! కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుందమ్మ, ఇలాంటివి మనం మరిచిపోవాలి!" అన్న దామె.

"అదిగాక మనకి మగ దిక్కెవరున్నా రమ్మాయ్! నీకు ఒక చక్కని సమ్మంధం తేవాలి అంటే సవితి అన్న దమ్ములే అయినా, అప్పులే అయినా వాళ్ళే కదా?"

పద్మావతికి కోపం, దుఃఖమూ రెండూ వచ్చాయి. "అసలు ఇప్పుడు నీకు నేను అంత బరువైపోయా నా? ఎందుకూ సమ్మంధాలు?"

"ఇస్సు! ఏమిటా కేకలు! ఎవరేనా వింటే ఈడొచ్చిన పిల్లవు నవ్విపోగలరు......" జయమ్మగారు గద్దించింది. మళ్ళీ బాధగా అన్నది.

"నాకు నువ్వు బరువా తల్లీ? ఏ చెట్టుకాయ ఆ చెట్టుకి బరువా? కాని ఆడపిల్లకి ఈడొచ్చాకా వివాహమూ, మగవాడికి ఏయుస్సు రాంగానే ఉద్యోగమూ శోభ నిస్తాయమ్మా!" కూతురు తల విసిరిందామె.

"కాని నాకు ఇప్పుడు పెళ్ళి చేసుకోవాలని లేదమ్మా!" అటు మొహం తిప్పుకుంది పద్మావతి.

"నేను బాగా ఆలోచించాను పద్మావతీ!" జయమ్మగారు కూతురి ఈ పెడసరమైన జవాబుకు కొంత నొచ్చుకున్నట్లు చెప్పింది. "నీవు నన్ను పోషించి తీరాలి అనే మాట అర్థం లేనిది!..... నీ ఇల్లు వేరు......నీ బ్రతుకువేరు..... "ఆది" న నేను మా అమ్మను, నాన్నగారిని ఏ మాత్రం పోషించాను......? ఆఖరికి ఆ ఇద్దరూ ఇవాళ స్వర్గాన ఉండి కూడా నన్ను కనికరించ లేనంత నేరం చేశాను... అంచేత నువ్వైనా పెళ్ళి చేసుకుని ముచ్చటగా ఒక నాలుగు కాలాలపాటు ఉంటే చూసి కను మూస్తాను......" ఆమె నిట్టూర్చింది.

"ఐతే ఈ ఏమ్మే చదువుకు స్వస్తి చెప్పాలనేగా మీ ఉద్దేశం?"

జయమ్మగారు చాలాసేపు ఏమీ సమాధానం చెప్పలేదు. "సలక్షణమైన సమ్మంధాలు మనం కావాలనుకున్నప్పుడు వస్తాయా? అమ్మాయీ!" అన్నది.

"వస్తాయి" అప్రయత్నంగా అన్నది పద్మావతి.

"అసలు నువ్వు మీ అన్నయ్య చూపించిన ఆ సమ్మంధం చూడకుండానే ఎందుకు ఇలా విముఖత చూపుతున్నావో నాకే తెలీదు?......" ఆమె నిలదీసింది.

"అది కాదమ్మా! నాకు 'ఏమ్మే' అవ్వాలనుంది."

"చదివి?"

"ఉద్యోగం చెయ్యాలనుంది"

"చేసి?"

పద్మావతి కొరకొరా చూసింది. మాటాడలేదు.

"చేసి ఈ ముసలి ప్రాణాన్ని పోషిస్తావు అంతేగా" జయమ్మగా రడిగింది.

"ఊహూ......మగవాళ్ళ అహమంతా వాళ్ళ పోషణకు, రక్షణకు ఆడవాళ్ళు ఉవ్విళ్ళూరుతారు" అన్నదేగదా! దాన్ని అణగ కొట్టేస్తాను" అనే శంగా అని మళ్ళీ సిగ్గుతో తలదించుకుంది పద్మావతి.

నవ్వింది జయమ్మగారు. "బాగానే ఉంది చదువు" అన్నది! అని మళ్ళీ "మగవాడి అహాన్ని ఎవరూ అణచలేరే పిచ్చితల్లీ —మగవాడు నవ మాసాలు మోసి బిడ్డలను కనడు......ఆడదాన్ని ప్రకృతి ఈ విధంగా అణగ ద్రొక్కేసింది. ప్రకృతికి లొంగిపోదం

మనకు ఈ దేశంలో అలవాటై పోయింది!—"

పద్మావతి ఏం మాట్లాడలేదు.

జయమ్మగారు కూడా కూతురి విముఖతకు కారణం ఆలోచిస్తున్నట్లు పరధ్యానంగా పనులు చూసుకో సాగింది.

* * *

పద్మావతి పుస్తకం చేతుల్లో తీసుకుని ఆలోచిస్తున్నది. "అమ్మ అన్నట్లు ఉద్యోగం చేసి.... ఉద్యోగం చేశాక కూడా తాను ఇంకొకర్ని పెళ్లాడాలిగా....."

"అసలు భాస్కరంగారిని ఇక తాను ఈజన్మలో... తాను ఈ జన్మలో......" ఆ పిల్లకి దుఃఖం వచ్చింది జయమ్మగారు ప్రతిపత్తికీ పరువు ప్రతిష్ఠలకూ ప్రాకులాడుతున్నది. ఆమె ఒకనాడు చేసిన సాహసానికి ఇవాళ ముప్పై సంవత్సరాల తరాత్వ కూడా నేరంగా పరిగణిస్తారేమోనని భయపడతున్న దామె. పద్మావతి తల్లి ఆవేదన గ్రహించు లేనంత చంటిపిల్లకాదు. కాని? కాని?......

"ఈ అంతస్తులు వాటికోసం పాకులాట! ఈపరువు ప్రతిష్ఠలు, సంఘ స్థాయీ వీటికై తహతహ ఎందుకూ? ఇవి లేకపోతేనేం?" అనుకున్నది. "ఇవన్నీలేని ఒక సమాజంవస్తే బాగుణ్ను....." పద్మావతికి నవ్వొచ్చింది. "ఎలా వస్తుంది? ఆర్థిక వ్యత్యాసాలులేని సమాజం రాదు. సంప్రదాయాలు సంపర్కాలు వీటి హయాం పోయినా, అంతస్తుల తేడా మనుష్యులను ఎడం చేస్తుంది తప్పదు......" అనుకుంది.

వాస్తవానికి తనకూ భాస్కరానికి తేడా ఏమిటి? ఎక్కడవుంది?

ఈ వూహ తట్టడంతోనే ఆ పిల్ల బుద్ధి చురుకుగా పని జేసింది. ప్రేమ, ప్రణయం వీటన్నింటికీ పట్టి పగ్గంవేయగల బంధనం ఏదో తెలిసిపోయింది.

"తన తల్లి చరిత్రయే బహుశా భాస్కరంగారి ఈ విముఖతకు కారణం" అన్న మాట అనుకుంది.

ఈ ఆలోచన రావడంతో కుమిలిపోయింది. పద్మావతి. "ఛీ" అని తనను తానే అసహ్యించుకుంది. తనకూ సురేఖకూ తన తల్లికీ సురేఖ "పెంపుడు తల్లి" ధనమ్మకీ గల వ్యత్యాసం ఎక్కడా?

ఈ ఆలోచనలతో పద్మావతికి ఎవరో కళ్లు తెరిపించినట్లైంది. అవమాన భారంతో క్రుంగిపోయింది.

జయమ్మగారు "అమ్మాయీ! ఆలోచించకులే! స్నానం చెయ్యి! అన్నింటికీ దైవమే ఉన్నాడు" అన్నది.

"పాడు దైవం ఉన్నాడా?"ని పద్మావతి పుస్తకం అవతల పడేసి లేచింది.

"చూడు పద్మా! మనకి సమాజంలో ఒక పరువైన ఉనికి కావాలీ అంటే రాజా, పార్వతీ, సుబ్రమణ్యం అనే నీ ముగ్గురు సవతి తోబుట్టువుల అండ దండలూ కావాలి.......రాజా నిన్ను, నన్నూ గౌరవించడానికీ, పదిమందిలో మనం తల ఎత్తుకోడానికీ సమ్మంధమున్నదమ్మా!" కూతురు జెడ విప్పి స్వయంగా నూనె రాస్తూ చెప్పిం దామె.

"పోనీ ఇలాంటి సమ్మంధాలు, గౌరవాలూ అక్కర్లేని సమాజంలో కలిసిపోదామమ్మా మనం?" పద్మావతి అడిగింది.

"అటువంటి వరుడు ఎవరు పద్మావతీ మనకి?"

పద్మావతికి దుఃఖ మొచ్చింది. ఇదే ఐదారు నెలల క్రితం అయితే "భాస్కరంగారు అని ఒకాయన ఉన్నారమ్మా" అని చెప్పేది. కాని ఇవాళ....



# ప్రేమకు పగ్గాలు

ఇవాళ "లేదమ్మా! అలాంటి బుద్ధిహీనుడు బహుశా రాజన్నయ్యకే దొరుకుతాడేమో'' నన్నది బాధగా.

జయమ్మగా రడిగింది. "చూడమ్మా! నాకు నువ్వూ, నీకు నేనూ స్నేహితులమైనా బంధువుల మైనా, ఎవరమైనా ఇద్దరమే......నాకు ఒక చరిత్ర ఉంది—లేచిపోయినదాన్ని అని— నీకు ఒక చరిత్ర ఉంది. అదే నా కూతురువు అని ..... ఈ చరిత్రకు నీ తండ్రి తృణీకరించి విలువ తల్లి తరఫు వించి ఏహ్యతా వస్తాయమ్మా!''

పద్మావతి మాటాడలేదు కాస్సేపు.

"ప్రేమకు అర్థం, విలువ ఉండదా? అమ్మా?'' అన్నది బరువుగా నిట్టూర్చి.

జయమ్మగారు నవ్వింది పొడిగా......"నీ పిల్లలకి నువ్వీ ప్రశ్నకు ఏ సమాధానం ఎలా చెప్తావో బతికుంటే చూడాలనుందమ్మాయ్?'' అన్నది.

పద్మావతి విస్తుబోయింది.

జయమ్మగా రన్నది. "నిన్ను ప్రేమించిన వాడు నీ తల్లిని గౌరవించగలడనే నమ్మకముందా?''

జయమ్మగారు కూతురు రహస్యం కనుక్కోడమే కాదు. దానికి ఒక నవాలు విసిరి మరీ లేచి వెళ్ళి పోయింది వంట ఇంట్లోకి. ఆమె కన్నీరు ఒత్తుకున్న సంగతి దేవుడి పటానికి మాత్రమే తెలుసు!

పద్మావతి నీళ్ళు పోసుకుంటూనే ఉన్నది. బుర్ర వేడెక్కుతూనే ఉన్నది. "నన్ను ప్రేమించినవాడు, నన్ను ప్రేమించిన వాడు, నా తల్లిని నా తల్లిని గౌరవం గౌరవం.......'' అదే ఆవేదన.

"భాస్కరం తనను కాదని సురేఖ వేపు మొగ్గు చూపడాని క్కారణం ఏమిటి?—''

పద్మావతికి గుండెల్లో కెలుక్కుమంది. "ఛీ! ఇన్నాళ్ళు తనను భాస్కరం అవమానం చేశాడు....'' అనుకుంది. "ప్రేమించలేదు. అవమానం చేశాడు ప్రేమించలేదు అవమానించాడు.''

"అంతే — ఇక ఋణం తీరిపోయింది. మా అమ్మను పూజించగలవాడే, అమ్మను గౌరవించ గలవాడే వాడెవడవనీ నాకు భర్త'' అనుకుంది.

ఆ రాత్రంతా ఏడ్చిందికాని భాస్కరంమీద ఇంకా ఆశ వదులుకోలేక పోయింది.

రాజా తెచ్చిన సమ్మంధం కాదూ అంటే తన తల్లిని రాజా అతని కుటుంబమూ తిరిగి వెలి వేస్తారు. ఈ సంగతి పద్మావతికి తెలును.

జయమ్మగారు ఎన్నో సార్లు అన్నది కూడా. "ఆ మహానుభావుడు నీ తండ్రి నూతులో పడుతున్నదాన్ని నన్ను రక్షించాడుకాని అతని పిల్లలు మీరు నువ్వే అవనీ, మీ నవతి అన్నలే అవనీ నన్ను దిక్కుమాలిన చావు చంపుతారేమో'' నని.

"ఛీ! నేను అలా చెయ్యనమ్మా! నేను నేను నీ కోసమేనమ్మా బతుకుతానూ'' — పద్మావతి హృదయం ఆక్రోశించింది.

## 48

జానికమ్మగారు కొడుకు తిరుగుబాటును తట్టుకోలేక పోయింది. "వాడు ఇంత వాడైపోక మునుపే నేను చచ్చిపోయినా బాగుణ్ను'' అన్నది వసంతతో.

వసంత చాలా ఎదిగి పోయింది.

"ఛీ! ఏం మాటలుఅమ్మా అవి ? అన్నయ్య వింటే ఏడుస్తాడూ'' అన్నది.

"ఏడుస్తాడంటావా ?''

"చచ్చిపోతాడు కూడా'' నంది వసంత స్పష్టంగా

"ఛీ! నోర్మూయ్ !'' ఆ పిల్ల నోరుమూసింది. జానికమ్మగారు.

"నిన్ను అత్తగారింటికి పంపేస్తాను— అనక సురేఖ ఈ ఇంట కొత్తదీపంలా మసలుతూ ఉంటుందనుకున్నాను'' ఆవిడ బాధగా చెప్పింది.

"సురేఖ కాకపోతే మరో అమ్మాయి కాకూడదా? అమ్మా !'' వసంత భయం భయంగా అన్నది.

"ఎందుకవ్వాలి ?''

"మరి అన్నయ్యకు ంది ఇష్టంలేదుగా...."

"ఆ సంగతి ముందే చెప్పకూడదూ.... ఇప్పుడు మన పరువు బజారున వడేయకపోతే తప్ప వాడి ప్రయోజకత్వం తెలియదా ?''

"అప్పుడు కూడా తాను నాపెళ్ళి కోసరమే ఒప్పుకున్నాట్ట'' అంది వసంత అమాయకంగా.

జానికమ్మగారు ఆశ్చర్యంగా అర్థంగానట్లు చూసింది.

"ఏమిటే నువ్వు అంటున్నదీ ?'' అన్నది.

వసంత సిగ్గుపడి పోయింది. భయపడిపోయింది. కూడా.

"సురేఖను ఇవాళ కాదంటే వాళ్ళు నిన్నూ నన్నూ ఆడిపోసుకోరూ ?'' జానికమ్మగా రడిగింది.

"వాళ్ల కర్మ ! ఏడవనీ మనకేం....'' వసంత ధైర్యంగా అంది.

"ఇంతకీ ఆ సురేఖకు నా మొహం ఎలా చూపనమ్మాయ్ ?'' బాధ పడ్డదామె.

"ఎందుకమ్మా ! అసలు సురేఖగారే అన్నయ్యను వద్దన్నదేమో ?'' నవ్వింది తెచ్చికోలుగా వసంత

"ఎంతమాట ? ఎంత బరిదీరి పోయూరు ఆడ పిల్లలు ?'' నోరు నొక్కుకుంది అంత బాధ లోను జానికమ్మగారు.

"నీ కాపురం ఆ ధనమ్మచేత బడ్డది కదా ? ఇప్పుడు నాకేం దారి ?''

ఆమెకు జ్వరం తీవ్రంగా కాస్తున్నదని గ్రహించిన వసంత ఆందోళన పడింది.

లేచి గదిలోకి వెళ్ళి తల్లికి తెలియకుండా అన్నయ్యకు ఉత్తరం రాద్దామనుకుంది. కాని అన్నయ్య వెళ్ళి ఇంకా నాలుగు రోజులే అయింది.



ఆ ప్రయత్నం మానుకుంది తండ్రి దగ్గర ఆ పిల్లకు చనువులేదు.

సురేఖ దగ్గరికి వెళితే ? కాని ఎందుకూ...

ఐనా ఎలా వెళ్లడం? తమ్ముడు రాముణ్ని పిలిచి అడిగింది.

"ఏరా ! రామూ ! మనం గాంధీ నగరం రిక్షాలో వెళ్దామా ?" అని. "కాని ఎందుకు ?" అన్న ప్రశ్న ఎదురైంది వాడినించి.

"ఓ ! ఉండు అమ్మకి చెప్తాస్తా" నంటూ వాడు పరిగెత్తాడు.

"ఓరి బాబోయ్ !" ఆ పిల్ల గుండెలాగి పోయాయి.

"వారేయ్ రామూ !" అన్నది వెనక్కి కేక వేస్తూ.

వాడికి పావలా తీసి ఇచ్చి "బాబూ! నువ్వూ నేనూ రేపు సినిమాకి వెళ్దాంగాని ఇవాళ్టికి, ఎదురింటి సత్యవతితో ఆడుకోమని" తోలేసింది

"గాంధీ నగరమో ?" నన్నాడు వాడు.

"వద్దు వూరికే అన్నానంది"

"కొంపలు తీస్తావు వెధవా ?" అనుకుంది. నెలరోజుల్లోనే పెళ్లి బోలె డెదిగిపోయిన వసంత తుర్రున పారిపోతున్న తమ్ముణ్ని చూస్తో!

* * *

సురేఖకు ఏమీ తోచలేదు.

ధనమ్మగారు రాఘవేంద్రరావును పిలిచింది.

"ఏమయ్యా ! నీకు తెలుసా?" అని అడిగింది.

"ఏమిటి తల్లీ ! ఏమిటి!" వినయంగా ఆశ్చర్యం వెలిబుచ్చాడతను.

"ఈ భాస్కరం ఎవతెనో ప్రేమించాడట !'

"శివశివా !"

"శివాలేదూ రామాలేదూ.... నీ కొడుకు పెళ్లికని నేను ఒళ్లు ఇల్లూ హూనం చేసుకున్నా కాని నా ఇంటి విషయంలో నువ్వు ఇంత ప్రమత్తత వహించడ భావ్యమా ?"

"చెల్లీ చెల్లీ ! నన్ను నువ్వు ఇంత పరాయి వాడిగా అదమాయించడం బాగోలేదు."

"అదమాయింపుకాదు.... ఇదంతా నా కర్మ. ఈ సురేఖ చెబుతున్నది.... ఆ భాస్కరం అక్కడ వాల్తేరు బళ్లో ఎవతెనో పద్మాకుమారిని ప్రేమించాడట.... ఇప్పుడేం చేస్తావు ?"

విస్తు బోయాడు రాఘవేంద్రరావు కాస్త ధైర్యంగా వారి కాస్త కసిగా.

"ఎంత దారుణం" అన్నాడు.

"ఋణం సంగతి నేచూస్తాగాని ఈ దారుణం నువ్వాపాలి...' 'ధనమ్మగారు విసుక్కుంది.'

మళ్లీ మెత్తబడి తానే స్వయంగా లోపలికి వెళ్లి గ్లాసుతో కాఫీతీసుకుని వచ్చింది— ఆప్యాయంగా ఇచ్చింది.

"అది కాదన్నయ్యా ! చూడు మనకి ఇప్పుడా కుర్రాడు సురేఖను కాదంటే ఎంత అవమానమో?" నన్నది కాస్త దీనంగా మొహంపెట్టి.

"కాదూ మరి !" అన్నాడు కండువా సవరించుకుని రాఘవేంద్రం కాఫీ చప్పరించి !

"కాదూ మరి అని మీనమేషాలుగుడితే ఎలా?"

"సరే ! నేను ఆ సంగతి చూస్తా నీవు నిశ్చింతగా ఉండు."అన్నాడు రాఘవేంద్రంగారు.

"చూస్తాను అంటే కాదు. నేను నీ ముకుందం పెళ్లి ఎలాగైతే జరిపించానో నీవు నా సురేఖ పెళ్లి నలాగ జరిపించాలి...." అని అంతలో

# ప్రేమకు పగ్గాలు

చటుక్కున మాటమార్చి "అన్నట్లు మరిచిపోయానన్నయ్యా ! నీ ఇంటి తాలూకా కాయితాలు తీసుకుని వచ్చి మా లాయరుగారు అమ్మా! వడ్డీ రాలేదన్నాడు. నేనే ఇస్తాను వేరే సైకం కావాలీ అంటే ఆ వడ్డీ కట్టేయ్ ! లాయర్ దగ్గర నిన్ను కించపరచడం నాకు ఇష్టంలేదు" అన్నది. ధనమ్మ గారు.

గొంతులో పచ్చి వెలక్కాయ పడ్డది రాఘవేంద్రానికి.

"ఎంతమాట చెల్లీ ! మన మనం ఒకటే ఐనా లాయర్లు నౌకర్లు మొదలైన వాళ్ల దగ్గర పరువు తీసుకుంటావా? ఇదో పెళ్లైంది గదా ! నేనే కడతాను...." అంటూ లేచాడు "మొదట ఆ జానికమ్మ దగ్గరకివెళ్లనా ?"అంటూ.

"వద్దు వద్దు.... పాపం ఆమె నెందుకుహింస పెట్టడం?— ఆమె యెప్పుడూ మన పక్షమే ! నువ్వా వాల్తేరు వెళ్లి ఆ వగలాడి ఎవతో దాని సంగతే చూడు...." మన్నది ధనమ్మ "కావాలంటే ఓ వెయ్యో ఎంతో పారేద్దాం" అన్నది కూడా.

రాఘవేంద్రం ఏమనగలడు ?

తన ఇల్లు వేలం వేయించగలదు, ధనమ్మ

**'ఇది మా ముత్తాత గారి ఫోటో' గృహస్థు అతిథికి చూపించాడు.**

**"చాలా ఆశ్చర్యంగా వుందీ ఆయనకు మీకన్న ఎక్కువ వయస్సుండదన్న మాట" అతిథి ముక్కుమీద వేలేసుకున్నాడు.**

తల్చుకుంటే ! బుర్ర వూపాడు.

"అమ్మాయ్ ! సురేఖా !" అన్నాడు లోపలికి కేకవేస్తో "దాన్నెందుకూ ?" అడిగింది కాస్త అనుమానంగా ధనమ్మగారు.

"ఆ పద్మకుమారి కాదుకాదు పద్మావతి గురించి..." అంటూన్న రాఘవేంద్రాన్ని వారించి మధ్యలోనే ధనమ్మగారందుకుంది.

"దాన్ని అడగవద్దు.... అసలీ కథంతా అదే నడిపించింది.... వెర్రిబాగుల్దికదా !" ధనమ్మ గారు వారించింది కాని అంతలోనే సురేఖ అక్కడకు వచ్చింది. రాఘవేంద్రరావు సీసాలో మంత్రించి దింపిన భూతంలాగ ఉన్నాడు. అవకాశం కాస్త దొరికింది గనుక జార విడవకుండా సురేఖను చూసి. "అవును మరి ఇంకా చిన్నపిల్లకదా" అంటూనే "అదిసరే సురేఖా! నేను వాల్తేరు వెళ్తా.... నువ్వె కులాసాగా ఉన్నావూ అంటే రాపోదాం.... నేను ఆ పద్మావతి పని పడితేగాని రాను. నీకాభయం అక్కర్లేదు" అన్నాడు.

మధ్యలో కోపంగా ధనమ్మ వారించింది. "నువ్వెళ్లవయ్యా అన్నయ్యా ? చిన్నదానితో వీకేమిటి ? దానికి మరోవారం శలవు పెట్టించాను...."

"అహ అహా ! సరే సరే ! రెస్టు తీసుకో తల్లీ !" అంటూ నిష్క్రమించాడు రాఘవేంద్రం

"ఏమిటి దొడ్డమ్మా ! పద్మావతి దగ్గరికి ఇతగాడెందుకూ ?" సురేఖ అడిగింది.

"పెళ్లి చేస్తాడులే అందుకూ ?" వెటకారం ఆడింది ధనమ్మ.

"నీ ధోరణే బాగులేదు. పద్మావతి భాస్కరం గారిని ప్రేమించింది. భాస్కరం కూడా ఆమెకు మాట ఇచ్చాడు."

"నోర్ముయ్ ! మాట ఇచ్చాట్ట మాట ! వాడు నాకూ ఇచ్చాడు మాట, అందుకే వాళ్ల చెల్లిపెళ్లి నిక్షేపంలా జరిగింది...."

"వుహూఁ అందుకు బేరంగా భాస్కరం గారిని నీ అల్లుడవ్వాలంటావ్ ! అంతేగా !"

"అంతే !"

"కాని నేను ఆ పెళ్లికి ఒప్పుకోను."

"నేను చెప్పినాసరే ఒప్పుకోవా ?"

వెళ్లిపోయింది సురేఖ అక్కణ్నించి.

పూనకమే వచ్చింది ధనమ్మగారికి.

"ఆగు ! ధడవఖానా ! చివరికి తల్లి రొమ్ములు గుద్దారూ అన్నట్లు నన్నే ధిక్కరిస్తావా ?.... నీవు ఈ భాస్కరాన్ని పెళ్లి చేసుకోపోతే నా ఆస్తి చిల్లిగవ్వరాదు గ్రహించు" మన్నది.

సురేఖ వెళ్లిపోయింది. నిశ్చయంగా అడుగులు వేస్తూ.

ధనమ్మగారికి పీక పిసుకున్నంత కోపం వచ్చింది. "భాస్కరానికి నీకూ నా డబ్బు ఎలా చేదవుతుందో నేనే చూస్తా" నంది కసిగా.

* * *

మర్నాడు ఉదయం ధనమ్మగారు లేచి సురేఖను కాఫీకి రమ్మని కబురు పెట్టింది అలవాటు ప్రకారం, గదిలో సురేఖ లేదు. వంట వాడిమీద మండి పడుతూ ఆమె స్వయంగా సురేఖ గదిలోకి వెళ్లింది. అక్కడ మేజామీద ధనమ్మగారి పటం క్రింద తెల్లని ఉత్తరం మడత ఉన్నది.

"అయ్యో ! కొంప ముంచేవే"'నని గాభరా పడుతూ ఉత్తరం తీసుకుంది ధనమ్మ. కాని అది చదువుతూనే ఆమె ఆందోళన చెరిగి ఆ గ్రహంతో కనులు నిప్పులు చెరిగాయి. అందులో ఇలాఉంది.

"దొడ్డమ్మా ! నన్ను తల్లికన్నా మిన్నగా పెంచావు, నాకు తెలుసు ఆ సంగతి. అందుకే నీ ఆస్తిని నీకే వదలి నీవు నాకు ప్రసాదించిన సంస్కారం మాత్రం తీసుకుని వెళ్తున్నాను. నీ సేవకు అవకాశం ఇస్తే వస్తానేగాని నీ ఆస్తికి, అమ్ముడవడానికి రాలేను క్షమించు. ఆడపిల్లలికి పుట్టింటి ఆస్తి ఆస్తికాదుకదా! అందుకే నీ ఆశీస్సులకై సదా ఎదురు చూసే నీ కూతురు— సురేఖ."

"నా కూతురు.... నా కూతురే అయితే ఇలా ధిక్కరిస్తుందా ?" ఆమె మండిపడి— "చూడు గురువులూ !" అని నౌకర్ను కేకేసింది. సురేఖ వాళ్ల నాన్నకి టెలిగ్రాం ఇవ్వు. అదక్కడికే వెళ్లిందో గంగలోనే దూకిందో'"— నన్నది. మళ్లీ నౌకర్ను వెనక్కి పిలిచి, "అతగాడికి స్టార్ట్ ఇమ్మీడియట్లీ అని కూడా మరోవైర్ ఇయ్యి.... నాలుగూ తేల్చేస్తాను" అన్నది. "తిరుగుటపా చేస్తుందా వేలిడులేదు కదాయిదీ ?" అనుకుంది.

ఆ ఉత్తరం పట్టుకుని ధనమ్మగారు ఆగ్రహావేశాలతో ఇల్లంతా చిందులు తొక్కడం నౌకర్లందరూ చూశారు గాని, కన్నీరు కార్చడం ఒక్క దేవుడి పటం, భర్తపటం మాత్రం చూశాయి.

"ఈ ఆస్తి అక్కర్లేదట పింజారికి ! మరె వరి కోసం దాచానుకుందో'"నని దుఃఖ పడ్డదామె !

(ఇంకావుంది)

## కొలంబా

19 వ పేజీ తరువాయి

"పోదాము! రా! ఆర్సో ఆంటన్" అన్నాడు బందిపోటు, కట్టు కట్టటం పూర్తి చేసి "అదిగో చిలినా గుర్రం పట్టుకొస్తోంది. ఎక్కి నాతో పిట్రిజోనాకి వచ్చెయ్యండి! మిమ్మల్నెవరు పట్టుకోగలరు? మేము మిమ్మల్ని బాగానే చూసుకుంటాముకదా! సెయింట్ క్రిస్టిన్ క్రాస్ దగ్గరకి రాగానే గుర్రం దిగి, కాలి నడక సాగించాలి. మీ గుర్రం చిలినాకి ఇచ్చెయ్యండి. తీసికెళ్ళి మీ చెల్లెలుగారికి ఇచ్చేస్తుంది. చెప్పేదేమయినా ఉంటే చెప్పి పంపచ్చు. ఆ చిన్నమ్మాయి ఎంతపనయినా చేసుకు రాగలగు." అని వాత్సల్యం ఉట్టిపడేట్లు ఆమెతో అన్నాడు: "ఏయ్ దొంగా! చెప్పినట్లు చెయ్యి. లేకపోతే మనందరికీ కీడు వస్తుంది!" బ్రాందలుచ్చియోకి బందిపోట్ల మూఢ నమ్మకాలన్నీ ఉన్నాయి. చిన్న పిల్లలతో మంచి మాటలు వాడితే వారికి 'దృష్టి' తగలటం వంటిదేదో వస్తుందని అతని నమ్మకం.

"నన్నెక్కడికి వెళ్లమంటావు, బ్రాందో?" ఆర్సో కంఠస్వరం బాగా నీరసించి పోయింది.

"నీ ఇష్టం! పొదల్లో (అంటే అడవులలో—అ) అయినాసరే జయిలు లోనయినా సరే...... దెల్లా రెబ్బియాలు జయిలుకి పోరుకదా! పొదల్లోకే!"

"నా ఆశలన్నీ నాశనమయి పోయినట్లే!" అని అరిచాడు ఆర్సో.

"నీ ఆశలా? రెండు కాల్పులకి ఇద్దర్ని చంపే శావు చాలదా? అసలు వీళ్ళు మామూలుగా చచ్చే రకం కాదే....."

"వాళ్లే ముందు కాల్చారు" అన్నాడు ఆర్సో.

"నిజమే, మర్చిపోయాను.....పుఫ్! పుఫ్! బూమ్ బూమ్!......ఒక చేత్తో తుపాకి పట్టుకుని ఇద్దర్ని కొట్టారు!......అంతకన్నా ఎవరు బాగా కాల్చగలరు?.. అన్నట్లు మీ చేత జరిగిన పని ఫలితాన్ని చూసి వెళ్లండి!"

ఆర్సో గుర్రం ఎక్కాడు. అతనికి తనచేత సంభవించిన చావు సాక్ష్యం చూడాలనే కోరిక లసలే లేదు.

"ఆర్సో ఆంటన్" అన్నాడు బందిపోటు గుర్రం కళ్లెం లాగుతూ. "మొహమాటం లేకుండా చెబుతాను. పాపం, ఈ ఇద్దరు యువకులనీ చూస్తే నాకు బాధగా ఉంది. అందగాళ్ళు.....బలమయిన వారు......వయసులో ఉన్నవారు!.....ఆర్లాందుచ్చియోతో ఎన్నో సార్లు వేటకి పోయాను...... ఒకసారి నాకు అతను కొన్ని చుట్టలు బహుమానంగా ఇచ్చాడు.....విన్సెంటిల్లో చాలా సరదా మనిషి......మీరు చెయ్యవలసింది మీరు చేశారనుకోండి......అదీ కాక బలే గురి ఉంది మీకు..... మీ వైపు న్యాయం కూడా ఉంది.....శత్రువులు ఉంటే రక్షించుకొనాలికదా!......కాని బారిచినీ చాలా పాత వంశాలలో ఒకటి.....అనవసరంగా విడిపోవటం జరిగింది......జోడు దెబ్బ!...... నిజంగా చిత్రంగానే ఉంది!"

ఈ ప్రసంగంతో బ్రాందలచ్చియో ఆర్సో చిలినాలనీ, కుక్క బ్రుస్కోని, స్ట్రజోనా చిట్టడవుల వైపు తీసుకుపోయాడు. (ఇంకా ఉంది)

---

## మనిషి - మిథ్య

25 వ పేజీ తరువాయి

"ఛీ .... ఛీ .... వెధవకొంప. క్షణం శాంతి లేదు.... " అని అంటూ కోటయ్య కొడుకు బయట కొచ్చేశాడు. జానకిరామయ్యగార్ని చూసి గతుక్కుమన్నాడు. ఏమీ మాటాడలేక, ఇంట్లోకి చూస్తూ వాళ్ల నాన్నని ఉద్దేశించి,

"జానకిరామయ్యగారొచ్చారు. వెళ్లండి మాస్టారూ—మా నాన్న ఇంట్లోనే ఉన్నాడు" అనేసి అరుగు పక్కనున్న సైకిలు తీసుకుని వెళ్లిపోయాడు.

పంతులే బయట కొచ్చేరు.

"ఎంతసేపయింది నువ్వొచ్చి ?"

"ఇప్పుడే."

"అలా పార్కుకి వెళ్లొద్దాం. ఉండు. ఒక్క క్షణం. ఇప్పుడే వొస్తాను." అని పంతులు ఇంట్లోకి వెళ్లి చెప్పులు తొడుక్కుని వొచ్చారు.

ఇద్దరూ పార్కువైపు బయలుదేరారు. పార్కులో ఓమూల కూర్చున్నారు. జానకిరామయ్యగారు బఠాణీలు తెప్పించారు. ఇద్దరి ముందు పోయించారు. పంతులు ఒక్క బఠాణి గూడా ముట్టుకోలేదు. జానకిరామయ్యగారు అడుగుతే వొద్దని చెప్పారు.

"నువ్వొచ్చేసరికి మా యింట్లో చిన్న యుద్ధం జరుగుతోంది" అన్నారు కోటయ్యపంతులు.

"కొంత విన్నాను."

"మరేంలేదు. నామాటంటే ఆ యిద్దరికీ లెఖ్కలేకుండా పోయిందోయ్" అన్నారు కోటయ్య పంతులు బాధగా.

"ఛ .... అవేం మాటలూ ?"

"ఉన్నమాటే అంటున్నాను."

"అక్కడే పొరపడుతున్నావోయ్ పంతులూ! దీంట్లో తప్పంతా వాళ్లదే నని నే చెప్పను. మనం పెద్దవాళ్లమయ్యేకొద్దీ కొన్ని తలతిక్క పనులు చేస్తుంటాం. నీకు కాఫీ తాగాలని అనిపించిందే అనుకో. ఆ సంగతి అనేస్తే కాఫీ యిచ్చేదేగా నీ కోడలు. కానీ—నువ్వు కాఫీ అడగవు. అడక్కుండానే కాఫీ రావాలనే పంతం నీది. అసలే యింటెడు చాకిరీతో ఆపిల్ల పగలంతా అలసిపోయి ఉంటుంది. ఇలాంటప్పుడు విసుగూ చిరాకూ కలగడం సహజం. అన్నీ సర్దుకుపోయే సుగుణం నీలో ఉంటే అసలీ గలాటా జరగదనే నా ఉద్దేశ్యం."

"నువ్వన్నీ యిలాగే చెప్తావ్. ఎంత విషయాన్నైనా అలా గోటితో తీసిపారేసి 'ఏముందీ—యింతేగా' అనడం నీకు అలవాటైపోయింది."

జానకిరామయ్యగారు నవ్వేరు. పంతులి భుజం తట్టి,

"జీవితానికి మరో అర్థం ఏమిటో తెలుసా ?—సహనం" అన్నాడు.

"పోనిద్దూ్, కాదు నీ పాఠాలు చెప్పుకునే బుద్ధి!" అన్నారు కోటయ్యపంతులు రుసరుస లాడుతూ.

జానకిరామయ్యగారు పంతులి విషయం మార్చి తన విషయంలోకి వొచ్చారు. పెద్ద కొడుకు, పంపిన పైకమూ, అతను రాసిన విషయాలూ చిన్నకొడుకు ఉద్యోగ ప్రయత్నాలూ వివరించారు. అన్నింటికీ ఊఁ కొట్టడం పంతులి వంతయ్యింది అంతేగాని, రోజూ వాదించేలా యీనాడు వాదించ లేదు.

దీంతో జానకిరామయ్యగారు కూడా చప్పబడిపోయేడు. దాదాపు ఏడు గంటలకి యిద్దరూ పార్కునుంచి కదిలారు. కొంత దూరం కలిసి నడిచి, అక్కడ్నుంచి ఎవరిళ్లకి వాళ్ళు వెళ్లిపోయారు.

జానకిరామయ్యగారు యింటికి రాగానే సుశీల అడిగింది. "వెచ్చాలేవి నాన్నా" అని.

జానకిరామయ్యగారు నాలుక్కరుచుకున్నారు. తన మతిమరుపుని మరోమాటు తిట్టుకున్నారు. సుశీల పకా పకా నవ్వింది.

"నే నప్పుడే అనుకున్నాను యింతపనీ అవుతుందనీ."

"పోనీలేమ్మా, రేపు ఉదయం జ్ఞాపకం పెట్టుకుని తప్పకుండా పట్టుకొస్తాను సరేనా ?"

"జ్ఞాపకం పెట్టుకున్నట్టు నేను మళ్లీ రేపు ఉదయం జ్ఞాపకం చెయ్యాలి కాబోలు ఖర్మం" అన్నది సుశీల.

జానకిరామయ్యగారు చిన్నగా నవ్వేరు.

భోజనం ముగించి చదువుకునేందుకు 'గీత' తెరిచారు జానకిరామయ్య. ఆ పుస్తకం మధ్యలో పెట్టిఉంది—మధ్యాహ్నం నిరంజనానికి రాసిన ఉత్తరం.

జనకిరామయ్యగారికి సిగ్గు వేసింది. ఇది సుశీలకి తెలుస్తే మళ్లా ఏదో ఒకటి అంటుందని ఆ ఉత్తరాన్ని గోడకు తగిలించిన కోటుజేబులో భద్రంగా దాచడానికి లేచారు.

గుమ్మం దగ్గర నుంచున్న సుశీల మళ్ళా నవ్వింది.

"ఏమిటి నాన్నా, మరీ యింత మతిమరుపైతే ఎలా ?"

"నిజమే సుమా !" అన్నా రాయన నవ్వు తెచ్చుకుంటూ.

పది గంటలకి లైట్ ఆర్పి నిద్రపోడానికి కళ్ళు మూసుకున్నారు. నిద్ర పట్టడంలేదు. ఏవో ఆలోచనలు.

పాపం .... పంతులు, కొడుకుని ఆశ్రయించి సుఖాన్ని దూరంచేసుకుంటున్నా డేవిటి ? పంతులు అమాయకుడు. పట్టిన పట్టు ఒక పట్టాన వొదిలిపెట్టే రకం కాదు. ఈ వయస్సులో, ఒకళ్లని ఆశ్రయించి యింకా యీ పట్టుదలలూ, పంతాలు ఏమిటసలు ?

ఈ పంతులే అంటాడు. 'అంతస్థుతో కులుకుతూన్న కొడుక్కి తండ్రి కనిపించడ'ని.

పంతులు కొడుకు లాటివాడేనా నిరంజనం ? అనుకోకూడదు గాని, తనని తలమీద పెట్టుకు పూజిస్తాడు నిరంజనం. ఇప్పటివరకూ తనమాటకెదురు చెప్పి ఎరుగడు. తన అదృష్టం కొద్దీ రత్నాల్లాటి కొడుకు లిద్దరు కలిగారు. చూస్తున్నారుగా—తండ్రులకీ, కొడుకులకీ మధ్య వెంత అఘాతాలుంటున్నాయో ?

అన్నివిధాలా తాను అదృష్టవంతుడే.

శంకరానికి చక్కటి ఉద్యోగం దొరికి, సుశీలకు మంచి సంబంధమొచ్చి, ఓ యింటిదైపోతే—యిక తనకే సమస్యా ఉండ దసలు. ఎవళ్ల దగ్గరో ఒకళ్ల దగ్గర—లేదా—కొన్నాళ్లు ఒకళ్ల దగ్గరా మరికొన్నాళ్ళు మరొకళ్ల దగ్గర, యిలా వంతులవారీగా ఉండి కృష్ణా రామా అంటూ కాలం గడిపేయవచ్చు.

ఆ రాత్రి జానకిరామయ్యగారికి అలాటిదే ఒక చక్కటి కల వొచ్చింది. (సశేషం)

## మనమూ-మనదేహస్థితి

11 వ పేజీ తరువాయి

...ంగా సంకోచింప జేస్తవి. ఆంత్ర కండరము ...ను వ్యాకోపింప జేస్తవి. అనేక అపాయములలో ఈ పేరా సింపతెటిక్ నరములు తెగినప్పుడు, తెగిన నరములను బట్టి ప్రేగులో కండరముల సంకోచ వ్యాకోచములు మారుతవి. ఆంత్రములో ఒక ప్రదేశం బహుకాలం సంకోచ వ్యాకోచక శక్తిని కోలుపోవచ్చును గూడా. కాని కొంత కాలం అయిన తరువాత ఆ శక్తి తిరిగి యేర్పడుతుంది.

ప్రేగుల అంతరాళమును క్రమ్మి ఉండే మ్యూకస్ పొర ప్రేరేపితమైనప్పుడు ఈ ఆంత్ర నరజాలము ఉద్రిక్త మవుతుంది. జీర్ణ పదార్థం ముందుకు నెట్టబడుతోంది. అదే విధంగా ప్రేగులు ఉబ్బి సాగినప్పుడు, ఈ నరజాలము ఉద్రిక్తమై బాధ కలుగుతుంది. సింపతెటిక్ నరములూ పేరాసింపతెటిక్ నరములూ కూడా వెన్నుపాములో గుండానే క్రిందికి వచ్చి వేరువేరు ప్రదేశములలో బయటికి పోయి, సింపతెటిక్

దండలలో ఉండే గేంగ్లియానులలో ఉండే న్యూరానులను అంటి ఉంటవి. వాటి నుండి మళ్లీ బయటికి పోయి, కొన్ని ప్లెగ్జసులుగా ఏర్పడ తవి. ఈ ప్లెగ్జసులలో నుండి బయలుదేరే శాఖలే, హృదయానికీ, జీర్ణకోశ భాగాలకూ, కిడ్నీలకూ మూత్రాశయానికి జాత్యాంగాలకూ(Sex organs) పోతవి. పదవ శిరోనరమైన వేగస్ నరంలో పేరా సింపతెటిక్ నరములు క్రిందికి వచ్చి, ఈ ప్లెగ్జసులలో అంత మవుతవి. మనస్సుకూ జీర్ణకోశ వ్యాధులకూ చాలా సన్నిత సంబంధం ఉన్నది. ఆ వివరములు వచ్చే వ్యాసంలో చిత్రించి చర్చిస్తాను.

జీర్ణాశయం కార్య కలాపానికి, శరీరంలో ఏర్పడే వివిధ రసాయనిక పరిస్థితులకూ చాలా సన్నిహిత సంబంధం ఉన్నది. శరీరంలో ఇన్‌సులిన్ (Insulin) ఉత్పత్తి తగ్గినప్పుడు, భోజనంలో ఉండే కార్బోహైడ్రేటులు జీర్ణమై గ్లూకోజుగా మారినా ధాతువులు దానిని వినియోగించుకో లేనందున, ఆ గ్లూకోజు రక్తంలో పేరుకుంటుంది ప్రతి నూరు ఘన సెంటీమీటర్లకూ, 80 నుండి 120 మిల్లీగ్రాముల వరకూ ఉండవలసిన గ్లూకోజు. 200 నుంచి 400 మిల్లీగ్రాముల వరకూ పెరిగిపోతుంది. అప్పుడు జీర్ణకోశపు క్రియా కలాపము తగ్గిపోతుంది. రక్తంలో గ్లూకోజు తగ్గితే హెచ్చిపోతుంది.

అంత్ర నరజాలము శరీరంలో అనేక చోట్ల నుండి వచ్చే ఆదేశములను సేకరించి సమన్వయించి జీర్ణాశయ మెంతగా తన విధులను నిర్వహించాలో నిర్ణయిస్తుంది.

హఠ యోగాభ్యాసం చేసేవారికి, అనిచ్ఛాధీనములైన అంత్ర కండరములు ఇచ్ఛాధీనములు అవుతవి. అనుచ్ఛాధీనమైన శరీర కార్యక్రమమును ఇచ్ఛాధీనం చేసుకోవడం కోసమే యోగ శాస్త్రము వృద్ధి చెందింది. ఆ యోగ విద్యను అభ్యసించినవారు, తమ ఇష్టానుసారంగా అంత్ర తరంగ చలనమును, అధోముఖంగా కావాలంటే అధోముఖంగానూ ఊర్ధ్వముఖంగా కావాలంటే ఊర్ధ్వ ముఖంగానూ నడిపించగలరు. దానిని స్తంభించనూ గలరు.

శరీరంలో తరంగ చలనమును కంట్రోలు చేసే పరిస్థితులు మూడు (1) గ్రంధులకు వచ్చే ప్రేరేపణ, (2) మెదడు నుంచి వచ్చే ఆదేశములు, (3) శరీరంలో ఉండే అనాళికా గ్రంధుల సారముల ప్రభావము. ఈ హోర్మోనులు ఉత్పత్తి మనం తీసుకునే ఆహారం మీద ఆధారపడి ఉంటుంది. ఒక్కొక్కరకమైన ఆహారము ఒక్కొక్క హోర్మోను ఉత్పత్తిని ప్రకోపించి, ఒక్కొక్క రకమైన జీర్ణరసముల స్పందనములను అధికం చేస్తుంది. వీటి ప్రభావంవల్ల, భోజన పదార్థము లన్నీ జీర్ణమై, దేహం స్వీకరించదగిన సార భాగముగానూ విసర్జించ దగిన 'కిట్ట' భాగముగానూ మారిపోతవి. ఇక్కడే ప్రోటీను ఎమైనో ఏసిడ్‌లుగానూ, కార్బోహైడ్రేటులు, గ్లూకోజుగానూ, తైల ద్రవ్యములు (Fats) 'ఫేటీ ఏసిడ్, గ్లిసరాలులుగానూ మారిపోతవి. ★

---

మూర్చుంది. కాని, రాణిగంజి నుంచి బయలుదేరే యింకో బస్సుకు 7 బి నెంబరు యిచ్చారు యిప్పుడు. దీంతో మామూలుగా రెసిడెన్సీ వెళ్లుదామని, రాణిగంజి దగ్గర 7 బి బస్సు కనక ఇప్పుడు ఎక్కితే మారేడుపల్లి వెళ్లి కూర్చుంటాం. అయితే ఆ బస్సులు ఆగేచోట్లు మాత్రం వేరుగా ఉన్నాయి కదా అనచ్చు. నిజమే అయినా ఈ నెంబర్ల వలన కలిగే అనుమానాలు మాత్రం తొలగించలేవు. పై బస్సుల 'స్టేజ్' లు మారినాయేమో అనే అనుమానానికి కూడా అవకాశం లేకపోలేదు. ఇవి అధికారులు గమనించి అవసరమైన తగు మార్పులు తీసుకొస్తే బాగుంటుంది. ఈ నెంబర్ల మార్పు ఓ కొత్త పద్ధతిని ప్రవేశపెట్టినట్టే అనుకుంటే మిగతా విషయాల్లో కూడా బాగా మార్పులు తీసుకువస్తే పలుగురూ సంతోషిస్తారు.

## వేలం వెర్రి

ఏదొచ్చినా వేలం వెర్రే ! డిటెక్టివ్ సాహిత్యం గుట్టలు గుట్టలుగా వచ్చిన పుస్తకాల రూపంలో విపరీతంగా అమ్ముడుబోయిన రోజులున్నాయి. ఆ ఉధృతం యిప్పుడు అంతగా లేదు. నిజానికి పది మంది ఏది హర్షిస్తే అదే మంచిదేమో ఈ ప్రజాస్వామ్య యుగంలో. కాని ఈ మధ్య అశ్లీల సాహిత్యం ప్రచారం ఎక్కువయి పోయింది. ఏ షాపు దగ్గరకు వెళ్లినా ముందర అసభ్యపు బొమ్మలతో ఈ పుస్తకాలు తయారు, కొన్ని ఎక్కడినుంచి వస్తున్నాయో, ఎవరు అచ్చు వేస్తున్నారో కూడా తెలీదు. వాటికి గిరాకీ ఎక్కువట ! అన్ని షాపులవాళ్లు చెప్పేస్తారు ! మరి ఇంతమంది కొంటుంటే కాదంటం యెట్లా ? ఇక్కడే ప్రజాస్వామ్యం అంటే విపరీతార్థం చెప్పుకోకుండా చూడాలి. పది మందికి ఏది మంచిదో, చెడ్డదో అని కూడా నిర్ణయించాలిసిన బాధ్యత తీసుకోవాలి. సక్రమమైన మార్గంలో నడుచుకునేటట్లు చూడాలి. అందువల్లనే ప్రభుత్వంవారు సత్వర చర్యలు తీసుకుని కొన్ని పుస్తకాలను జప్తు చెయ్యటం, షాపు యజమాన్లకు తగిన శిక్ష విధించటం, జరిపించటాన్ని హర్షించి తీరాలి. కాని యిప్పటికీ చాటుమాటు బేరాలు సాగుతున్నట్లే తెలుస్తోంది. వీరిని కూడా పట్టేసి మరింత కఠినశిక్ష విధించటంతో

# రాజధాని కబుర్లు

16 వ పేజీ తరువాయి

ఈ రూపంలో జరుగుతున్న అసభ్య ప్రచారం అరికట్టచ్చు.

ఇంకోరకం బయలుదేరింది జంటనగరాల్లో. ఉన్నట్టుండి పని పాటా లేకుండా, పెట్టుబడి బాధ లేకుండా డబ్బు సంపాదించాలనే తాపత్రయం. ఒకరు ఒక టికెట్టు కొనటం, కొన్న వ్యక్తి అలాంటి టిక్కెట్లు మూడు, ముగ్గురికి అమ్మేసెయ్యటం, వాళ్లు కూడా ఆవిధంగానే కొంటూ ఉండటం అమ్ముతూ ఉండటం. ఈ ప్రవాహం ఎంతవరకు పోతుందో అర్థంకాదు. దీనివలన ఒక్కొక్క వ్యక్తికి తాను కొన్న టిక్కెట్టు విలువ కంటే అధికంగా డబ్బు రాబట్టుకోవటం. దీనికి కంపెనీలు తయారయినాయి. మొట్టమొదట ఒక కంపెనీ వచ్చి, ఈ పద్ధతి అవలంభించింది. దాన్ని చూసి కుక్కగొడుగుల్లాగ అనేకం వెలిసినాయి. ప్రతివాడు డబ్బు సంపాదించాలనే ఆదుర్దాతో యీ పద్ధతి అవలంభించటం, చివ్వరకు టిక్కెట్లు మూడు అమ్మలేనివాడు నిస్పృహ చెంది తాను పెట్టిన డబ్బు కూడా పోగొట్టుకోవటం, లాభించినవాళ్లు సరేసరి. సిటీ పోలీసు నేర శాఖాధికారులు దీన్ని గమనించి ఒక కంపెనీమీద దాడి చేశారు. దీంతో మిగతావి కొన్ని వాటంతటవే సర్దుకుంటున్నాయి. అసలు యీ పద్ధతిలో చట్టరీత్యా ఏమేమి లోపాలున్నాయో ముందుగానే ఆలోచించి ఉంటే, ఇంతవరకు వచ్చేదే కాదేమో !

* * *

ఈమధ్యన ప్రారంభోత్సవాలు చాలావాటికి జరిగినాయి. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ 'నాట్యకళ' అనే ద్వైమాస పత్రికకు ప్రారంభోత్సవం జరిపించారు. సికింద్రాబాదు 'వస్త్ర వ్యాపారస్థుల' సంఘం వారి ఆధ్వర్యాన ఒక ఆసుపత్రికి కూడా ఇలాంటి ఉత్సవమే జరిగింది. ఈ రెంటికీ ముఖ్యమంత్రిగారే సారథ్యం వహించారు. ఆంధ్రవిశ్వసాహితీవారు "యూనిలిట్" అనే త్రైమాసిన పత్రిక ఇంగ్లీషు భాషలో వెలువరిస్తూ వస్తున్నారు. ఈసారి గురజాడవారి ప్రత్యేక సంచికగా రూపొందించిన పత్రికను, గవర్నరుగారు ఆవిష్కరించారు. జంతువులకు సంబంధించిన ప్రదర్శనశాలను కూడా గవర్నరుగారు ప్రారంభోత్సవం చేశారు. మీరాలం చెరువు దరిదాపుల్లో అంటే చార్‌మినార్‌కు సుమారు రెండు మైళ్ల దూరములో, యీ నూతన జంతు ప్రదర్శనశాల వుంటుంది. అక్కడ ఒక పార్కు కూడా ఏర్పాటు చేశారు. వీటిని దర్శించటానికి 10 నయా పైసలు చెల్లించుకుంటే ఉదయం పది గంటల్నించి, సాయంత్రందాకా చుట్టూ తిరిగి రావచ్చు.

హైదరాబాదు పట్నంలో కోర్టులున్న భవనాలు నానా అధ్వాన్నంగా ఉన్నాయని, సరియైన ఆరోగ్యకరమైన భవనాల్లోకి వీటిని తరలించాలని, చాలా రోజులబట్టీ, చాలామంది అనుకుంటున్న విషయాలే. ఈ ఇబ్బందులను తొలగించటానికి, సాధ్యమైనంతవరకు అన్నికోర్టులు ఒకేచోట ఉంచటానికి తీవ్రమైన కృషిజరిగింది. దీని ఫలితమే 35 లక్షల రూపాయలతో ప్రస్తుతమున్న ఆవరణలోనే మూడంతస్థుల భవనం, సివిల్, తదితర కోర్టులకోసం తయారుకాబడుతోంది. నూతన భవనాలకు శంకుస్థాపన కోసం, సుప్రీమ్‌కోర్టు ప్రధాన న్యాయమూర్తిని ఆహ్వానించటం వారు దానిని మన్నించి రాజధాని నగరానికి విచ్చేయటం ఎంతో సముచితంగా ఉంది. ఈ రాకను పురస్కరించుకొని బార్ కౌన్సిల్ ఫెడరేషన్‌వారు చేసిన సత్కారంలో ప్రధాన న్యాయమూర్తి శ్రీయుతులు బి. పి. సిన్హాగారు యిచ్చిన సలహాలను వారు వెలిబుచ్చిన అభిప్రాయాలను, అందరూ గమనించదగినవి. న్యాయశాస్త్ర విద్యలో కూడా కాలానుగుణ్యంగా మార్పు రావాలని, రాజ్యాంగ వ్యవహారాలకు సంబంధించిన విద్యకు ఎక్కువ ప్రాముఖ్యం యివ్వాలని కూడా అన్నారు.

సిటీ సివిల్‌కోర్టు భవనాలకు శంకుస్థాపన కూడా శాస్త్రోక్తంగా జరిగింది. ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీయుతులు చంద్రారెడ్డిగారు సభను ప్రారంభిస్తూ హుందాగానూ, ఉన్నతస్థాయిలోనూ ప్రసంగించారు.

—వి. ఎల్. ఎన్. ★

# న్యూఢిల్లీ లేఖ

9 వ పేజీ తరువాయి

కొందరు గౌరవ సభ్యులు ఇచ్చిన వివరాలతో పొందు పరుస్తున్నాను.

1. ఒకానొక వ్యాజ్యానికి సంబంధించిన కాగితాలు ఉన్నట్టుండి మాయమై పోయాయి. కొన్ని నెలలపాటు దొరకలేదు. ఆ వ్యాజ్యానికి సంబంధించిన వ్యక్తి కోర్టు మున్షీ చేతులు తడపలేదట. 2. కేంద్ర ప్రభుత్వంలో పనిచేసే ఓ సంయుక్త కార్యదర్శి (జాయింట్ సెక్రటరీ) వాళ్ళ నాన్నగారుంటున్న ఇంటికి విద్యుచ్ఛక్తి ఏర్పాటు చేయించాలని నెలల తరబడి ప్రయత్నించినా కృతార్థుడు కాలేదట. వాళ్ళ నాన్నగారు ఆ వ్యవహారంలో 'జోక్యం' గల వ్యక్తిని కాస్త (ముడుపు చెల్లించి) చల్లబరచిన వెంటనే విద్యుచ్ఛక్తి వచ్చిందట.

ఈ విషయాన్ని గూర్చి చెప్పాలంటే ఇలా ఇంకా వందలకొద్ది నిదర్శనాలు, ఉదాహరణలు దొరుకుతాయి. అసలు ప్రశ్న యేమిటంటే ఇప్పుడే కామరాజ్ పథకం వల్ల లంచగొండితనం ఏ విధంగా పోతుందీ అని! అలా అడగటం బాగుండదేమో! కాంగ్రెస్ పార్టీని బలపరచటం ఈ లంచగొండి విధానాన్ని ఏ విధంగా రూపుమాపుతుందిట?

ఈ విషయాన్ని గురించే ఇటీవల యు. పి. కాంగ్రెస్ సభ్యులొకరు మాట్లాడుతూ, దేశంలో ప్రజల నైతిక ప్రవర్తన, శీలం పతనావస్థలో ఉన్నంతకాలం లంచగొండితనాన్ని రూపు మాపటమనేది అసాధ్యమని అన్నారు. అందుకు ఉదాహరణగా ఆయన, ఉత్తరప్రదేశ్‌లో వ్యాపారస్థుల దగ్గర సరైన తూకపు రాళ్ళుండటంగానీ, ఉన్నా సరిగ్గా తూచటంగాని అరుదైన విషయమని చెప్పారు. పరిస్థితులు ఇలా ఉన్నందువలన, మనిషి ప్రవర్తనలో మంచిమార్పు ఏర్పడనంతవరకు ఈ వ్యాధిని రూపుమాపటం జరిగే పని కాదనే భావాన్ని ఆయన వెలిబుచ్చారు.

కామరాజ్ పథకాన్ని పురస్కరించుకుని ముఖ్యంగా పార్లమెంటరీ ప్రజాస్వామ్యంను గూర్చి ప్రధాన మంత్రి చాలా ప్రాముఖ్యం గల ప్రకటనలను, పత్రికా విలేఖరుల సమావేశంలో చేశారు. అందులో ప్రధాన మంత్రి, వివిధ రాష్ట్రాల మంత్రి మండలులను నిర్ణయించేది ముఖ్యమంత్రి కాదని, కాంగ్రెస్ అధిష్టానవర్గమేనని కొంచెం గట్టిగానే చెప్పారు. అంటే ముఖ్యమంత్రి సలహాతో గవర్నరు మంత్రులను నియమించాలి అనే రాజ్యాంగ సూత్రం కాలదోషం పట్టి పమ్మయి పోబోతుందన్నమాట. అందువల్ల రాజ్యాంగానికి ఈ క్రింది విధంగా ఇక నుంచి అర్థంచెప్పుకోవాల్సి వస్తుంది.

1. ముఖ్యమంత్రి లేక ముఖ్యమంత్రులతో ఒక మంత్రి మండలి గవర్నరుకు సలహా లిచ్చేందుకు రాజ్యాంగ వ్యవహారాలలో సహాయపడేందుకు పని చేస్తుంది.

2. ముఖ్యమంత్రి అనే వ్యక్తిని కాంగ్రెస్ అధిష్ఠానవర్గం నియమిస్తుంది. దాని ఇష్టానిష్టాలనుసరించి అతడు పదవిలో ఉండటం జరుగుతుంది.

3. మంత్రులను ముఖ్యమంత్రి సలహాతో నియమించాలి. వాళ్ళపేర్లను కాంగ్రెస్ అధిష్ఠాన వర్గం సూచిస్తుంది.

4. మంత్రి మండలులు సమ సంఖ్యాకంగా ఉండి ముఖ్యమంత్రి కాంగ్రెస్ అధిష్ఠానవర్గానికి లోబడి ఉండటమే ధ్యేయం గనుక మంత్రులను ఎన్నిక చేసేటప్పుడు కాంగ్రెస్ అధిష్ఠానవర్గం రాష్ట్ర కాంగ్రెస్ పార్టీలలోని వ్యతిరేక వర్గాలకు కూడా తగిన ప్రాధాన్యం ఇవ్వాలి.

5. పండిత నెహ్రూ ప్రధానిగా ఉన్నంత కాలం, రాజ్యాంగ సూత్రాతీతమైన హక్కులు కేంద్రానికి వర్తించనే కూడదు.

తాము అధ్యక్షులుగావున్న ప్రణాళికా సంఘంను ప్రశంసిస్తూ ప్రధానమంత్రి భారతదేశమంతటా ఫెడరల్ రాజ్యాంగంలో ప్రణాళిక అనేది చాలా కష్టంతో కూడుకున్న పని అని, అందుక్కారణం రాష్ట్రాలన్నిటిని కూడ గట్టుకుని సాగించాల్సి ఉండటమేనని అన్నారు. కాని ఇదివరకెప్పుడో ప్రధానమంత్రే, ఏ ముఖ్యమంత్రి కూడా కాంగ్రెస్ అధిష్ఠానవర్గానికి వ్యతిరేకంగా పోడని అన్నట్లు గుర్తు! అమాంతం ఇప్పుడాయన రాజ్యాంగానికి అనుకూలంగా మాట్లాడుతూ ప్రణాళికా సంఘం తన కార్యక్రమాన్ని, రాష్ట్రాలను ఒప్పిస్తూ చర్చలు సాగిస్తూ కొనసాగించాల్సి ఉంటుందని అంటున్నారు!

అయితే ప్రణాళికల అమలు జరపటానికి కాంగ్రెస్ అధిష్ఠానవర్గాన్ని ఎందుకు ఉపయోగించకూడదు. ఈ విషయాన్ని మాత్రం ఆయన చెప్పనేలేదు.

అంతటితో ప్రధానమంత్రి ఆపలేదు. దేశంలో 'తలెత్తుతున్న' ఫాసిస్టు తత్వాలను గూర్చి వళ్ళీ ప్రసంగిస్తున్నారు. తమ ప్రతీకార లక్ష్యాలను సాధించేందుకు హింసా పద్ధతులమీద ఆధారపడి ఉన్నాయని, అవి చాలా అసభ్యకరమైనవని ఆయన ఆరోపించారు. అసలు ఆక్స్‌ఫర్డ్ నిఘంటువు ప్రకారం 'ఫాసిస్ట్' అన్నమాటకు అర్థం "బొల్షివిజంను ఎదిరించేందుకు ముస్సోలినీ నాయకత్వాన ఏర్పడిన ఇటాలియన్ జాతీయ వాదపక్షం". అందువల్ల ఈ సంస్థ ఫాసిస్టు సంస్థ. వ్యవస్థసూత్రం ఫాసిజం కనుక మనం కమ్యూనిజంను వ్యతిరేకించేసల్లా అభివృద్ధి నిరోధకమనీ, అసభ్యమూ అన్నమాట. అంతేగాక ప్రధానమంత్రి కాంగ్రెస్ సామ్యవాదాన్ని నిర్వచించ ప్రయత్నించారు. ఆయన చెప్పిందిదీ: "కాంగ్రెస్ పద్ధతి సామ్యవాదంలో అందరికీ సమానవకాశాలుంటాయి. (2) అది ఎక్కువ అవకాశాలు, తక్కువ అవకాశాలు గల ప్రజల మధ్య ఉన్న వ్యత్యాసాన్ని భర్తీ చేసేందుకు ప్రయత్నిస్తుంది. ఈ సాధన అంతా శాంతియుత మార్గాల ద్వారానే జరుగుతుంది." సమానావకాశాల విషయంలో వేరే చెప్పక్కర్లేదు. మంత్రిగారి బంధువైన మూడవతరగతి వ్యక్తి, 1 వ తరగతిలో ఉత్తీర్ణుడైన ఓ విద్యార్థితో పోటీగా సీటుకోసం నిలబడి ఇంజనీరింగ్ కళాశాలలో సీటు సంపాదించుకోవటం తెలిసినవిషయమే. ఇంక అధిక, అల్ప అవకాశాలు గల వ్యక్తుల మధ్య అంతరాన్ని తొలగించే విషయం: కాంగ్రెస్ పరిపాలకులు 'అతి ముఖ్య వ్యక్తి' అనే తరగతిని ఒకదాన్ని సృజించారు. అంటే ఇంగ్లీషులో వి. ఐ. పి. (వెరీ ఇంపార్టెంట్ పర్సన్) అంటారు. అదికాదు మేం చెప్పిన వ్యత్యాస రాహిత్యం అనేది సంపద విషయంలోమాత్రమే నంటారా? ఇదివరకు కన్న కాంగ్రెస్ పరిపాలనలో సంపదంతా కొద్దిమంది చేతులో పేరుకుపోయిందన్న విషయం మహా నాలోబిస్ నివేదిక బయటపెడ్తోంది. కాంగ్రెస్ సీసాలో సామ్యవాదపు సారాయి ఇలా ఉంది! ★

# అవీ - ఇవీ - అన్నీ

మద్రాసులో ఆధునిక రీతులలో నిర్మించబడిన మ్యూజిక్ అకాడమీ హాలులో అక్టోబరు 7 వ తేదీ సాయంత్రం జరిగిన డ్యూక్ ఎలింగ్టన్ బృందపు వాద్య సమ్మేళన కచేరీ శ్రోతలను తన్మయత్వంలో ముంచింది. 1800 మంది ప్రేక్షకులతో హాలు నిండిపోయింది. ఈ బృందంలో 15 మంది వాద్యకులున్నారు. డ్యూక్ ఎలింగ్టన్ ఢిల్లీలో అస్వస్థగా ఉన్న కారణంగా బిల్ స్ట్రేహార్న్ ఈ కచేరీకి దర్శకత్వం వహించారు. ఈ గోష్ఠిలో వాయించబడిన పన్నెండు ప్రఖ్యాత కీర్తనలకు శ్రోతలు ఉత్సాహంతో హర్షధ్వానాలు చేశారు.

హెరీకార్నీ ఈ గోష్ఠిలో వాయించే కీర్తనలను గురించి పరిచయం చేశారు. వీటిలో కొన్ని ప్రసిద్ధమైన పాతవీ, డ్యూక్ ఎలింగ్టన్, ఆయన సహచరులు సృష్టించిన కొత్త స్వరాలు కొన్నీ ఉన్నవి. బిల్లీ స్ట్రేహార్న్ కూర్పు చేసిన "అప్రా—భాస" అనే గీతంతో ప్రారంభమై ఈ కచేరీ జాజ్ సంగీతంలో ఉన్నతస్థాయి నందుకొని శ్రోతలను ఉత్తేజపరచింది.

జాజ్ సంగీతంతో పెద్ద పరిచయంలేని శ్రోతల ముఖ కవళికలనుబట్టి చూచినట్లయితే "జాజ్ సంగీతం అనీ మరో సంగీతం అనీ వ్యత్యాసమంటూ ఏమీలేదు. సంగీతమంతా ఒకటే" అన్న డ్యూక్ ఎలింగ్టన్ మాటలు యదార్థమైనవని తెలుస్తుంది.

"కాట్" యాండర్సన్, "కూటీ" విలియమ్స్ (ట్రంపెట్ వాద్యగాళ్లు) పాల్ గాన్ సాల్వ్స్, జానీ (శాక్సోఫోన్ వాద్యగాళ్లు), ఎర్నీ షెపర్డ్ (బాస్ వాద్యగాడు) శామ్ ఉడ్‌యార్డ్ (డ్రమ్ వాయిద్యగాడు) విడిగా చేసిన వాద్య ప్రదర్శనలకు శ్రోతలు హర్షధ్వానాలు చేశారు.

"ఈ గోష్ఠిలో వాయించిన ప్రఖ్యాత కీర్తనలలో కొన్ని "టేక్ ది 'ఏ' ట్రెయిన్", "ఎంయిత్ వెయిల్", "జామ్ విత్ శామ్", "శాటిన్‌డాల్" "సోఫిస్టికేటెడ్ లేడీ."

ఈ సంగీతకచేరీ మద్రాసు సంగీత సమితి (మ్యూజికల్ ఎసోసియేషన్) అమెరికా సమాచారకార్యాలయంవారి ఉమ్మడి ఆధ్వర్యాన జరిగింది. అస్వస్థత కారణంగా ఈ కచేరీలో పాల్గొనలేకపోయినందుకు విచారం వెల్లడిస్తూ డ్యూక్ ఎలింగ్టన్ పంపిన సందేశాన్ని మద్రాసు మ్యూజిక్ ఎసోసియేషన్ అధ్యక్షులు డాక్టర్ పి. వి. చెరియన్ చదివారు.

ప్రస్తుతం ఇండియాలో నెలరోజుల పర్యటన జరుపుతున్న ఈ ప్రపంచ ప్రఖ్యాత జాజ్ వాద్య బృందం సోమవారం సాయంత్రం నగరంలో రెండవ కచేరి జరుపుతుంది. కె.

# "పెళ్ళికానుక" శ్రీధర్‌కు పెళ్ళి

బెజవాడ రామచంద్రారెడ్డిగారి మనుమరాలు కుమారి దేవసేన మదరాసు క్వీన్ మేరీస్ కాలేజీలో బి. ఏ. చదువుతోంది. పెళ్లికానుక, కళ్యాణపరుసు, తెన్‌ల్వ్, నెంజిల్ ఒర్ ఆలయం, ఓల్ఏక్ మందిర్, నెంజిల్ మరుప్పదిల్లై మొదలగు చిత్రాలకు దర్శకత్వం వహించి, చిత్రనిర్మాణంలో అనేక విధాల సారథ్యం వహించిన శ్రీధర్‌కు, కుమారి దేవసేనకు వివాహం జరుగబోతుంది.



15 మంది సభ్యులతోకూడిన డ్యూక్ ఎలింగ్టన్ వాద్య బృందంవారు అక్టోబరు 5 వ మద్రాసు వచ్చారు. వారు నాలుగురోజులు మద్రాసులోవుండి, రెండు వాద్య ప్రదర్శనాలు ఇచ్చారు. ఈ బృందం తాత్కాలిక నాయకుడుగావున్న బిల్లీ స్ట్రేహారన్‌కు విమానాశ్రయంలో స్వాగతమిచ్చినప్పుడు తీసినచిత్రం.



బొబ్బిలియుద్ధంలో ఎం. ఆర్. రాధా. కీ॥ శే॥ సి. ఎస్. ఆర్.

## మహాకవి తిక్కన

జీవనజ్యోతి ప్రొడక్షన్సువారు త్వరలో ప్రారంభించనున్న చారిత్రాత్మకమైన చిత్రానికి "మహాకవి తిక్కన" అని నామకరణం చేశారు. ఇంతవరకు ఎన్. టి. రామారావు, సావిత్రిలను ఎన్నుకున్నారు.

కథ : ఆరుద్ర, మాటలు : ఆరుద్ర అండ్ శ్రీ శ్రీ సంగీతం: టి. వి. నాదముని, దర్శకత్వం: కమలాకర కామేశ్వరరావు, నిర్మాత : కె. ఆర్. శివరామ్.



'గురువును'మించిన శిష్యుడులో ఒకదృశ్యం.

ఇంకా మిగిలిన నటీనటులను, సాంకేతిక వర్గాన్ని ఎన్నుకుంటున్నారు.

## మిత్రద్రోహి

మహానంది పిక్చర్సువారు తమ సాంఘిక చిత్రానికి "మిత్రద్రోహి" అని నామకరణం చేశారు. ఈ చిత్రములో అక్కినేని నాగేశ్వరరావు, జమున, గుమ్మడి, రేలంగి, గిరిజ, పద్మనాభం మొదలగువారు నటిస్తారని తెలుస్తోంది.

ఈ చిత్రానికి సంగీతం : ఎస్. రాజేశ్వరరావు, దర్శకత్వం : ప్రత్యగాత్మ, నిర్మాత : పి.ఉదయభాస్కర్.

## దొంగనోట్లు

ఉషా ఫిలింస్ (హైదరాబద్) వారు సమర్పించు రమణి పిక్చర్స్ వారి "దొంగనోట్లు" సాంఘిక చిత్రం త్వరలో ఆంధ్రదేశ మంతటా విడుదల చేయుటకు సర్వ సన్నాహాలతో సిద్ధమౌతోంది. చిత్రంలో ఎం. జి. రామచంద్రన్, నంబియార్, అశోకన్, నగేష్, బి. సరోజాదేవి, ఎం. వి. రాజమ్మ మొదలగువారు నటించారు. పాటలు, మాటలు : అని శెట్టి, సంగీతం : పెండ్యాల శ్రీనివాస్, దర్శకత్వం: కె. శంకర్, ప్లేబాక్ : ఘంటసాల అండ్ సుశీల, నిర్వహణ : శ్రీ మణియ్యర్ అండ్ శ్రీ పాతూరి సుబ్బారావు.

## గురువుమించిన శిష్యుడు

విఠల్ ప్రొడక్షన్స్‌వారి చిత్రం "గురువును మించిన శిష్యుడు పూర్తి అయింది. సెప్టెంబరు 11 వ తేదీనుండి గోల్డెన్ స్టూడియోలో రీ రికార్డింగ్ ప్రారంభించారు. సంగీత దర్శకుడు కోదండపాణి యీ చిత్రానికి తగిన రీతిని రీ రికార్డింగ్ జరిపిస్తున్నట్టు తెలుస్తుంది.

ఈ చిత్రంలో రామచిలుక, నాట్యంచేసే గుర్రం, గొర్రె, పొట్టేళ్ళ పందాలు, పులులు వాటితో కావలసిన రీతిని చిత్రీకరించినందుకు విఠలాచార్య ఘటికుడనిపించుకున్నారు.

ఈ చిత్రంలో కాంతారావు, కృష్ణకుమారి, రాజనాల, రాజశ్రీ, ముక్కామల, సత్యన్నారాయణ, బాలకృష్ణ, లక్ష్మీదేవి, బృందావనం, రమాదేవి, లంకా సత్యం మొదలగువారున్నారు.

రచన : జి. కృష్ణమూర్తి, నిర్మాత— దర్శకుడు బి. విఠలాచార్య.

ఈ నెలలో యీ చిత్రం విడుదలవనున్నది.

## చూడబోతే చుట్టాలే

పి. జి. చౌదరి సమర్పించు స్వాతి ఫిలింస్‌వారి "చూడబోతే చుట్టాలే" సాంఘిక చిత్రం త్వరలో ఆంధ్రదేశ మంతటా విడుదలయ్యేందుకు సర్వ సన్నాహాలతో సిద్ధమౌతోంది. ఈ చిత్రంలో జమున, కళ్యాణకుమార్, ఎం. ఆర్. రాధా మొదలగువారు నటించారు. "కుక్క" ప్రదర్శన ప్రత్యేకత. కూర్పు : జి. ఎస్. కృష్ణమూర్తి, సంగీతం : బాబూరావు, నిర్మాత: బ్రహ్మానందం వెంకటేశ్వరరావు.

## పాతాళ నగరి

చిత్ర, అజాద్, బి. ఎం. వ్యాస్, రాంకుమార్, హెలెన్ నటించిన సాహసోపేతమైన పోరాటములతోనూ, మంత్రశక్తి, మంత్రజాలములతోనూ కూడిన ప్రేమపూరితమైన చిత్రము. కింగ్‌కాంగ్ బ్రహ్మాండమైన కృషి కుస్తీ యీ చిత్రంలోని ఒక ప్రత్యేకత. సంగీతం బి. ఎన్. బాలి, డైరెక్టర్ : ప్రొడ్యూసర్ : కుమార్.

## సెట్టుమీద "దేశద్రోహులు"

రాము కుటుంబం డబ్బుతో తులతూగుతున్న రోజులు. లీల తండ్రి రామును అప్పుడప్పుడు రాముకు మా లీల నిచ్చి వివాహం చేయించండి అని ప్రాధేయపడే రోజులు కూడా లేకపోలేదు. రాము, లీల చిన్నప్పటినుండి ఎక్కువ కలిసి ఆడుతూ, తిరుగుతూ పెద్దవారయ్యారు.

రాము తండ్రి చనిపోతాడు. కుటుంబం చితికి పోతుంది. పేదరికంతో పడతారు.

లీల తండ్రి భుజంగరావు మనస్సు మారుతుంది. దరిద్రులకు నా కూతురిని యిచ్చి అది బాధపడుతూంటే చాల కష్టం అనుకుంటాడు. రాము కిచ్చి తనను వివాహం చేయమని లీల తండ్రిని ఒకే కోరికగా అడుగుతుంది.

"సరే" అంటూ నిశ్చయ తాంబూలం తీసుకొనే రోజున భుజంగరావే మోసంచేసి రామును అరెస్టు చేయిస్తాడు.

"డబ్బులేక దరిద్రుడయినా ఫరవాలేదు. పరువు ప్రతిష్ఠ లేనివాడిని ఎందుకమ్మా" అంటాడు. భుజంగరావు విధవ చెల్లెలు అందుకుంటుంది. అన్న దగ్గరకు చేరుతుంది.

"మే మందరం ఆడవాళ్ళమే, మేము యిలాగ మొగవాళ్ళ వెనుకపడి పెళ్ళిళ్ళు చేసుకున్నామా. నేను తీసుకువచ్చి పెళ్ళి పీటమీద కూర్చోబెడతాను. ఈ ముహూర్తానికే ఎవరికైనా యిచ్చి వివాహం చేసేద్దాం" అంటుంది.

భుజంగరావు తనకు నచ్చినవాని కిచ్చి శీలను వివాహం చేస్తాడు. అల్లుడు (కాంతారావు) పెద్ద వ్యాపారి.

మార్యాపేటలో నాటకానికి అధ్యక్షత వహించి అర్ధరాత్రి కారులో వస్తూంటాడు అల్లుడు. తనను చంపి భుజంగరావును వశపరుచుకుందామని ఎదురుచూస్తున్న జోగిందర్ (రాజనాల) తన అనుయాయుల్ని పంపించి అటకాయిస్తాడు. వెనుక నాటకం కంపెనీవాళ్ళు వచ్చి భుజంగరావు అల్లుణ్ణి రక్షిస్తారు. ముఖ్యంగా రామూ సాహసిస్తాడు. దొంగలముఠా పారిపోతారు. కారు గాలి కూడా తీసేసినందువల్ల, నాటకంవాళ్ళ కారులోనే ఇల్లు చేరుకుంటాడు. రాముని యింట్లోకి ఆహ్వానిస్తాడు. ఇంకా చాలామంది ఉన్నారనీ, తర్వాత కలుసుకుంటానని రాము అంటాడు. శీల భర్త తన పుట్టిన రోజుకు రమ్మనమని ఆహ్వానిస్తాడు. రాము కారులో కూర్చొని బయలుదేరుతాడు. శీల తలుపు తెరుస్తుంది. విషయం తెలుసుకుంటుం "పిలవలేకపోయారా" అంటుంది. "పుట్టిన రోజుకు ఆహ్వానించాను" అంటాడు.

ఆరోజు శీల భర్త పుట్టినరోజు పండగ మహా వైభవంగా జరుగుతుంటుంది. రాము వస్తాడు. రాముని శీలకు, శీలకు రాముని శీల భర్త పరిచయం చేస్తాడు. ఇద్దరూ చూచుకొని ఆశ్చర్యపోతారు. రాము "పియానో" మీద పాట పాడుతాడు. రాము, శీల ప్రవర్తనమీద, శీల భర్తకు అనుమానం కలుగుతుంది. రాముని కొడతాడు కూడా. విషయం తెలియని రాము "తనవలన ఏమైనా తప్పుంటే క్షమించమని" వెళ్ళిపోతాడు.

జోగిందర్ శీల భర్తను బందీ చేస్తాడు. ఆ విషయం ఆ వూరిలో "లేడీస్ వెల్‌ఫేర్ ఆఫీసరు"గా పనిచేస్తూ రాము ఇంటికి దగ్గరలో ఉన్న కరుణ ద్వారా, రాముకి తెలుస్తుంది.

రాము శీల యింటికి పరుగెత్తు కెళ్ళాడు విషయం తెలుసుకుందామని. రాముని చూసేసరికి శీల తన జీవితం పాడు అయిందని, యిప్పుడు నీవు వచ్చినట్టు ఆయనకు తెలిస్తే యిటుపైనా ముఖం కూడా చూడరని, వెంటనే వెళ్ళిపొమ్మని—తన గదిలోనికి వెళ్ళిపోతూంది. మేడపై నుండి వింటున్న భుజంగరావు రాముని పిలిచి "బాబూ, నీకు చాలా అన్యాయం చేశాను. అందుకే అనుభవిస్తున్నాను" అంటూ చింతిస్తాడు. "శీల భర్త విషయం ఏమైనా తెలుసా" అని రాము అడుగుతాడు.

"జోగిందర్—వాళ్ళు ఏమైనా చేసి ఉంటారని" అన్నాడు.

రాము శీల భర్తను విడిపించే ప్రయత్నంలో,

"మీరు శీలను జాగ్రత్తగా చూస్తూ ఉండండి. నేను శీలభర్తను తీసుకు వస్తా"నని వెళ్ళాడు.'

రాము కరుణతో......

"శీలను స్వంత చెల్లెలుగా భావించి, ఆమె శ్రేయంకోసం నా జీవితాన్ని కూడా అర్పించడానికి సిద్ధపడి వాళ్ళ ఇంటికి వెళ్ళితే, ఆఖరుకు శీల కూడా సన్నపార్థం చేసుకుంది."

"ఒక్కొక్కప్పుడు పరిస్థితుల ప్రభావానికి మానవులు లొంగిపోతారు. మీరేం బాధపడకండి మిస్టర్ రామూ!"

వాణీ పరిగెత్తుకుంటూ వస్తుంది. చేతిలో ఉత్తరం ఉంది.

"అన్నయ్యా! అన్నయ్యా! ఇదిగో నీకు ఉత్తరం వచ్చింది." అంటూ చేతిలో ఉన్న ఉత్తరం అన్నయ్య చేతికిచ్చి వెళ్ళిపోతుంది.



నర్తనశాలలో రామారావు.

రాము ఉత్తరం చదువుతాడు. నిర్ఘాంతపోతాడు. ఉత్తరం చదువుతున్నప్పుడు రాములో కలిగే మార్పులు గ్రహిస్తుంది కరుణ.

"అదేమిటి మిస్టర్ రామూ! ఉత్తరం ఎక్కడనుంచి?" రాము ఉత్తరాన్ని కరుణకు అందిస్తాడు. కరుణ చదువుతుంది.

"మిస్టర్ రామూ!

నీకూ శీలకూ మీ చిన్నప్పటినుంచి ఉన్న పరిచయం గానీ, నీ సేవరికం కారణంగా మా ఇద్దరి ప్రేమ భగ్నమయిన విషయంగానీ నాకు తెలియదు. నేను నిన్నొక ఆత్మీయుడుగా, సోదరుడిగా భావించి నా ఇంట్లో స్థానమిచ్చినందుకు ప్రతిఫలంగా నా సంసారాన్ని పాడుచేసి, నా పరువు—ప్రతిష్ఠలు మంట గలిపావు. నా జీవితం నాశనమయి పోయినా మీ ఇద్దరయినా సుఖంగా ఉండండి.

ఇట్లు,
అదృష్టహీనుడు,
రఘు"

కరుణ ఉత్తరం చదువడం ముగిస్తుంది.

"అనుమానం పెనుభూతమన్న మాట నిజం. అందులోనూ భార్య శీలాన్ని శంకించిన భర్త మానసిక వేదన చెప్పనక్కరలేదు! ఏమోనో వూహించుకొని, విద్యా, వివేకం, వివక్షణా శక్తి మొదలయిన వన్నీ కోల్పోయి, అతనేం చేస్తున్నాడో తనకే తెలియకుండా ప్రవర్తిస్తాడు! నిజం నిలకడ మీద తప్పక బయట పడుతుంది. రామూ ఈ ఉత్తరం చూసి మీరేం బాధ పడకండి! మనలో ఏ కల్మషం లేనప్పుడు లోకం మనల్ని ఎలా అనుకున్నా బాధ పడవలసిన పనేమీ లేదు. మనవల్ల అయ్యే సహాయం మనం చేసుకుంటూ వెళ్ళడమే మన కర్తవ్యం."

ఈ సన్నివేశంలో రాముగా యన్. టి. రామారావు, వాణీగా కుమారి ఇంద్రాణి కరుణగా జానకి పాల్గొన్నారు.

* * *

అది కరుణ ఇల్లు. ఉత్తరం వస్తుంది.

"అమ్మా! అమ్మా! మన ఆస్తంతా మన కొచ్చేస్తుందే."

"ఎవరు చెప్పారమ్మా!"

"ఇదిగోనమ్మా — కోర్టునుంచి ఉత్తరం వచ్చింది. మనం అక్కడకు వెళ్ళి న్యాయమూర్తి ఎదుట సంతకాలు చేస్తే మన ఆస్తి మనకు వస్తుందని తెలియ జేశారు. ఇప్పుడే వస్తానమ్మా!" అంటూ రాము ఇంటికి వెళ్తుంది

"ఆ పరమేశ్వరుడి కెన్నాళ్ళకు దయ కలిగింది తల్లీ. స్వామీ ఇక... ఇక నా లోకమే కోరిక! మా కరుణని కూడా ఓ ఇంటిదాన్ని చేశావంటే నా బాధ్యత తీరిపోతుంది తండ్రీ!"

రాముని తలుచుకుంటూ వూహాలో పరుగెడుతూ తనని తనే మరచి కళ్ళు మూసి ఆలోచిస్తూ నిలబడింది. కరుణ. తనలో స్వగతం పలుకుతుంటుంది.

"ఈ సంగతి రామూ వింటే ఎంత సంతోషిస్తాడో పాపం డబ్బుకు చాలాఇబ్బంది పడుతున్నాడు. మనకిక ఏ బాధలూ ఉండవు. ఈ వంచకుల్నా, ద్రోహుల్నా మధ్య నుంచి వెళ్ళిపోయి— ఏదైనా పవిత్రమైన ప్రదేశంలో నివాసం ఏర్పాటు చేసుకుందాం. ఇదేమిటి? కరుణా అని నువ్వడిగితే నీతో నేనేమని చెప్పగలను రామూ! నిన్ను చూస్తేనే నాలో ఏదో తెలియని ఆనందం రేకెత్తుతుంది! నీతో అది ఎలా చెప్పాలో నా కర్థం కావడంలేదు రామూ!

# అవీ - ఇవీ - అన్నీ

వాణీ వచ్చి కరుణను చూస్తుంది.

"అక్కాయ్ -కరుణక్కాయ్ ! అదేమిటి సుం వాని విద్రపోతున్నావ్ ?"

"ఆః— ఎవరు ? వాణీ — వాణీ అన్నయ్య వీడీ ?"

"అన్నయ్య— గోపీ కలిసి ఏదో తొందరపని మీద వెళ్ళారక్కయ్యా— రావడానికి కొంచెం ఆలశ్యమవుతుందని కూడా చెప్పి వెళ్ళారు."

"చూడు వాణీ ! మనకు చాలా డబ్బు వచ్చిందమ్మా ! ఇక నుండి మనం పేదవాళ్ళం కాము! నీకు మంచి బట్టలూ బొమ్మలూ అవీ కొనిపెడతాను. అన్నయ్య రాగానే నువ్వు నాతో పరుగేసుకొచ్చి చెప్పాలి— ఏం ?"

"అలాగే నక్కయ్యా !"



లక్ష్మీ కారీతో రామారావు, కృష్ణమారి.

ఈ రెండు సన్నివేశాలు శ్రీరామా పిక్చర్సు వారి "దేశద్రోహులు" చిత్రంలోనిది. ఈ మధ్య వాహినీ స్టూడియోలో చిత్రీకరించారు.

ఈ చిత్రానికి సంగీత దర్శకుడు : యస్. రాజేశ్వరరావు, ఛాయా గ్రహపర్యవేక్షణ, నిర్మాత, దర్శకుడు బోళ్ల సుబ్బారావు, బి. ఏ.

సి. ధర్మారావు. ★

* * *

## శ్రీ చెరుకూరి రామారావు మృతి

విజయా పిక్చర్స్ అధిపతి యైన శ్రీ చెరుకూరి పూర్ణచంద్రరావుగారి కుమారుడు, తారక పత్రికా సంపాదకులు ఐన శ్రీ చెరుకూరి రామారావుగారు ఆదివారం బెజవాడలో కారు ప్రమాదానికి లోనైయ్యారు. మంగళవారం అక్టోబర్ 22 వ తేదీ తెల్లవారఝామున, బంధు మిత్రులను దుఃఖ సాగరమున ముంచి మరణించారు. వారితో కూడా వున్న వారి మిత్రుడుకూడా యీ ప్రమాదంలో మరణించారు. శ్రీ రామారావు వయస్సు 27, వారు వివాహితులు.



తెలుగు చిత్రాల్లోని కన్నడ నటి లీలావతి.

